The Largest Circulated Telugu Monthly

క్టోబర్ '94

# చతుర

రూ. 5/-



కాకాని చక్రపాణి * నూరు శిశిరాలు

# అశేష ఆంధ్ర ప్రజానీకానికి
# అశ్విని వారి మరో కానుక !

**ప్రతి 100మి.లీ. అశ్విని హోమియో హెయిర్ ఆయిల్‌తోపాటు రూ॥ 7.75 విలువైన ఒక సరికొత్త లేబుల్ గల అశ్విని మజిల్ ఆయిల్ ఉచితం.**

**అశ్విని హోమియో హెయిర్ ఆయిల్**‌తో, ప్రయోజనాలు అనేకం ! అనంతం !! రాలే జుట్టును అరికడుతుంది శిరోజాలు పెరిగేలా చేస్తుంది, జుట్టు తెల్లబడుట అరికడుతుంది, మెదడును చల్లబరుస్తుంది, మాడు నొప్పిని తగ్గిస్తుంది.

**అశ్విని మజిల్ ఆయిల్,**

- కండరాల నొప్పులు,
- బెణుకులు,
- నడుం నొప్పి,
- కీళ్ళ నొప్పులను,

సత్వరం తగ్గిస్తుంది.

మీ విశ్వాసానికి దీటుగా మీలో నవచైతన్యం నింపుతుంది !

**అశ్విని ఎంపిక మీకు అధికలాభమిక !**




**ఉచితం**

**10 మి.లీ. మజిల్ ఆయిల్**

everest/H/054/94

For healthy hair

**ASWINI**

మార్కెట్ చేయువారు :

**అశ్విని హోమియో & ఆయుర్వేదిక్ ప్రొడక్ట్స్ లిమిటెడ్,** మూసాపేట, హైదరాబాద్ - 18.

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**అక్టోబర్ 'చతుర' నవల 'నూరుశిశిరాలు'**

**సమీక్షకుని పేరు :** ..............................

**చిరునామా :** ..............................

..............................

..............................

..............................

# విపుల

# చతుర







# 200

సంచికలు వెలువడుతున్న సందర్భంగా

కథలు, నవలలకు సాహిత్యపురస్కారాలు

# రు: 1,00,000/-

బహుమతులు!!

# చతుర

తెలుగు పత్రికా చరిత్రలో ఒక వినూత్న ప్రయో గంగా, కేవలం నవలల ప్రచురణకే ప్రత్యేకించిన మాసపత్రికగా అవతరించింది చతుర.

ప్రచురించే నవలలన్నీ ఉత్తమాభిరుచులుగలవి గా ప్రశంసలనందుకున్న నవలా మాసపత్రిక 'చతుర'.

ఎందరో నూతన రచయితలకు, రచయిత్రులకు అవకాశమిచ్చి ఆ క్రమంలో వారు నవలా రచనా రంగంలో స్థిరప్రతిష్టులయేందుకు తోడ్పడింది చతుర.

1978 ఫిబ్రవరిలో ప్రారంభమై 1986 మే నెలలో 100వ సంచిక వెలువడిన సందర్భంగా పెద్దఎత్తున నవలల పోటీలు నిర్వహించి అక్షరాలా యాభైవేల రూపాయల బహుమతులు అందజేసింది చతుర.

1994 సెప్టెంబర్ సంచిక 200వ సంచికగా వెలువడుతూన్న సందర్భంగా మరోసారి సాహితీ పరులను భారీగా సన్మానించదలచి నవలల పోటీలు ప్రకటిస్తోంది చతుర.

**ఉత్తమ నవలలకు బహుమతులు:**

| | |
|---|---|
| ప్రథమ బహుమతి | రు. 15,000/- |
| ద్వితీయ బహుమతి | రు. 10,000/- |
| తృతీయ బహుమతి | రు. 7,500/- |
| రు. 5000/- చొప్పున అయిదు ప్రోత్సాహక బహుమతులు | రు.25, 000/- |

★ నవలల ఇతివృత్తం ఏ ప్రాంతంలో జరిగేదయినా, తెలుగువారి జీవితాలకు సంబంధించినదై ఉండాలి.

★ "చతుర"లో నవలలు అచ్చులో 100 పేజీలు దాకా ఉంటాయి. సాధారణంగా 36,000 పదాలున్న నవలలు 'చతుర'లో 100 పేజీలకు సరిపోతాయి. అందరూ అరఠావులమీదే రాస్తున్నా, రకరకాల దస్తూరీలవలన అచ్చులో హెచ్చుతగ్గులు వస్తుంటాయి. కనుక రాతప్రతిలో ఒకరి దస్తూరీలో, ఒక పేజీలో ఎన్ని పదాలు (వాక్యాలు, పేరాలు, లైన్లు లెక్కించే పద్ధతి కాదు) వస్తున్నాయనే దానిని బట్టి నవల 36,000 పదాలకు తక్కువ గాకుండా ఉండేలా జాగ్రత్తపడటం అవసరం.

★ నిడివి విషయంలో ప్రత్యేకంగా ఈ సూచనలను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కోసం రాసిన నవలలే పరిశీలనార్హాలవుతాయి. నవలసైజు కావలసిన దానికన్నా పెద్దదిగా ఉండవచ్చుగానీ, చిన్నదిగా మాత్రం ఉండరాదు.

★ బహుమతులు పొందని నవలల్లో అర్హమైనవ నుకున్నవాటిని సాధారణ ప్రచురణకు ఎన్ను కునే అవకాశం ఉంది.

★ నవలలను ప్రచురించే సమయంలో అవసరా న్ని బట్టి కుదించవలసివచ్చినా, సరిచేయవల సివచ్చినా, సంపాదకులాపనిచేయడానికి అభ్యంతరం లేనివారే పోటీలకు నవలలు పంపాలి.

★ నవల తొలిపేజీలోగానీ, మలిపేజీలోగానీ, మరెక్కడగానీ నవల పేరు తప్ప రచయి త/రచయిత్రి పేరు, చిరునామా ఏవీ ఉండ గూడదు. నవల పేరు, రచయిత/రచయిత్రి పేరు, పూర్తి చిరునామా విడిగా ఒక షీటుపై రాసి నవల తొలిపేజీకి ముందు పెట్టాలి. ఆ షీటులోనే నవల అనువాదంగాని, అనుసరణ గాని కాదనీ, గతంలో ఎక్కడా, ఏ రూపంలో నూ ప్రచురితం కాలేదనీ స్వీయరచనేననీ, మరో ప్రతి ఏ పత్రికలోనూ పరిశీలనలో లేదనీ హామీపత్రం కూడా రాయాలి.

★ బహుమతులకుగాని, సాధారణ ప్రచురణకు గాని ఎన్నికగాని నవలలను త్రిప్పి పంపేందుకు తగుపోస్టేజిని నవలతోపాటే జతపరచాలి. అలా కానిపక్షంలోనూ, నవల లు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత పోస్టేజి పంపు తూ, ఉత్తరాలు రాయటంవలన ప్రయోజనం ఉండదు.

★ బహుమతుల నిర్ణయం, ఇత్యాది విషయాల న్నింటిలోనూ, న్యాయనిర్ణేతలు, సంపాదకుల దే తుదినిర్ణయం. ఈ విషయంలో ఎలాంటి వాదవివాదాలకు, ఉత్తర ప్రత్యుత్తరాలకు అవ కాశం లేదు. గడువుతేదీ ముగిశాక మాకు అందే నవలలు పోటీకి పరిశీలింపబడవు.

★ **నవలలు మాకు చేరవలసిన**
***ఆఖరుతేదీ 31 అక్టోబర్ 1994.***

ఎడిటర్
**చతుర**
ఈనాడు కాంప్లెక్స్,
హైదరాబాద్-500 482.

# విపుల

మరే భారతీయ భాషా పత్రికారంగంలోనూ లేని విశిష్ట ప్రయోగం "విపుల"

పూర్తిగా కథాసాహిత్యానికే అంకితమైన ఏకైక పత్రిక "విపుల"

తెలుగు కథలతోపాటు వివిధ భారతీయ భాషలు, విదేశ భాషలనుండి ఎన్నిక చేసిన ఉత్తమ కథలకు వేదిక "విపుల"

"ఏ భాషకు, సంస్కృతికి చెందిన కథనయినా ఆసక్తిగా చదివింపజేసే అనువాదాలతో పాఠకులకు విశ్వసాహిత్యాన్ని పరిచయం చేస్తున్న ప్రయోగ శీలి "విపుల"

1978 ఫిబ్రవరిలో ప్రారంభమై, 1986 మే నెలలో 100వ సంచిక వెలువడిన సందర్భంగా తొలిసారిగా భారీ బహుమతులతో 16 భారతీయ భాషల కథలకూ పోటీలు నిర్వహించింది "విపుల"

1994 సెప్టెంబరులో 200వ సంచిక వెలువడుతున్న సందర్భంగా మరలా కథల పోటీలు నిర్వహిస్తూ ఈసారి ప్రత్యేకంగా ఉత్తమ తెలుగు కథలకు విలువైన బహుమతులు ప్రకటిస్తోంది "విపుల"

ప్రథమ బహుమతి... రు. 7,500/-
ద్వితీయ బహుమతి... రు. 5,000/-
తృతీయ బహుమతి... రు. 3,000/-

రు. 1500/- చొప్పున
18 ప్రోత్సాహక బహుమతులు...
రు. 27,000/-

ఇతివృత్తం విషయంలో పరిమితులు లేవు. తెలుగువారి జీవితానికి సంబంధించినదయి ఉండి, ఆసక్తికరంగా చదివించే, ఆలోచింపజేసే, నూతన ప్రయోగాలతో ఆకట్టుకునే కథలకు ప్రత్యేక ప్రాధాన్యత!

★ అనువాదాలు, అనుసరణలు పంపనవసరం లేదు.

★ కథల నిడివి విషయంలో పరిమితులు లేవు. కథనంలో నైపుణ్యతే ప్రధానం.

★ కథల వ్రాతప్రతులలో మొదటి పేజీనుండి చివరి పేజీవరకూ ఎక్కడా రచయిత/రచయిత్రి పేరుగాని, చిరునామాగాని రాయకూడదు. మొదటిపేజీలో కథ పేరు మాత్రమే రాయాలి. విడిగా మరో షీటుమీద కథ పేరు, రచయిత/రచయిత్రి పేరు, పూర్తి చిరునామా, కథ స్వంతమే అనువాదంగాని, అనుసరణగాని, కాపీ కాదనీ, అముద్రితమనీ హామీ రాసి కథకు జతపరచాలి. ఆ కథ మరే పత్రికకూ పరిశీలనార్థం పంపి ఉండకూడదు.

★ బహుమతి పొందని, సాధారణ ప్రచురణకు ఎన్నిక గాని కథలను త్రిప్పి పంపేందుకు స్వంత చిరునామా రాసి తగినన్ని స్టాంపులు అతికించిన కవరు జతపరచాలి.

★ కలం పేరు ఉపయోగించినా, పూర్తిపేరు కూడా తెలియజేయాలి.

★ ఉత్తమ కథల ఎన్నిక, బహుమతుల నిర్ణయం విషయాలన్నింటా న్యాయనిర్ణేతలు, సంపాదకులదే తుదినిర్ణయం. ఈ విషయంలో ఎలాంటి చర్చకు, ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

★ కవరుమీద "కథల పోటీకి" అని ప్రత్యేకంగా పేర్కొనాలి.

★ ***రచనలు మాకు చేరవలసిన ఆఖరుతేదీ 15 అక్టోబర్ 1994.***

ఎడిటర్

**విపుల**

ఈనాడు కాంప్లెక్స్,

హైదరాబాద్-500 482.

సచిత్ర విచిత్రం

# బతుకులు వేరయినా బాధ ఒక్కటే!



పుట్టుకతోపాటు జబ్బుల్నీ, దెబ్బల్నీ కూడా సమంగా పంచుకుంటూ వస్తున్నారీ కవల సోదరీమణులు కార్థిన్, మాండీలు. ఆరేళ్ల వయసప్పుడు కార్థిన్‌ని ఓసారి ఆపరేషన్ నిమిత్తం హాస్పటల్‌లో చేర్చారు. మత్తుమందు ఇవ్వగానే ఇంటివద్ద వున్న మాండీకి కూడా అదే సమయానికి వాంతులు కావడం, స్పృహతప్పి మత్తులోకెళ్లడం జరిగింది. ఒకసారి మాండీ గుర్రం మీంచి పడిపోయి ఎడమ చెయ్యి విరగ్గొట్టుకుంది. తిరిగి సరిగ్గా అయిదు నెలలకు కార్థిన్ కూడా అదే సమయానికి అలాగే గుర్రం మీంచి పడిపోయి ఎడమచెయ్యి విరగ్గొట్టుకుంది.

# చతుర

సంపుటి: 17 సంచిక: 9 అక్టోబర్ 1994

"బాలం, ముకుందం, మనసాస్మరామి" అని సదా అనుకునే ఆ సాధ్వి సకల జీవులలోనూ బాలకృష్ణుడినే చూడటానికి ప్రయత్నించింది.

వెలుగునీడల్లా కష్టసుఖాలు సమ్మిశ్రితంగా నడువవలసిన ఆమె జీవితంలో వసంతం తొంగి చూడకపోయినా...

నూరు శిశిరాల హిమసన్నిష్టమైన బతుకులో ఆమె నికృష్టంగా కూరుకుపోయినా...

ఏనాడూ మొక్కవోని ధైర్యంతో జీవితమనే ఏటికెదురీదిన ఆమె మనసును అల్లకల్లోలపరచి, అగాధాల అంచులకు నెట్టిన అనూహ్య సంఘటన ఏమిటి?

"ప్రాణ ప్రయాణ సమయే మమసన్నిధత్తాం" అంటూ వేడుకున్న ఆమె ప్రార్థనని ఆమె నమ్ముకున్న ఆ నందకిశోరుడు ఆలకించాడా?

హృదయపు లోతులను స్పృశించే **కాకాని చక్రపాణి** రచన **'నూరు శిశిరాలు'** ఈ నెల చతుర సమగ్ర నవల.



స్కూలు ఆవరణలో చిన్నపిల్లలు వలయంగా కూర్చుని బంతి ఆడుతూంటే 'గోపికకూ గోపికకూ మధ్య గోపాలుడు, గోపాలుడికీ గోపాలుడికీ మధ్య గోపిక. అలా ఏర్పడ్డ వలయంలో మధ్యనున్న గోపాలుడు, దేవకీ నందనుడు మనోజ్ఞంగా వేణు వూదుతున్నట్లు అన్పించింది రంగనాయకమ్మకు.

'అంగనా మంగనా మంతరేమాధవో
మాధవం మాధవం చాంతరేణాంగనా
ఇద్దమా కల్పితే మండలే మధ్యగః
సంగగౌ వేణునా దేవకీ నందనః?

అన్న శ్లోకం ఆమె మదిలో మెదిలింది.

ఓ క్షణం ఆ ఆట చూస్తూ అక్కడే నిలబడి పోయిందామె. మరుక్షణం తెలివితెచ్చుకుని క్లాసురూంవైపు నడిచింది.

క్లాసు చివరి పీరియడ్ నడుస్తున్నది. రంగనాయకమ్మ కిటికీలోనుండి లోపలకు తొంగి చూసింది. బాలకృష్ణులంతా ఎవరి ధ్యానంలో వాళ్లున్నారు. ఒక్కరూ పాఠం వింటున్నట్టు లేదు. కిటికీ పక్కనున్న పిల్లలు టీచరు చూడకుండా గిల్లుకుంటున్నారు, రక్కుకుంటున్నారు. ఆ పక్కనున్న పిల్లవాడు తోటిపిల్లవాడిని జుట్టు పట్టుకులాగితే, వాడు వీడి ముఖంమీద ఉమ్మేశాడు. ఈ పక్కనున్నవాడు తన పొరుగున జరుగుతోన్న మూడో ప్రపంచయుద్ధాన్ని పట్టించుకోకుండా నోటుబుక్కులో బొమ్మలు గీసుకుంటున్నాడు.

కిటికీ పక్కనున్న రెండవ వరసలో ముందువైపు కూర్చున్న నందకిశోర్ టెక్స్టు బుక్‌ని ఓ పక్కకి తోసేసి, సంచీలోనుండి చిన్న అట్టపెట్టెతీశాడు. దాంట్లో బొంగరంలాంటి చక్రం వుంది. దాని ముల్లుకి అయస్కాంతం వుంది. చేప, నక్షత్రం, అర్ధచంద్రుడు లాంటి ఆకారాలతో చేసిన రేకుముక్కలు ఉన్నాయి. బల్లమీద చక్రాన్ని తిప్పి చేపని వదిలాడు నందుడు. తిరుగుతున్న చక్రంముల్లుకు దానినాకర్షించి దాన్ని అంచుల చుట్టూ తిప్పింది.

"నక్షత్రం వదల్రా" అన్నాడు బాబు మెల్లగా, కుతూహలం పట్టలేక.

"ఉండు చేపపని కానీ" అన్నాడు నందకిశోర్.

అయితే బాబుకంత ఓపిక లేదు. నక్షత్రాన్ని తీసి చక్రం ములిక్కి దగ్గరగా పెట్టాడు. చేపా నక్షత్రం ఢీకొని ఏదీ కదలలేదు.

నందుడికి కోపం వచ్చింది. డయాస్‌వైపు తలెత్తిచూసి, టీచరు తమను చూడటం లేదన్న నిర్ధారణ కొచ్చింతర్వాత, బాబు జుట్టు పట్టుకు లాగాడు.

అప్పుడు చూశాడు బాబు బామ్మని. బామ్మ సైగచేసింది. నందుడు పక్కకి తోసేసిన పుస్తకాన్ని తీసి ఆమెకందించాడు బాబు కిటికీ లోగుండా. నందుడు ఇదేం గమనించేస్థితిలో లేడు. మళ్ళీ చక్రాన్ని తిప్పి ఈసారి అర్ధచంద్రుణ్ణి వదిలాడు.

"ఒరే నన్నొక్కసారి తిప్పనివ్వవూ" అనడిగాడు బాబు.

"మరే! రమ్మన్నారు తిమ్మన్న బంతికి. మొన్న కృష్ణుడి బొమ్మ నాకిచ్చావూ" అన్నాడు నందుడు.

"ఇప్పుడు తీసుకో" అని సంచీలో చెయ్యిపెట్టాడు బాబు.

"నాకిప్పుడేం అక్కర్లేదు"

"మరయితే నన్ను తిప్పనివ్వవా?"

"ఇప్పుడు కాదు, రేపు"

ఇంతలో ఇంటి బెల్లు గణగణా మోగింది. నందుడు పుస్తకం కోసం చూసి బాగులో పెట్టాననుకున్నాడు. నిర్ధారణ చేసుకునే ఓపిక, తీరిక లేవు వాడికి. మిగతా పిల్లలు తనకంటే ముందు క్లాసులోనుండి బయట పడ్తారేమోననే ఉద్దేశంతో గబగబా పెట్టెలో చక్రం, రేకుబిళ్ళలూ పెట్టేసి, దాన్ని సంచిలోకి తోసేసి, ఒక్క ఉదుటున లేచి గదిలోంచి బయటపడ్డా

కవర్‌ఫోటో : వికీహండా

డు. బాబు వాడిననుసరించాడు.

బామ్మ బయట కనపడి, "నందూ! పుస్తకాలన్నీ జాగ్రత్తగా సర్దుకున్నావా?" అనడిగింది.

"వుంటయ్యిలే బామ్మా! ఎక్కడకు పోతయ్యి'' అన్నాడు వాడు.

"చూడు బామ్మా! వీడు నా జుట్టు పీకాడు'' అన్నాడు బాబు.

"ఏంపనిరా అది నందూ?" అనడిగింది బామ్మ.

"మొన్న వాడు నా వీపుమీద గుద్దాడు'' అన్నాడు నందుడు.

"మరి నువ్వు నా సంచీలోనుంచి జాంపండు కాజెయ్యలే'

"నన్నడగకుండా నా సంచీలో చాక్లెట్లెందుకు తిన్నావు మరి?"

"ఒరే ఎందుకురా కొట్లాడుకుంటారు. మీరంతా బలరామకృష్ణుల్లా కలసిమెలసి వుండాలి. ఒకచోట చదువుకునే పిల్లలు కొట్లాడుకోవచ్చా?"

నందుడు మాట్లాడలేదు. కోపంగా బాబు వంక చూశాడు.

"బామ్మా! చేపకంటే నక్షత్రం బాగా తిరుగుతుందికదూ?" అనడిగాడు బాబు.

"ఏంకాదు, చేపే బాగా తిరుగుతుంది'' అన్నాడు నందుడు.

"వెనకటికో చేప నక్షత్రంతో స్నేహం చేసింది..."

"కథా... బామ్మా! చెప్పు, చెప్పు'' అన్నాడు బాబు.

ఇంతలో నందుడి స్నేహితులు హరి, రాజు, విజయ, గోపీ కూడా చుట్టూ చేరారు.

"ఇంటికెళ్ళి చెప్పుకుందాం" అంది బామ్మ.

"కాదు, దోవలో చెప్పు బామ్మా!" అన్నాడు హరి.

అందరూ బయలుదేరారు. బామ్మ కథ చెప్పటం మొదలెట్టింది.

"వెనకటికో చేప ఓ పెద్ద సరస్సులో వుండేది. అది అందంగా వుండేది. రత్నాల్లా మెరిసే పొలుసులు, దొండపండులాంటి మొప్పలు, చక్రాల్లాంటి కళ్ళు, చక్కటి పక్కరెక్కలతో, సన్నగా రివటలా వుండేది. సరస్సులోని ఇతర చేపకన్నెలకన్నా తనే మహా అందంగా వుంటుందని దానికి గర్వం. వయసు రాంగానే దాని అమ్మా, అయ్యా దానికి పెళ్లి చేయ సంకల్పించారు. అయితే సరస్సులోని ఏ మగచేపా దానికి నచ్చలేదు. అవి ఏవీ తన అందానికి తగవనుకుంది. ఓరోజు రాత్రి, ఆకాశంలో ఓ కాంతివంతమైన నక్షత్రాన్ని చూసింది అది. ఆ నక్షత్ర సౌందర్యానికి భ్రమసి దాని మోహంలో పడిపోయింది బుల్లిచేప..."

"నక్షత్రం చేపనెట్టా చేసుకుంటుంది బామ్మా! చేప నీటిలో వుంటుందాయె, నక్షత్రం ఆకాశంలో కదా!" అడిగాడు రాజు.

"అవును. అయినా వయసులో ఆ అంతరాలేం పట్టవుకదా! తన ప్రయత్నలోపం చెయ్యలేదు చేపరాకుమారి. ఓరోజు ఆకాశం నిర్మలంగా వుంది. సరస్తీరంలో చల్లటి గాలి వీస్తోంది. చుట్టూ వెన్నెల తెల్లగా పర్చుకునివుంది. వెదురుతోటనుండి సాంద్రమందరంగా వేణుగానం విన్పిస్తోంది. సర్వప్రపంచాన్నీ తనలో లయించుకుంటోంది. అయినా ఆ మనోజ్ఞ వేణుగానం వినేస్థితిలో లేదు ఆ చేపరాకుమారి. ఇంటికొచ్చే తొందరలో నందుడు పుస్తకాన్ని మర్చిపోయినట్లు, అదీ ఆ వేణుగానాన్ని పట్టించుకోలేదు'' అంది రంగనాయకమ్మ మనవడికి పుస్తకమిస్తూ.

"సారీ బామ్మా!" అన్నాడు నందుడు పుస్తకం బ్యాగులోకి తోసేస్తూ.

"'సహసావిదధీత నక్రియాం' హడావుడిపడ్తూ ఎవరూ ఏ పనీ చెయ్యరాదు. నెమ్మదిగా

ఆలోచించి చెయ్యాలి. పుస్తకాలపట్ల అలా నిర్లక్ష్యంగా వుండొచ్చా?" అంది బామ్మ.

"సారీ చెప్పాగా బామ్మా! ఇహనుండి జాగ్రత్తగా వుంటాలే" అన్నాడు నందుడు.

అందరూ ఇంటికొచ్చారు. తాళంతీసి, బామ్మ లోపలికి వెళ్లి కాళ్లు కడుక్కుని వచ్చి సోఫాలో కూర్చుంది. ఆమె చుట్టూతా చేరారు పిల్లలు.

"అప్పుడేమయింది బామ్మా!" అనడిగాడు గోపీ ఆత్రుతగా.

"ఆ చేపరాకుమారి నీటి పైభాగానికొచ్చి తలెత్తి నక్షత్రాన్ని పిల్చింది. 'ఓ నక్షత్రకుమారుడా! నువ్వెంత అందంగా వున్నావు! ఎంత కాంతివంతంగా వున్నావు! ఎంత రూపసివి!!! నీ సౌందర్యం నన్ను పిచ్చిదాన్ని చేస్తోంది. రా, నాతో స్నేహం చెయ్యి, నన్ను పెళ్లి చేసుకో అని అర్థించింది''

"అంతదూరమున్నా ఆ మాటలు విన్పించాయా బామ్మా?" అనడిగాడు హరి.

"హృదయమంతటి ఆక్రోశంతో అర్థిస్తే ఎందుకు విన్పించదు? విన్పించింది. నక్షత్రం కిందకు చూసింది. 'ఎవరూ?' అంది''

"నేను చేపరాకుమారిని''

"ఛీఛీ! ఎంత వికారంగా వున్నావు. పెళ్లి సంగతలావుంచి నీతో అసలు స్నేహం ఎలా చేయగలను?"

"అయ్యో! నిన్ను మోహించానే, నువ్వంటే ఎంతో ఆశపెట్టుకున్నానే'' అంది చేప.

"నేను చంద్రమ్మని ప్రేమిస్తున్నాను. ఆమె ఎంత అందంగా వుంటుందో?" అన్నాడు నక్షత్ర కుమారుడు.

చేప రాకుమారికి ఏంచేయాలో తోచలేదు.

"మరి చందమామ నడిగావా?" అంది దిగాలుపడిపోయి.

"చూడు, ఇప్పుడే అడుగుతాను. నా అంత అందగాడు అడగటమేమిటి, ఎంతెంత వాళ్ళయినా నన్ను పెళ్లి చేసుకోడానికి సిద్ధపడ్తారు'' అన్నాడు నక్షత్రకుమారుడు.

"ఆ ఆకాశంలో శూన్యంలో కూడా వేణుగానం వినపడుతూనే వుంది. నక్షత్రకుమారుడు కూడా దానిమీద ధ్యానముంచలేదు. చేపరాకుమారి చూస్తుండగానే చంద్రమ్మను అడిగాడు నక్షత్రకుమారుడు. "నువ్వు నాకు నచ్చావు, నేను నిన్ను పెళ్లి చేసుకుంటాను'' అని.

ఆ మాటలకు చంద్రమ్మ ఎగిరి గంతేస్తుందనుకున్నాడు నక్షత్రకుమారుడు. కాని, వికారంగా ముఖం పెట్టింది చంద్రమ్మ. "ఛీ ఛీ! మినుకు మినుకుమనే నిన్నా నేను పెళ్ళాడేది. నేను సూరీడుని మోహించాను. మహా తేజోవంతుడైన అతణ్ణి గూర్చి చెప్పగా విన్నాను. అతని కరుణాకటాక్ష వీక్షణాలకై ఎన్నో ఏళ్ళ నుండి అతని చుట్టూ తిరుగుతున్నాను. పెళ్ళి చేసుకుంటే సూరీడులాంటి మహిమాన్వితుణ్ణే కాని, నీలాంటి అల్పుణ్ణి మాత్రం కాదు'' అంది.

"మరి సూరీడుని అడిగావా?" అన్నాడు నక్షత్రకుమారుడు దీనంగా.

"కనపడితేగా అడగటానికి?" అంది చంద్రమ్మ ఉస్సురంటూ.

"రోదసిలో వేణుగానం వినపడ్తూనే వుంది. వలయాలు వలయాలుగా గింగురులెత్తుతూ సర్వజగత్తునూ మోహింపచేసే వేణుగానమది. అప్పుడు విన్పించింది ఆ వేణుగానం సరస్సులోని చేపరాకుమారికీ, ఆకాశంలోని నక్షత్రానికీ, చంద్రమ్మకూ.

ఆర్త హృదయాలకు ఆ వేణుగానం వినపడింది.

"ఆర్త హృదయమంటే ఏంటి బామ్మా?" అనడిగాడు నందుడు.

"ఆర్త హృదయమంటే తీరని కోరికలతో బాధపడే మనసులన్నమాట"

"సరే... ఎవరు నువ్వు వేణునాదమా? ఎప్పుడూ నువ్వు మా చుట్టూనే తిరుగుతున్నావు. మేం గమనించనేలేదు'' అని అన్నారు ఏకకంఠంతో చేపకాకుమారి, నక్షత్రకుమారు

డు, చంద్రమ్మలు.

"ఆ వేణునాదం మహాతేజోమూర్తిగా అవత రించింది. 'అలకభ్రాజితమై సుధాంసు నిభమై హాసప్రబోద్ధామమై, జలజాక్షంబయి కర్ణ కుండల విరాజద్గండమై యున్నయా జలజా తాక్షు ముఖం" వాళ్ళకు కన్పించింది.

అంటే- ముంగురులు నుదుటిపై జీరాడు తోంటే, చిరునవ్వులు చిందిస్తూ, కమల నయ నాల్తో, చెవులకు కుండలాలతో విరాజిల్లుతోన్న శ్రీకృష్ణుని ముఖం వాళ్ళకు కన్పించింది. పీతవసనధారుడూ, చేతవేణువు ధరించినవా డూ, నీలాకాశపురంగులో వున్నవాడూ అయిన దేవకీనందనుడు కన్పించాడు వాళ్ళకి.

అలా కన్పించిన కృష్ణపరమాత్మను అవి ఇలా ప్రార్థించాయి 'తేజసే స్తునమో ధేనుపాలి నే లోకపాలినే, రాధా పయోధరోత్సంగ శాయి నే శేషశాయినే'' అని.

అంటే 'గోవులను, జగములను పరిపాలి స్తూ, శేషశాయిపై శయినించే తేజఃస్వరూప మైన నీకు నమస్కారం' అని, చేపరాకుమారి, నక్షత్రకుమారుడు, చంద్రమ్మ కృష్ణపరమా త్మకు నమస్కరించారు.

కృష్ణపరమాత్మ అన్నాడు. యేయధామాం ప్రపద్యన్తే తాంస్తథైవ 'భజామ్యహం' అని, 'ఎవరేవిధంగా నన్నుపాసిస్తారో వాళ్ళకు నేను ఆవిధంగా అనుగ్రహిస్తున్నాను. నన్ను చూడగ లిగిన భక్తులు మీరు. మిమ్మల్ని అనుగ్రహిస్తు న్నాను. మీరుపాసించే రూపాల్లో మీకు ప్రత్యక్ష మవుతాను. అంతా నేనే! నేను వినా మరేంలే దు. నన్ను పొందండి, ముక్తి పొందండి'' అన్నాడు కృష్ణపరమాత్మ.

"ఆ తరవాత ఏమయింది బామ్మా?"

"ఏమయింది! ఆ వేణునాదం చేపరాకుమా రికి నక్షత్రంలా, నక్షత్రకుమారుడికి చంద్రమ్మ లా, చంద్రమ్మకు సూరీడులా కన్పించింది. వాళ్లు తమ పరదైవాల్ని ఉపాసించి మోక్షం పొందారు'' అని కథ ముగించింది రంగనాయ కమ్మ.

"మోక్షం అంటే ఏంటి బామ్మా?" అనడిగా డు హరి.

"మోక్షమంటే ముక్తి కైవల్యం, దేవుడి సాన్నిధ్యం"

అది వాళ్ళకు సరిగా అర్థం కాలేదుగానీ, కథ బాగా నచ్చింది.

"ఇంకో కథ చెప్పవా బామ్మా!" అనడిగా డు గోపీ.

"ఇప్పుడు కాదు, అందరూ ఇళ్ళకు వెళ్ళ ండి. ఏమన్నాతిని కాసేపు ఆడుకోండి. మళ్ళీ రేపు చెప్తాను'' అంది బామ్మ.

పిల్లలు పోలోమంటూ ఎవరి ఇళ్లకు వాళ్ళు వెళ్లిపోయారు.

నందుడు విప్పిన బూట్లు నొకమూలా, పుస్తకాల సంచీ ఒక మూలా విసిరేసి హడావు డిగా వాళ్ళవెంట పరుగిడబోతూవుంటే, "వుండరా నందూ! నీకు పాలు కలుపుకొస్తా ను'' అంది రంగనాయకమ్మ.

"వద్దే. ఇప్పుడు టయింలేదు. అమ్మొ చ్చింతర్వాత తాగుతాను'' అని ఆగకుండా పరుగెత్తుకుపోయాడు వాడు.

"ఓరే నందనందనా! మధుసూదనా! బాల కిశోరూ! తాగెళ్ళరా నాయనా! మీ అమ్మ వచ్చి ఏమంటుందో ఏమో..." అని ఆమె వాడి వెంటపడింది. అయితే వాడప్పటికే వీధిగేటు తీసుకుని మాయమయ్యాడు.



అది డెబ్బైరెండేళ్ల రంగనాయకమ్మ దినచ

ర్య. మనవణ్ణి స్కూల్లో దింపటం, తీసుకురావటం ఆమె డ్యూటీ. ఆమె పక్కనుంటే నందుడికీ, అతడి మిత్రులకీ ఎంతో ఆనందంగా వుంటుంది. మనవడిని స్కూల్లో దింపటం, తీసుకురావటం ఆమె విధిగా ఎప్పుడూ భావించదు. భగవదుపాసనలో అదొక భాగంగా భావిస్తుందామె. ఆమెకు ఆనందం కల్గించేపనుల్లో అదొకటి. ఆమె నందుడి బామ్మయినా, వాడి స్నేహితులందరికీ ఆమె బామ్మే. వాళ్ళెప్పుడూ ఆమె చుట్టూ తిరుగుతూంటారు.

నందుడి బూట్లు షూ స్టాండులో పెట్టి, పుస్తకాల సంచీ అలమారులో వుంచిందామె. చీపురు తీసుకుని ఇల్లు చిమ్ముతోండగా పనిమనిషి వచ్చింది. అంట్లువేసి, గదులు చిమ్మటం పూర్తిచేసింది రంగనాయకమ్మ.

పనిమనిషి తోమిన పాత్రలు తొలిచి లోపల పెడ్దామని బావిగట్టు దగ్గరకొచ్చిన ఆమె అక్కడ కన్పించిన దృశ్యం చూసి నిర్విణ్ణమై నిలబడిపోయింది.

పనిమనిషి లక్ష్మి అంట్లు ముందు పెట్టుకుని ఏడుస్తూకూర్చుంది. ఒక్క గిన్నె కూడా తోమలేదు. ఆ పరిస్థితిలో లక్ష్మిని చూసిన రంగనాయకమ్మకు అనుమానమొచ్చింది.

"ఏమయిందే లక్ష్మి! నీ మొగుడు బాగున్నాడా?" అనడిగింది.

లక్ష్మి తలూపిందిగాని సమాధానం చెప్పలేదు. లక్ష్మి మొగుడు రంగయ్య ఏ పనీ చేసేవాడు కాదు. లక్ష్మి ఆ ఇంట్లో, ఈ ఇంట్లో పనిచేసి తెచ్చిన డబ్బులతో సంసారం గడిపేది. తను ఎప్పుడైనా కూలీకి వెళ్ళి డబ్బుతెస్తే లక్ష్మికి పైస ఇచ్చేవాడు కాదు రంగయ్య. తాగితందనాలాడేవాడు. దానికితోడు పేకాట. పేకాట జోరు ఎక్కువైనకొద్దీ కూలికసలు వెళ్ళటం మానేశాడు. పేకాటకూ, తాగుడుకూ భార్య డబ్బులివ్వాల్సివచ్చేది. ఇవ్వకపోతే ఆమెని తన్నేవాడు. ఇస్తే తాగొచ్చి తన్నేవాడు, నానాయాగీ చేసేవాడు. వారంరోజుల క్రితం పేకాటలో పేచీవచ్చి ఎదుటివారితో దెబ్బలాటకు దిగాడు రంగయ్య. 'నాయాళ్ళలార! మీరు నల్గురూ కల్సి నన్ను మోసం చేస్తారా?' అని పక్కనే పడున్న వెదురుబొంగును తీసుకుని వాళ్ళల్లో ఒకణ్ణి కొట్టాడు. దాంతో మిగతా నల్గురికీ శివమెక్కింది. నల్గురూ కల్సి రంగయ్యని చావబాదారు. దొమ్మిలో అతని తల పగిలింది. మిగతా నల్గురూ పారిపొయ్యారు.

ఎవరో వచ్చి చెప్తే వెళ్లిన లక్ష్మి, తల పగిలి స్పృహతప్పి పడివున్న మొగుణ్ణి చూసి గుండెలు బాదుకుంది. గవర్నమెంటు ఆస్పత్రికి తీసుకెళ్తే అతణ్ణి ఆసుపత్రిలో చేర్చుకోటానికి అంగీకరించలేదు డాక్టరు. అది మెడికో లీగల్ కేసు, పోలీసులు చేర్పిస్తేగాని చేర్చుకోమన్నారు. పోలీసు రిపోర్టిచ్చి, పోలీసులు సలహా ఇచ్చినమీదట అతణ్ణి ఆసుపత్రిలో చేర్చుకోవటం జరిగింది. ఈ లోపల మొగుడేమయిపోతాడోనని భయపడింది లక్ష్మి. మొగుడు తల పగిలి ఆసుపత్రిలో వున్న బాధేకాక, పోలీసులతో కూడా బెడద వచ్చిపడింది లక్ష్మికి.

"ఏమయిందీ చెప్పి ఏడువు. కష్టాలు మనుషులకుకాక మానులకు వస్తాయా ఏమయిందో చెప్పు'' అనడిగింది రంగరాయకమ్మ మళ్లీ.

"ఏం లేదమ్మా'' అంది లక్ష్మి సంబాళించుకుంటూ.

"ఏంలేకపోతే ఏడవటమెందుకూ, నీ మొగుడి ఆరోగ్యం ఎట్లా వుంది?"

"మంచిగనే వుంది. రేపో, ఎల్లుండో ఇంటికి తోలవెడ్తరంట"

"మరిప్పుడు కొత్తగా వచ్చిన ప్రమాదమేంటి?"

"మా పెద్ద సచ్చినోడు... ఆడంతా ఆడినాయనే. ఆడితోనే తంటా వచ్చినాది తల్లీ!" అని మరో శోకం పెట్టింది లక్ష్మి.

లక్ష్మి ఏడుస్తూ చెప్పిన విషయమిది. ఆమె కొడుకు నర్సింహను ఓ కార్ఖానా సేటు దగ్గర

పనిలోకి పెట్టింది. పొద్దుటినుండి సాయంకాలంవరకూ పిల్లవాడి దగ్గర పనితీసుకుని నెలకు మూడొందల రూపాయలు చేతబెట్టేవాడు సేటు. అల్యూమినియం పాత్రలు తయారుచేసే కార్ఖానా అది. అల్యూమినియం షీట్లను తీసుకువచ్చి వాటిని పాత్రలుగా మలుస్తారు ఆ కార్ఖానాలో. నర్సింహ, వాడితో పనిచేసే యాదగిరీ- ఇద్దరూ కలిసి అల్యూమినియం షీట్లను సేటుకు తెలియకుండా బయటకు తరలించటం మొదలెట్టారు. ఈ దొంగతనం నెలరోజుల్లో బయటపడింది. ఓసారి దొంగతనం చేస్తూ పట్టుబడ్డారు ఇద్దరూ. యాదగిరి పారిపోయాడు, అయిపులేడు. సేటు నర్సింహను పోలీసులకు పట్టిచ్చాడు. పోలీసులు వాడిని చితకబాది ఎప్పుడు ఎంత అల్యూమినియం షీట్లను కాజేసిందీ చెప్పించారు. పది పదిహేనువేల రూపాయల షీట్లు వాళ్ళమ్మారు. నిజానికి దొంగసొమ్మవటంవల్ల, అమ్మటం చేతకాక వాళ్లకు ముట్టిన డబ్బు రెండు, మూడు వేలకంటే వుండదు. డబ్బు ముట్టినరోజు నర్సింహ ఇంటికొచ్చేవాడు కాదు. జల్సా చేసేవాడు. తినేవాడు, తాగేవాడు, సినిమాలకెళ్ళేవాడు, సానికొంపలకెళ్లేవాడు ఇంత జరుగుతున్నా లక్ష్మికేం తెలియదు.

కొడుకుని లాకప్‌లో పెట్టింతర్వాత లక్ష్మి కార్ఖానా సేటు దగ్గరకెళ్ళి అతని కాళ్ళమీద పడింది. బతిమాలింది, ప్రార్థించింది, ఎట్లాఅయినా కొడుకుని కాపాడమని మొక్కింది. సేటుకి జాలేసింది కాని అతనేం చేయగలడు? డబ్బుకీ, ప్రాణానికీ లంకె అతనికి.

"నిజమేనవ్వా! నీ కొడుకును వదలిపెట్టటానికి నాకేమీ అభ్యంతరంలేదు. నువ్వు రెండు రోజుల్లో నాకో పదివేలు తెచ్చికట్టు, నేను పెట్టిన కేసు వాపసు తీసేసుకుంటాను. నేనూ వ్యాపారం నడుపుకోవాలికదా. నీ కొడుకును జైలుకు పంపితే నాకొచ్చేద్దేమీలేదు. వాడికి శిక్షపడటం తప్ప. మరెళ్ళి డబ్బు ఏర్పాటుచెయ్యి. నువ్విటు డబ్బివ్వగానే, వాణ్ణటు విడిపిస్తాను'' అన్నాడు సేటు.

"అయ్యబాబో! నాతానేడుండాయి పదేలు? పదిపైసలు లెవ్వు'' అని మొత్తుకుంది లక్ష్మి

"మరి నన్నేం చెయ్యమంటావు. డబ్బు లేకపోతే నేనేం చెయ్యలేను'' అన్నాడు సేటు.

ఆమె వేడుకుంది, మొత్తుకుంది, కాళ్లు పట్టుకుని బతిమిలాడింది. కానీ డబ్బు మహత్యం వీటన్నిటికంటే గొప్పది. తనింకేం చేయలేనని అదిలించి పంపేశాడామెను సేటు.

ఆసుపత్రిలో వున్న మొగుడి దగ్గర మొరపెట్టుకుంది లక్ష్మి.

"తప్పుడు నా కొడుకు! ఆడికంతే కావాలి. నాయాలుకి జైలుకి పోతేగాని బుద్ధిరాదు. బుద్ధిగా నౌకరీ జేసుకోరాని పంపిస్తే దొంగతనం జేస్తట్టె నీయమ్మ. ఛీ. తప్పుడు ముండా! ఇదంతా నీ వల్లే వచ్చింది. మరి ఆడు- సేటు సరుకు అమ్ముతూ, జల్సా జేస్తున్నప్పుడేంజేసినవే? ఆ గాడ్ద రెండు, మూడు దినాలగ్గూడా ఇంటిముకం జూడకపోయినప్పుడేం జేసినవు. తల్లి ముండవు, కొడుకేం జేస్తున్నడో అర్సుకోనక్కర్లా? సావ్వేముండ! నీ రోగం కుదిరినాది'' అని తిట్టినతిట్టు తిట్టకుండా తిట్టాడు రంగయ్య.

"అదేందయ్యా అట్టాగంటవు. నీకు మాత్రం ఆడి బాధ్యత లేదా? నువ్వా అర్సుకోలేదు గందయ్య'' అంది లక్ష్మి ఏడుస్తూనే.

"నీయమ్మ, మొగోడికి సవాలచ్చ పన్లుంటాయి. నాకేడ ఫుర్సతుంటది?"

"మరిప్పుడేం జేద్దమంటవయ్యా?"

"మనం జేసెడిదేముంది? మనతాన పైసలేడున్నయ్యి. పోనీ లంజకొడుకుని జైలుకు'' అని పరిష్కారమార్గం జూపించాడు ఆమె భర్త

లక్ష్మి తను పనిచేసే ఇళ్ళల్లో అన్నిచోట్లా అడిగిచూసింది. కాని, బికారిదానికి పదివేలివ్వటానికి ముందుకు రాలేదెవ్వరూ.

"మా కోడల్నడిగావా?" అనడిగింది రంగనాయకమ్మ.

# ఎయిడ్స్ రోగులకు గమనిక

చిత్ర సెప్టెంబరు 17 నుండి ఆయుర్వేదమందును వాడడం ప్రారంభించింది. 45 రోజులు అయిన తర్వాత రక్తపరీక్షలో నెగిటివ్ అని రుజువయింది. ఈ ఫలితం అందరినీ దిగ్భ్రమ కలిగించినది. అల్లోపతి ప్రపంచం దీనిని నమ్మలేదు. వార్తను వెల్లడి చేయుటకు కూడా అడ్డుతగిలారు. బాబురాజ్ దీర్ఘకాలిక ఎయిడ్స్ రోగి. అతని బరువు కేవలం 32 కేజిలే. పదిరోజులు చికిత్స అయిన తర్వాత పునర్జన్మ పొందినట్లు సంతోషించాడు. ఈ ఆనందం అతడు పత్రికా విలేకరులతో మాట్లాడినప్పుడు విశదమయింది. అతని బరువు కూడా 72 కేజిలకు పెరిగింది.

**-కేరళ కౌముది, నవంబరు 4.92**

ఇద్దరి రోగుల రక్తపరీక్ష జరిపినప్పుడు, వారి రక్తమందు ఎయిడ్స్ క్రిములు (వైరస్) ఇక లేనేలేదని రుజువయింది. పరీక్షా అంశం (టెస్ట్ రిపోర్టులు)లను మజీద్ ప్రెస్ కాన్ఫరెన్సునందు సమర్పించాడు.

దీనిని కొత్తగా కనిపెట్టడంవల్ల, వైద్యశాస్త్రమునందే ఒక విప్లవాత్మక మార్పును తెచ్చుట జరిగింది. ఇంతవరకూ ప్రపంచంలో ఒక్కడైనా ఎయిడ్స్‌కు చికిత్స పొంది బాగయినట్టు వార్త రాలేదు.

**-దీపిక నవంబరు 4.92**

ఎయిడ్స్ కొరకు ఆయుర్వేదపు మందు..... అతను ప్రెస్‌వారి ముందు చికిత్స పొంది బాగైన ఇద్దరు రోగుల్ని తెచ్చాడు- వారు, కలిమనూరు వాస్తవ్యురాలగు చిత్ర మరియు తిరువనంతపురం (త్రివేండ్రం) వాసి అగు బాబురాజ్.

జూలై నెలాఖరురోజుల్లో బాబురాజ్ చాలా చిక్కిపోయి బక్కగా పూర్తి అపాయకర పరిస్థితుల్లో ఉండెను: అతనికి డయోరియా, జ్వరం, నిమోనియాతో చేరి దగ్గుయుండి, చర్మరోగము మరియు రాత్రి చెమటలు కూడా యుండినవి. దానికితోడు తీవ్రమయిన క్షయవ్యాధి కూడా యుండినది.

"బాబురాజ్ లాంటివాణ్ణి పునర్జీవితానికి తీసుకువచ్చాక, ఎలాంటి ఎయిడ్స్ రోగినయినా కాపాడవచ్చును'' మజీద్ అధికారయుతంగా చెప్పాడు.

**-మాతృభూమి, నవంబరు 4.92**

శ్రీ టి.ఎ. మజీద్, మూలిక శాస్త్రవేత్త ఎర్నాకుళం నివాసి ఇటీవల ఎయిడ్స్ వైద్యచికిత్సా రంగమున అమాంతంగా ప్రవేశించారు. ఖచ్చితమైన నివారణను కనుగొన్నది వీరు ఒక్కరే ఒక్కరు. ............... వీరి మందు 20 రకముల మూలికలను కలిగి అందులో 4 క్రిములను (వైరస్)లను చంపుటకు మరియు మిగిలినవి వ్యాధినిరోధకము (ఇమ్యూన్)ను మెరుగుపరచును.

**-టైమ్స్ ఆఫ్ ఇండియా, ఆగస్టు 11.93**

ఎయిడ్స్‌కు సవాల్.......! ఎయిడ్స్ సూక్ష్మక్రిములు (వైరస్)ను నాలో ప్రవేశపెట్టండి. ఒక్కవారంలో నేనే నయం చేసుకుంటాను - అని సవాల్ చేస్తూ మజీద్ తననే స్వయంగా ప్రయోగానికి (గినియా పిగ్)గా అర్పించుకుంటున్నారు, ఈ 20వ శతాబ్దపు పిడుగు అగు ఎయిడ్స్ నివారణకొరకు.
........... ఇలాంటి సందర్భమునందే అతడు HIV రోగిగా అగుటకు స్వచ్ఛందంగా అంగీకరిస్తున్నారు. పరిశోధన కోసం HIVని గ్రహించటానికి ఎవరు ముందుకువస్తారు?

**-ఇండియన్ ఎక్స్‌ప్రెస్, జూలై 29.93**

చావుబతుకుల్లోనున్న ఎయిడ్స్ రోగిని నా దగ్గరికి తీసుకొనిరండి. 30 రోజుల్లో అతనికి పునర్జీవితం ఇస్తాను- టి.ఎ. మజీద్ గొప్పగా చెబుతున్నారు.

**-సండే అబ్జర్వర్, ఆగస్టు 8.14.93**

కిలమనూరునందుండు దేవస్వరములో గల చిత్రభవన్‌లోనుండు చిత్ర ఆమె కూతురుతోను మరియు రెండవ భర్త ఆగు శ్రీ అనిల్‌కుమార్‌తో పునర్జీవితం సంతోషంగా గడుపుచున్నారు.

**-కళా కౌముది, జూలై 26.93**

ఎనిమిదినెలల క్రితము వైద్య ప్రపంచం దీనిని కేవలం ఒక పరిహాసం (జోక్)గా గ్రహించింది. ప్రపంచ ఆరోగ్య సంస్థ (W.H.O.) శ్రీ టి.ఎ. మజీద్, ఎయిడ్స్ నివారణకు మందు కనుగొన్నారంటే నవ్వారు. ఇప్పుడు నవ్వడం ఈ మైనింగ్ ఇంజనీరు వంతయినట్లుంది! అనేక దేశప్రతినిధులు మరియు ప్రపంచ ఆరోగ్య సంస్థ (W.H.O.) ప్రతినిధులు కొల్లలు కొల్లలుగా, కేరళలోనున్న కొచ్చిన్‌లోగల వీరి ఫార్మశీని దర్శించి, భయంకరమైన ఈ వ్యాధిని ఆయుర్వేద మందుల ద్వారా నయం చేయవచ్చునని విశ్వసిస్తున్నారు.

**-సండే మెయిల్, జూలై 25.3.93**

## ఎయిడ్స్ లొంగుబాటు:

ఈ 20వ శతాబ్దము ఎదుర్కొంటున్న అన్ని రోగములందు భయంకరమైనది, ప్రాణాంతకమైనదిగా పేర్కొనబడుచున్న ఈ రోగము ఇప్పుడు ఆయుర్వేదమునకు దాసోహమయినది.

-భారతదేశ గర్వకారణ సాంప్రదాయము మహిమాన్విత శక్తులు ఆయుర్వేదమునందు కలవని మనకు తెలిపిన ఋషుల ఆత్మలు ఇప్పుడు తప్పక బ్రహ్మానందమున తేలిఆడయుండవచ్చును. ఈ నూతన పరిశోధన ఫలితము మన పురాతన భారతీయ శాస్త్రమునకే కలికితురాయి.

**-మళయాళం పత్రం,**
న్యూయార్క్, డిశంబర్ 30.92

ప్రపంచమునందు అన్ని దేశములు ఎయిడ్స్‌చే కలుగు భయంకర ప్రాణాంతకమగు భయంతో తల్లడిల్లిపోతున్నాయి. యావత్ ప్రపంచప్రజలు ఈ పైశాచికవ్యాధి పరిణామాన్ని అత్యంత భీతితో వీక్షిస్తున్నారు. ఆధునిక సైన్సు దీనిని మితి చెయ్యజాలదు. చిన్న రాష్ట్రమగు కేరళయందు దీనికి నివారణ కనుగొన్నాము.

**-చంపకం వీక్లీ, నవంబర్ 27.92**

ఎయిడ్స్ రోగిని నయము చేయుటకు తగిన నివారణను కనుగొనుటకు ఇంతవరకూ ఏ వైద్యుడు ప్రయత్నించకపోవడము చాలా చింతాజనకం. ఇందుకై మేము శ్రీ మజీద్‌కు సగర్వంగా నమస్కరిస్తున్నాము. వారు ఈ కొరతను పూరించటమేగాక సరిగా పరీక్షింపబడి ప్రభావము కల మందు కనుగొన్నారు.

**-ఫ్యామిలీ డాక్టర్, జనవరి 93**

అన్వేషణ (రోగుల కోసం) చాలా విసుగు కలిగించెడిది. బహుశః అల్లోపతియందే ఎయిడ్స్‌కు చికిత్స లేదు. ఇక ఆయుర్వేములో యుంటుందా అనే తప్పుడు అభిప్రాయంవల్ల కావచ్చు. అతనికి ఈ ఇద్దరు రోగులు లభించి వీరికి తన విజయవంతమైన చికిత్సను చేసినందుకు తన అదృష్టంగా భావించియుండవచ్చును.

**-టైమ్స్ ఆఫ్ ఇండియా,**
బొంబాయి, నవంబర్ 5.92

నాతోపాటు నిపుణుల బృందం, ఎయిడ్స్ రోగిపై ఇమ్యునో-క్యూర్ (Immuno–QR) యొక్క చికిత్సా ప్రభావమును అధ్యయనము చేయవచ్చును. లేక నా మందు మహత్తును నిరూపించుటకు నేనే స్వయంగా ఎయిడ్స్ సూక్ష్మక్రిమి (వైరస్)లను ప్రవేశింపజేసుకొని ఎయిడ్స్ రోగిగా మారుతాను- నిపుణులు ఈ అధ్యయనానికి తయారుగాయుంటే!

**-మళయాళ మనోరమ, జూలై 29.93**

ప్రపంచ ఆరోగ్య సంస్థ (W.H.O.) ప్రపంచమందలి అన్ని ఎయిడ్స్ పరిశోధనా పత్రములను పరిశీలించినప్పుడు శ్రీ టి.ఎ. మజీద్‌గారి మందు సంతృప్తికరంగా యున్నట్లు గమనించింది.

**-జరీదా టైమ్స్, ఆగస్టు 13.20.93**

మందువల్ల కలగు నివారణా చికిత్సా విధానము తప్పక శ్రీ టి.ఎ. మజీద్‌కు నోబెల్ బహుమతి లభించతగును. దీనివల్ల భారత కీర్తి ప్రతిష్ట ప్రపంచమందరి దృష్టిలోనుండును. అలాంటిది ఇంతవరకూ లభించకపోవటం దురదృష్టము, సిగ్గుచేటు.

**-నయా దునియా, డిసెంబర్ 93**

"పొద్దుటాల నువ్వు పూజజేసు కుంటుంటివి. అప్పుడర్సుకుంటి. నాతాన పైస లేదంది అమ్మ'' అంది లక్ష్మి.

"మరేం చెయ్యాలనుకుంటున్నావు?"

"నేనేం జేయనమ్మ, పాడు బతుకైపోయి నాది. ఆళ్ళయ్య అట్టా, ఈళ్ళిట్టా. నాకు సాయైనా వచ్చినాది కాదు. రెక్కలు ముక్కలు జేసుకు న్నా పొద్దు గడవకుండె. పైన ఈళ్లు జేసేపను లు ఈ తీరునుండాయి. నువ్వైనా అయ్యకు జెప్పి ఇప్పించరాదుటమ్మ. తడవకింతని తీర్సుకుంటను. నా చర్మం చెప్పులు కుట్టిస్తన మ్మా'' అంది లక్ష్మి రంగనాయకమ్మను ప్రాధే యపడ్తూ.

"నేను చెప్తే ఇస్తారా వాళ్లు...?" అని ఆమె దీర్ఘాలోచనలో పడిపోయింది. చివరకు ఓ నిశ్చయానికొచ్చి, "సరే నీ పనికానీ, నేనాలోచి స్తాను'' అందామె.

లక్ష్మి ఆమె మాటలు వింది కాని, ఆమె తనకెలా సాయం జెయ్యగలదో అన్న సందే హంలోనే వుండిపోయింది. రంగనాయకమ్మ జీవితం లక్ష్మికి తెలియందికాదు. నిజానికామె తనలాంటిదే. ఆమె దగ్గరా డబ్బుండదు. కొడుకుల ఇళ్ళల్లో చాకిరీచేస్తూ, వాళ్ళింత తిండిపెడ్తే బతుకుతోందామె.

ఉతికిన గుడ్డలు మడతపెట్టి అలమారులో పెడ్తూ రంగనాయకమ్మ ఆలోచనలో పడిపో యింది. ఆ బాలనర్సింహ వయస్సు ఎంత వుంటుంది. నందుడికంటే మూడు నాలుగే ళ్ళు ఎక్కువ వుంటాయేమో వాడికి. ఈ పది, పన్నెండేళ్ళనుండి తను వాడిని అడపాదడపా చూస్తూనే వుంది. చిన్నపిల్లవాడుగా వున్నప్పు డు వాడూ తల్లితో వచ్చేవాడు. "వాడిని రోజూ సాయంత్రం నా దగ్గరకు పంపవే. నాకొచ్చిన పద్యాలు రెండు వాడికి చెప్తాను'' అంటే వినేదికాదు లక్ష్మి. వాడిని పసితనంనుండి పనిలోకి పెట్టింది. వాడికి పసిడిబాల్యం మృ గ్యం చేసింది. అయినా ఆమెనని ప్రయోజన మేముంది? ఆమె అవసరాలలాంటివి. 'గోవల్ల భుడనేను గోవులు మీరని రంకెవైచుచు కలగి యాడు రాజునే భటులు మీరలు రండు రండని ప్రాభవమున బెక్కుపనులు పను చు... శౌరి బాలురతో నాడు సమయం' వాడి జీవితంలో ఎక్కడిదీ పాపం! పసివెధవని దొంగని చెప్పి జైల్లో వేశారట, కొట్టారట. వాళ్ళకెట్టా చేతులు వచ్చాయో పసివెధవను కొట్టటానికి! పాపం లక్ష్మి మాత్రం ఏం చేయగ లదు. రెక్కాడితేగాని డొక్కాడని జీవితం దా నిది. ఎందుకింత విభేదాన్ని సృజించావు పర మాత్మా! ఈ ప్రపంచంలో ఎందుకింత దుఃఖం ఇంత కష్టం, ఇంత బాధ?

ఆమెకు వాడు చేసిన నేరమేమీ కన్పించలే దు. గోకులంలో మనుషుల జీవితాన్ని డబ్బు శాసించలేదు. ఇప్పుడు జీవితం డబ్బుతో ముడిపడివుంది. తెలియక తప్పుచేశారు. సరి దిద్దటంపోయి, పోలీసులకప్పచెప్పటం వాడి జీవితాన్ని మరింత కీకారణ్యం చేయటమే. ఇహ తనకు తప్పదు. చివరిసారిగా తనకు చేతనైంది తను చేయాలి.

లక్ష్మి కొంగుకు చేతులు తుడ్చుకుంటూ గదిముందుకొచ్చి నిలబడి "మరి నేనెళ్తాన మ్మా'' అంది.

"ఉండు... రెండుక్షణాల ఆగు'' అని లేచి బావి దగ్గరకొచ్చింది రంగనాయకమ్మ. నీళ్ళు చేది 'అపవిత్ర. పవిత్రోవా...' అనుకుంటూ నాలుగు బక్కెట్ల నీళ్లు నెత్తిన గుమ్మరించు కుంది.

అలాగే తడిచీరెతో వచ్చి దేవుడి గూటి ముందునిలబడి దేవుడికి సాష్టాంగ ప్రమాణం చేసింది. లేచి నిలబడి పూజాపేటికలో బాలకృ ష్ణుడు- తల మాత్రమే వున్న బాలకృష్ణుడి విగ్రహాన్ని తీసి లక్ష్మి చాచిన అరచేతుల్లో పడేస్తూ అంది. "ఇది బాలకృష్ణుడిలో మిగిలిన భాగం. మేలిమి బంగారంతో చేసింది. కనీసం మూడు తులాలుంటుంది. మీ సేటుకిచ్చి అమ్ముకోమను. మీ సేటు అడిగిన దానికంటే ఎక్కువ డబ్బే వస్తుంది'' అంది రంగనాయక మ్మ.

ఆ విగ్రహాన్ని స్వీకరిస్తూనే లక్ష్మి రంగనాయకమ్మ కాళ్ళమీద పడిపోయింది. తన కృతజ్ఞతనెలా చెప్పాలో ఆమెకు తెలియలేదు.

"ఛీ, ఏంటిది లే, లే. ఆ యశోదానందనుడే బాలనరులను కాపాడుతున్నాడు. నువ్వూ, నేనూ, మనం నిమిత్తమాత్రులం. మనమేం చెయ్యగలం? వాడే సర్వం వీక్షిస్తున్నాడు, నిర్దేశిస్తున్నాడు. వెళ్ళు... వెళ్లు... పిల్లాడిని విడిపించు'' అంది రంగనాయకమ్మ.

లక్ష్మి లేచివెళ్లబోతుంటే అంది రంగనాయకమ్మ, "చూడు లక్ష్మీ! ఈ సంగతి మనిద్దరి మధ్యే అంతరించిపోవాలి. ఎవరికీ తెలియాల్సిన అవసరం లేదు'' అని.

లక్ష్మికి నోట మాటరాలేదు. తలూపింది 'అట్లాగే' అన్నట్టు.

లక్ష్మి తోమిన పాత్రలు లోపలపెట్టి, తడి చీర విప్పి పొడిచీర కట్టుకుంది రంగనాయకమ్మ. బాలకృష్ణుడి తలపు ఆమెకు తండ్రిని గుర్తు చేసింది. తండ్రిని తల్చుకోగానే ఆమె కళ్లు చెమర్చాయి. ఎక్కడి తండ్రి? ఏనాటి తండ్రి...?



నిజాంబాదు జిల్లాలో బోధన్‌కు రెండుమూడు మైళ్లదూరంలోవున్న పంటకుర్తి గ్రామం రంగనాయకమ్మ తండ్రి కృష్ణమాచార్యులది. మార్కెట్టులో వస్తువులేమి కొనుక్కోవాలన్నా బోధన్‌కి వెళ్లాల్సిందే. పంటకుర్తిలో ఆయనకు ఏడెనిమిది ఎకరాల మాగాణి భూమివుంది. నిజాంసాగరునుండి వచ్చే పంట కాలువనాధారం చేసుకునే పంటలు పండించేవాళ్లు. నిజాంసాగరు నిర్మింపబడిన తర్వాత ఆ భూములన్నీ సారవంతమైన భూములయ్యాయి. అంతకుముందు వర్షాధారం మీదే ఆధారపడి సాగు చేసుకునేవారు. మొదట్లో పంట సరిగ్గా వచ్చేదికాదు. ఆంధ్రప్రాంతంనుండి సెటిలర్లు వచ్చి, కాంపులు ఏర్పడ్డ తర్వాత పొలాలు బాగా పండసాగాయి. తెలంగాణా రైతులూ వాళ్లనుండి కొత్త వ్యవసాయ పద్ధతులూ, మెళకువలూ నేర్చుకున్నారు.

ఊళ్లో ఏటికి దగ్గరగా వేణు గోపాలస్వామి ఆలయం వుండేది. పర్వదినాల్లో దేవుడి ఊరేగింపులు, దైవకైంకర్యానికై జనంపడే తహతహ రంగనాయకమ్మ ఎప్పుడూ మర్చిపోలేదు. మనుషుల ఆత్మీయత, ఆ పండితుల పాండిత్యం, జన సామాన్యంలోని అమాయకత్వం, వినయవిధేయతలు తల్చుకున్నప్పుడల్లా రంగనాయకమ్మకు కళ్లు చెమర్చేవి.

ఊళ్లో చాలాభాగం రెల్లు, లేదా తాటాకులతో కప్పిన రెండు నిట్టాళ్ల ఇళ్లయితే, బహుకొద్ది మందికి మాత్రమే పెంకుటిళ్లు, డాబాలు, మేడలు ఆ కాలపు పల్లెటూళ్లలో వుండేవి. కృష్ణమాచార్యులది మండువాగల పెద్ద పెంకుటిల్లు. ఇంటివెనుక వంటకు ప్రత్యేకించి ఓ చుట్టిల్లు వుండేది. ఇంటి చుట్టూ కావల్సినంత ఖాళీ స్థలం. ఇల్లు బాగా ఎత్తుగావుండి గాలీ, వెలుతురూ పుష్కలంగా లభిస్తుండేవి.

ఇంట్లో కృష్ణమాచార్యులు, ఆయన భార్య శ్రీలక్ష్మి, ఆయన తల్లి చూడుకుడుత్తమ్మ, కూతురు రంగనాయకి, కొడుకు రామానుజాచార్యులు వుండేవాళ్లు. కృష్ణమాచార్యులకు లేక లేక కలిగిన బిడ్డ రంగనాయకి. ఆయనకు ముప్పై నాలుగేళ్ల వయసులో పుట్టిందామె. ఆ తరువాత ఐదేళ్లకు కొడుకు రామానుజాచార్యులు పుట్టాడు. లేకలేక కలిగిన బిడ్డవటంతో కృష్ణమాచార్యులు కూతుర్ని ఎంతో గారాబంగా చూసేవాడు. కుటుంబసభ్యులు ఐదుగురే అయినా, కృష్ణమాచార్యులవద్ద చదువు

కొనటానికి వచ్చే విద్యార్థులతో ఇల్లు కోలాహలంగా వుండేది. విద్యార్థులకు తండ్రే ఉచిత భోజనవసతులు కల్పించేవారు. వేదవేదాంతాలు, కావ్య నాటకాలంకార శాస్త్రబోధా చేసేవాడు. నిజాంసాగరు కట్టకముందు ఆయన డబ్బుకి ఇబ్బందిపడేవాడు. పొలంలో పంట అంతంత మాత్రంగానే వచ్చేది. చుట్టుపక్కల ఊళ్లలో వుండే ఆయన శిష్యులు ఆర్థికంగా సాయం చేస్తూండేవాళ్లు. అయినా కృష్ణమాచార్యులను ఆర్థికమైన ఇబ్బందులు అంతగా బాధ పెట్టేవి కావు. రంగనాయకమ్మ పెళ్లయి, రామానుజాచార్యులకు చదువుకై నిజాంబాదు పంపి చదువు చెప్పించటం మొదలయినప్పటినుండి ఆయనకు డబ్బు ఇబ్బంది అధికమైంది. అయినా ఆయన తన కార్యక్రమంలో, పఠనా పాఠనాదుల్లో వీసమంత తేడా రానిచ్చేవాడు కాదు.

ఆయన నిత్యకృత్యం ఒకే మోస్తరుగా వుండేది. ఎప్పుడో తెల్లవారుఝామున లేచి స్నానసంధ్యలు, పూజాపునస్కారాలు పూర్తి చేసుకుని సూర్యోదయానికల్లా పొలం వెళ్లేవాడు. అక్కడ పనివాళ్లకు, జీతగాళ్లకు పనులు పురమాయించి ఎనిమిది గంటలకల్లా ఇంటికి వచ్చేవాడు. అప్పుడు శిష్యులకు అధ్యాపక కార్యక్రమం మొదలుపెట్టేవాడు. అది అపరాహ్నం దాకా కొనసాగేది. అప్పుడు మధ్యాహ్నిక సంధ్య సాపాటు. బోధన్‌లో పనేమయినా వుంటే అప్పుడు బయలుదేరేవాడు. పనేమీ లేకపోతే భోజనానంతరం ఓ కునుకు తీసేవాడు. నిద్రలేచింతర్వాత కూతురు, కొడుకులతో కాలక్షేపం చేసేవాడాయన. కూతురిచేత భారత, భాగవత పురాణ పఠనం చేయించేవాడు, అర్థాలు చెప్పేవాడు, వ్యాఖ్యానించేవాడు. కృష్ణకర్ణామృతం, గీతగోవిందం, భాగవతంలోని ప్రహ్లాదచరిత్ర, గజేంద్రమోక్షం, రుక్మిణీ కళ్యాణంలాంటి ఘట్టాలను కూతురి చేత చదివించేవాడు. విశిష్టాద్వైత ప్రాముఖ్యాన్ని గురించి వివరించేవాడు. భక్తి-ప్రపత్తులను కూర్చి చెప్పేవాడు. సాయంకాలం విద్యార్థులతో వేణుగోపాలస్వామి ఆలయానికి వెళ్లేవాడు. అక్కడే వాళ్లచేత అధ్యయనం చేయించేవాడాయన. రాత్రికి సాపాటయింతర్వాత తరుచూ పురాణ కాలక్షేపం జరిగేది. ఊళ్లో వాళ్లందరూ వచ్చేవాళ్లు. కమనీయ కంఠంతో ఆయన పద్యం చదువుతూవుంటే ఎవరూ శబ్దం చేయకుండా వినేవాళ్లు. పద్యం తరువాత ఆయన వ్యాఖ్యానం చేసేవారు. ప్రశ్నలకు సమాధానాలు చెప్పేవారు.

పండగ పబ్బాలొచ్చినపుడూ, అనధ్యాయన దినాల్లోనూ, శిష్య సందర్శనార్థం ఊళ్లకు సంచారం వెళ్లినప్పుడూ, పొలం నాట్లు, పంట కోతో, నూర్పిళ్లో వగైరా జరిగేటప్పుడు తప్ప మిగతా రోజుల్లో ఆయన నిత్యదైనందిన జీవితం అలా గడిచిపోవల్సిందే.

చిన్న పిల్లగా వున్నప్పటినుండి రంగనాయకమ్మను పక్కన కూర్చోబెట్టుకుని విషయ బోధ చేస్తూండేవాడు కృష్ణమాచార్యులు. ఆయన చెప్పేవి కొన్ని అర్థమయేవి. కొన్ని అర్థమయేవికావు. అయినా అవన్నీ సంస్కృతిలో భాగమయిపోయాయి. పోనుపోను చిన్నప్పుడు నేర్చుకున్నవి జ్ఞప్తికుండి ఆమె మనో ఆకాశాన్ని విస్తృత పర్చాయి. అర్థమైనా కాకున్నా రంగనాయకమ్మ తండ్రి మాటలు శ్రద్ధగా వినేది. రామానుజాచార్యులు ఆటకాయితనంతో అంతగా వాటిమీద దృష్టి వుంచేవాడుకాదు. తండ్రి విద్యార్థులకు పాఠం చెప్పేటప్పుడూ తండ్రి పక్కనే కూర్చుని తనూ వినేది రంగనాయకి. మధ్యాహ్నం పూట ఊళ్లోవాళ్లెవరయినా ఇంటికి వచ్చినా పిల్లలతో చెప్పే మాటలు ఆయన మానేవాడుకాదు. వాళ్లనూ ఉద్దేశించి చెప్పేవాడు. ఓసారి...

"మనం శ్రీ వైష్ణవులమమ్మా! మన విశిష్టాద్వైత సంప్రదాయమంతా ఈ శ్లోకాల్లో వుంది. విను....

'శ్రీమన్ లక్ష్మణ యోగినస్తు భువనం సత్యం, తదీశ శ్రియః

కాన్తో, బ్రహ్మ స ఏవ సోఖిల తనుః భిన్నాస్తతశ్చేతనాః

సత్యా సంసృతి ీశ నిగ్రహకృతా, ముక్తిస్తు భక్త్యాదినా

తత్ప్రాప్తిః పరమేపదే తదను భూత్యా ఖ్యేతి చా చక్షతే

అంటే రామానుజ దర్శనంలో ప్రపంచం సత్యమైంది. శ్రియః పతి దానికి సర్వశేషి. ఆ విష్ణువునే బ్రహ్మ అంటారు. చేతనా చేతనములన్నీ ఆయన శరీర భూతాలు. చేతనులు ఈశ్వరునికంటే భిన్నులు. సంసారం ఆ శ్రియః పతి నిగ్రహంవల్ల సంప్రాప్తించింది కనుక యదార్థమైందే. కర్మ జ్ఞానాంగమైన భక్తిచేతనే ముక్తి లభిస్తుంది. ఆ ముక్తి అనబడేటటువంటి మహానంద ప్రాప్తి పరమపదంలోనే కల్గుతుంది. మోక్షమంటే ఆ శ్రియః పతి అనుభవమేనని చెప్తారు''

మధ్యాహ్నంపూట జరిగే సంభాషణల్లో తరుచూ వేణుగోపాలస్వామి ఆలయపూజారి పెరియనంబి పాలు పంచుకుంటూ వుండేవాడు "మా బాగా చెప్పారు విశిష్టాద్వైతసారమంతా రెండుముక్కల్లో" అనేవాడు.

"భగవద్రామానుజ దర్శనంలో భక్తిప్రపత్తులతో ప్రసన్నుడయే శ్రియః పతియే ఉపాయమనీ, పరమ పదవాసియైన ఆయనయే ప్రాప్యుడనీ సిద్ధాంతం. భక్తి ప్రపత్తులలో భక్తిని సంస్కృత వేదాంత గ్రంధాలూ, ప్రపత్తిని ద్రావిడ వేద ప్రబంధాలూ బలపరుస్తున్నాయి. అంజలి ముద్రతో వేంచేసి వుండే భగవద్రామానుజుల విగ్రహం నమస్కారాన్ని సూచిస్తూ భక్తియోగం ముక్తి సాధనమని తెలియచెప్తోంది. అలాగే జ్ఞానముద్రలో వేంచేసి వుండే నమ్మాళ్వారుల దివ్యమంగళ విగ్రహం ప్రపత్తికి ముఖ్యాంగమైన ఆత్మ నిక్షేపాన్ని సూచిస్తూ ప్రపత్తి ముక్తికి ముఖ్య సాధనమని చెప్తోంది''

"భక్తి ప్రపత్తి అంటే ఏమిటి నాన్నా!" అనడిగేది రంగనాయకమ్మ.

"నిజానికి భక్తిప్రపత్తులు రెండూ ఒకటేనమ్మా! అవి రెండూ శ్రీమన్నారాయణుడి పట్ల అవిచలిత విశ్వాసాన్ని సూచించేవి. భక్తిప్రపత్తుల మధ్య భేదాన్ని చెప్పటానికి మర్కట కిశోర న్యాయాన్నీ, మార్జాల కిశోర న్యాయాన్నీ దృష్టాంతాలుగా చూపిస్తారు. కోతి తన పిల్లలతోపాటు ఒక చెట్టునుండి మరో చెట్టుకు దుముకుతూ వుంటుంది. అయితే పిల్ల తల్లిపొట్టనంటిపెట్టుకుని తను పడిపోకుండా తల్లిని బలంగా పట్టుకుని వుంటుంది... ఇది భక్తి. భక్తుడు అల్పమైన తన శక్తి మీద ఆధారపడి తన యోగక్షేమాల కోసం తాపత్రయ పడ్తూ కర్మజ్ఞానభక్తి మార్గాలనాచరిస్తూంటాడు. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావాలను ఆచరిస్తూ వుంటాడు. అయితే మార్జాల కిశోర న్యాయంలో పిల్లిపిల్లలకేమీ బాధ్యతలేదు. పిల్లే ఎలుకలు పట్టే తన ప్రాణాంతకమైన ఆ నోటితోనే తన పిల్లలను నోటితో కర్చుకుని ఇల్లిల్లూ తిప్పుతుంది. పిల్ల తన శక్తిమీద ఏమాత్రం ఆధారపడకుండా, కృషి కూడా చేయకుండా పూర్తిగా తల్లిమీదే ఆధారపడుతుంది. అలా వ్యక్తి తన సర్వమైన భారమూ భగవంతుడిమీద వేయటాన్నే ప్రపత్తి అంటారు. భక్తికి శాస్త్ర విహితమైన వర్ణాశ్రమ. ధర్మాలుంటాయి. ప్రపత్తికే ధర్మాలూ లేవు. 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అని అన్నాడే ఆ పరమాత్ముడు... అదీ ప్రపత్తి. 'స్నేహ పూర్వం అనుధ్యానం భక్తిః' అన్నారు.

'ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనం

రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వ కరణం తథా ఆత్మ నిక్షేప కార్పణ్యే షడవిధా శరణాగతిః' అనీ అన్నారు.

ప్రపత్తికి ఇంకో పేరే శరణాగతి''

"అయితే ఆచార్యులగారూ! కర్మ, జ్ఞాన, భక్తి మార్గాలని మూడుకదా! మరి వైష్ణవంలో మొదటి రెండింటికేమీ సంబంధంలేదా?" అనడిగాడు పెరియనంబి.

"అలాకాదు నాయనా! 'బహవోహి యథా మార్గా విశన్త్యేకం మహాపురం, తథా జ్ఞానాని సర్వాణి ప్రవిశంతి తమీశ్వరం' అన్నట్లుగా ఒక మహానగరానికి వెళ్లటానికి ఎన్నో తోవ

లుంటాయి. అలాగే భగవత్ప్రాప్తికీ ఎన్నో ఉపాయాలున్నాయి. ఒక ఉపాయం అశక్తమనిపించినప్పుడు వేరయిన సహకారోపాయాలను శాస్త్రం విధిస్తోంది. కర్మానికి జ్ఞానం సహకారి, జ్ఞానానికి భక్తి సహకారి, భక్తికి ప్రపత్తి సహకారి. కర్మజ్ఞానభక్తి మార్గాలు ఆచరించ సమర్థులు కానివారు ప్రపత్తిని చేపట్టాలి. అప్పుడు వాళ్లకు తక్కినవన్నీ త్యాజ్యాలు''

"మరలాంటప్పుడు క్రైస్తవులూ, ముస్లింలూ మిగతా మతాలవాళ్లూ ఆచరించేది మనమార్గం కాదుగదండయ్యా, మరివాళ్లకు ముక్తి లభించదా'' అనడిగేవాడు పటేల్ సీతారామయ్య.

"భగవదుపాసనా మార్గాలు ఈ నాలుగే. క్రీస్తుదీ, మహమ్మదుదీ భక్తి మార్గమే. అవీ మార్గాలే పరమపదానికి. సూఫీల మార్గం ప్రపత్తి'' అనేవాడు కృష్ణమాచార్యులు.

మరోసారి...

"రామానుజుడు చిత్, అచిత్, ఈశ్వరులను తత్త్వత్రయాలన్నాడు. మొదటి రెండూ యదార్థాలే అయినప్పటికీ అవి ఈశ్వరుడి మీద ఆధారపడివున్నాయి. ఆత్మ నశించినప్పుడు శరీరానికి అస్తిత్వంలేదు. అలాగే ఈశ్వరుడు లేనపుడు చిత్, అచిత్‌లులేవు. దీన్నే 'అపృథక్ సిద్ధి' అన్నాడాయన. అచిత్ (వస్తువు), చిత్(ఆత్మ) రెండూ భగవంతుడి శరీరమవటంవల్ల, అవి ఆయన నిర్దేశానికిలోనై, ఆయన చేత పరిరక్షింపబడ్తూ, ఆయనకోసం ఉనికిగొనివున్నాయి. ఈ వేరుకాని మూడింటి సమాహారమే రామానుజుల దృష్టిలో బ్రహ్మ. మొదటి రెండూ విశేషణాలయితే, ఈశ్వరుడు విశేష్యం. విశేషణాలకు విశేష్యం లేకుండా ఉనికిలేదు కనుక ఈ తత్త్వసమాహారాన్ని ఆయన విశిష్టమని అభివర్ణించారు. అందువల్లనే రామానుజమతం విశిష్టాద్వైతమైంది''

"బాగా అర్థం కాలేదు ఆచార్యులవారూ'' అన్నాడు పెరియనంబి.

"సరే... నువ్వు నేలమీద కూర్చున్నావుకదా! దాన్ని వర్ణించవయ్యా''

"వర్ణించటానికేముందండీ! చక్కటి నల్లటి బండలు పరిపించారు. అవి నున్నగా వున్నాయి. ఏమాత్రం మట్టి పట్టిలేవు''

"అంటే నేల నల్లగా, నున్నగా, పరిశుభ్రంగా వుంది. అంతేకదా!"

"అంతేకదండీ మరి..."

"నేల అనేది విశేష్యం అంటే నామవాచకం. నల్లగా, నున్నగా, పరిశుభ్రంగా అనే మాటలు నేల ఎలా వుందో వర్ణిస్తున్నాయి. అంటే అవి విశేషణాలు. నామవాచకం లేకుండా విశేషణానికి అర్థంలేదు. చిత్, అచిత్‌లకు ఈశ్వరుడు లేకుండా ఉనికిలేదు. అందువల్ల అవి విశేషణాలు. ఈశ్వరుడు విశేష్యం. ఈ మూడింటి సమాహారమే విశిష్టం, అందుకే విశిష్టాద్వైతం... ఇప్పుడర్థమైందా?"

"బాగా తెలిసిందండీ'' అన్నాడు పెరియనంబి.

అయితే కూతురు రంగనాయకమ్మ వివాహంతో కృష్ణమాచార్యుల మనస్థితిలోవున్న హాయి క్రమంగా లుప్తం కాసాగింది. ఆ రోజుల్లో ఆడపిల్లకు రజస్వల కాకుండానే వివాహాలు జరిపించేవాళ్లు. ఆంధ్ర ప్రాంతంలోనూ శారదాబిల్లు అప్పటికి అమలులోకిరాలేదు. తెలంగాణాలో ఆ ప్రసక్తేలేదు. బాల్యవివాహాలు నిరాఘాటంగా జరిగిపోతూ వుండేవి. కృష్ణమాచార్యులకు రంగనాయకికి వివాహం అంత చిన్న వయసులో చేయటం ఇష్టంలేదు. అయితే ఆయన భార్య శ్రీలక్ష్మి, బావమరిది ఉడయవర్లు ఆయన మాటలను పడనిచ్చేవారుకాదు. ఉడయవర్లు జానకంపేటలో వుండేవాడు. ఏ పనిబడ్డా కృష్ణమాచార్యుల ఇంట్లో ఆయన హాజరవుతూండేవాడు. భార్య మాటను, బావమరిది మాటను కాదనలేకపోయే తత్త్వం. ఆ పైన ఆనాటి పరిస్థితులూ ఆయన మానసిక స్థితిని దిగజార్చాయి.

"ఇంక రెండు మూడేళ్లాగితే పెద్ద మనిషైన నీ కూతుర్నెవరు పెళ్లి చేసుకుంటారు బావా!

నువ్వు పెద్ద మనిషని నిన్ను వెలివేయకపోయి నా, నీ కూతురికి మాత్రం పెళ్లికాదు. నీ జీవానబడి అది కొంపలో పడివుంటుంది. దాన్ని చూసి నువ్వు కుళ్లికుళ్లి ఏడవాల్సి వస్తుంది. నా ఎరికలో మంచి సంబంధ ముంది. సాలూరు వాళ్లది. అదే గోపాలాచా ర్యులుగారని నువ్వు వినే వుంటావు. ఆయన కొడుకు. పిల్లవాడు తొమ్మిదో క్లాసు చదువుతు న్నాడు. ఏదో ఉద్యోగం చేయకపోడు. వాళ్లూ మంచి ఆస్తిపరులే. తల్లి సుందరమ్మ మంచిది, సాత్వికురాలు. ఈ పిల్లవాడొక్కడే వాళ్ల సంతానం..." అన్నాడు ఉడయవర్లు.

"సంప్రదాయ పద్ధతిలో విద్యాబుద్ధులున్న సంబంధమేమయినా చూడరాదూ''

"ఆఁ చాల్చాల్లేండి... మీరింత పాండిత్యం సంపాదించారు ఎందుకూ? ఏ ఏడయినా వాన లేక పంటలు పండక పోయినప్పుడుంటుంది మన కొంప అయ్యవారి నట్టిల్లులా. దానికీ నా కర్మ ఎందుకూ. నాలుగింగ్లీషు ముక్కలు వచ్చిన పిల్లవాడేనయం. మనబ్బాయిని కూడా స్కూలుకు పంపండి. నాలుగింగ్లీషు ముక్కలొస్తే మంచిది. రోజులు మార్తున్నాయి. మనమూ వాటితో మారాలి'' అంది శ్రీలక్ష్మి.

అది సంధి యుగం. స్కూళ్లల్లో ఇంకా ఉర్దూ, అరబ్బీల ప్రభావం నశించలేదుగానీ ఇంగ్లీషు స్కూళ్లల్లో ప్రవేశిస్తోంది. కృష్ణమాచా ర్యులకు తెలియంది కాదు మారిపోతున్న రోజుల సంగతి. కాని ఆయనింకా సమాధాన పడలేకపోయాడు. ఆయనింకా ఆ సందిగ్ధా న్నుండి తేరుకోకముందే రంగనాయకమ్మ పె ళ్లి ఉగ్ర నరశింహాచార్యులతో జరిగిపోయింది. కట్నం, లాంఛనాలు, ఖర్చులకోసం ఆయన ఉన్న పొలంలో రెండెకరాలు అమ్మాల్సివ చ్చింది. పెళ్లప్పటికి రంగనాయకమ్మకు ఎని మిదేళ్లు. ఆమె భర్తకి పధ్నాలుగేళ్లు. పెళ్ల యింతర్వాత ఉగ్ర నరశింహాచార్యులు వెలగబె ట్టిన చదువంతంత మాత్రమే. రెండు, మూడేళ్ల యినా అతను మెట్రిక్ పరీక్ష గట్టెక్కలేదు. "నీయమ్మ చదువు. నేనింక చదవను'' అని భీష్మించుకు కూర్చున్నాడతను.

కృష్ణమాచార్యులకు ఆ ఉర్దూ, పారశీకం, అరబ్బీ, రెండు ముక్కల ఇంగ్లీషు చదువు ను... ఉగ్ర నరశింహాచార్యులు నిరాకరించి నందుకేం విచారంలేదు. అల్లుడు మంచి ఆస్తి పరుడు. పదిహేనెకరాల మంచి మాగాణి భూమి వుంది. నిజాం సాగర్ రావటంతో నీటి వసతి కలిగింది. చెరుకు, వరి పండించేవాళ్లు. చెరకును షక్కర్‌నగర్ పంచదార ఫాక్టరీకి అమ్మేవాళ్లు. చెరకుకు మంచి ధరవచ్చేది. కనుక ఆస్తిని కాపాడుకుంటూ నిమ్మళంగా వుంటే అల్లుడు ఉద్యోగం చేసి సంపాదించక పోయినా మంచిదే అని భావించే వాడాయన. కాని కృష్ణమాచార్యుల పాలిట ఉగ్రనరశింహాచా ర్యులు అక్షరాలా అల్లుడయి కూర్చున్నాడు. అల్లుడని పేరు పెడ్తే పూచిక పుల్ల కూడా లేచి నిటారుగా నిలబడుతుందట. ఇంట్లో తల్లినిప ట్టి, పంటమీద వచ్చే అయివేజును చిక్కించు కుని బోధనో, నిజాంబాదో వెళ్లి జల్సాగా కర్చుపెట్టి ఇంటికి తిరిగి వచ్చేవాడు. ఇంట్లో అతన్నదుపు చేసేవాళ్లెవరూ లేకపోవటంతో అతని మాటకు ఎదురు లేకుండా పోయింది.

కృష్ణమాచార్యులు ఈడేరిన తర్వాత కూతు ర్ని కాపురానికి పంపేశారుకానీ ఆమె సాలూ రులో వుండిందే తక్కువ. కృష్ణమాచార్యుల ఇంట్లో పాడి సమృద్ధిగా వుండేది. ప్రతినిత్యం పండగలాగా వుండేది. ఉగ్రనరశింహాచార్యు లకు సుష్ఠుగా భోంచేయటం ఇష్టం. అది మామగారి ఇంట్లో కుదిరినంతగా తమ ఇంట్లో కుదిరేదికాదు. తల్లి పొదుపు పొదుపని ఎక్కువ పదార్థాలు చేసేదికాదు. అందువల్ల అతను భార్యతో పాటుగా మామగారింట్లోనే మకాంపెట్టేవాడు. అప్పుడప్పుడూ సాలూరు వెళ్లి తల్లిని అదిలించీ, బెదిరించీ పంట డబ్బు ను తెచ్చుకునేవాడు. కృష్ణమాచార్యులకూ కూతురు తన కళ్ల ఎదుట వుందికదా అని ఆనందంగా వుండేది. ఉగ్ర నరశింహాచార్యు లకు ఇద్దరు పిల్లలు పుట్టేదాకా అది అలాగే కొనసాగింది.

పోను పోను నరశింహాచార్యుల అవసరాలె క్కువయ్యాయి. పంట చేతికి రాకముందే రైతుల దగ్గర అప్పుచేసి డబ్బు పట్టుకుపోయేవా డు. దాంతో మరుసటి ఏటికి డబ్బుకోసం గిజాటు పడేవాడు. ఓసారి అప్పులు అధికమై తీర్చలేకపోవటంవల్ల రైతులు రెండెకరాల భూ





మిని రాయించుకున్నారు. అది జరిగిన మర్నా డే సుందరమ్మ వచ్చి కృష్ణమాచార్యులతో మొత్తుకుంది "ఇట్లాఅయితే ఎట్లా స్వామీ! మీరయినా మీ అల్లుడికి చెప్పండి. అస్తమానం గోళ్లు గిల్లుకుంటూ కూర్చుంటే ఎలా! కూర్చుని తింటే కొండలయినా కరిగిపోతా యంటారు'' అంటూ.

కృష్ణమాచార్యులు అల్లుడికి చెప్పటానికి సందేహించారు. అతని నోరు అంత చెడ్డది. ఎంత మాటబడ్తే అంతమాట అనేస్తాడు. మా మగారుకదా, పెద్దవాడు కదా అని ఆలోచించ డు. సుష్ఠుగా తన ఇంట్లో కూర్చుని తింటం, భార్యతో, బావమరిదితో పచ్చీసు ఆడటమో గచ్చన కాయలాడటమో చేసేవాడు. లేకపోతే బోధన్‌కి వెళ్లి ఆగమ్మకాకిలా తిరిగివచ్చేవాడు. ఇది కృష్ణమాచార్యులకీ నచ్చలేదు. అందుకే ఆయన ఓ రోజు అల్లుడికి నచ్చచెప్ప ప్రయ త్నించాడు.

"చూడు నరశింహం. నువ్వు మెట్రిక్ దాకా చదివావుకదా! ఏదైనా నౌకరీ చూసుకోరాదూ! పోనీ నీ వల్లకాకపోతే చెప్పు నాకు తెల్సిన మనుషులద్వారా ప్రయత్నం చేస్తాను'' అని.

"చూడండి, నాకెవరి దగ్గరా పనిచేయటం ఇష్టంలేదు. నేను ఉద్యోగం చేయదల్చుకోలే దు. మీరింకెప్పుడూ నాకిలాంటి సలహాలివ్వ కండి'' అన్నాడతను.

"అట్లా అంటే ఎట్లా బాబూ! ప్రతి జీవీ కర్మ చేయాల్సిందే. నిత్యనైమిత్తిక కర్మలు తప్పవు జీవనానికి. కర్మలేనిదే ప్రపంచలేదు. శ్రీకృష్ణభ



గవానుడు కూడా గీతలో 'నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన, నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి' అన్నాడు. కర్మలవల్ల పొంద తగింది ఏమీ లేకపోయినా ఆ పరమాత్ముడు కర్మలనెందుకు ఆచరిస్తున్నాడో చెప్పాడు. శ్రేష్ఠుడైన వ్యక్తి దేని నాచరిస్తాడో దాన్ని చూసి సామాన్య జనమూ ఆచరిస్తుంది. తనేం చేయకపోతే అదే ఆచరణ యుక్తమని జనసామాన్యం కర్మనొదిలి భ్రష్టులవుతారు. అందువల్లే కర్మల నాచరిస్తున్నానని కృష్ణపరమాత్ముడు చెప్పాడు. కనుక కర్మల నాచరించకుండా వుండటం ఈ ప్రపంచంలో సాధ్యంకాదు. జీవన భృతికై మన మందరం ఏదో ఒకటి చేయవల్సిందే. మీ అమ్మ ఘోషిస్తోంది. ఏదయినా నౌకరీ చూసుకో' అన్నాడు కృష్ణమాచార్యులు.

తనంత గొప్పవాడికి మరొకడు చెప్పేవాడా అన్న అహం నరశింహాచార్యులది. మామగారి సలహాతో విపరీతమైన కోపం వచ్చింది అతనికి. పక్క గదిలో పిల్లకు పాలిస్తున్న రంగనాయకమ్మ దగ్గరకొచ్చి ఆమె జుట్టు పట్టుకులాగి కొట్టాడు. అప్పుడు ఉడయవర్లు ఎందుకో ఇంటికి వచ్చివున్నాడు. ఆయన వచ్చి ఆపితే గాని ఆగలేదు ఆ ఉగ్రనరశింహావతారం. ఉడయవర్లకీ కోపం వస్తే ఎదుటిమనిషి ఎలాంటివాడో అని పస్తాయించే తత్వంలేదు. అతన్ని ఓ తోపుతోసి ఆపి చెడామడా తిట్టాడు ఉడయవర్లు. "నీకు బుద్ధుందిటయ్యా! ఆడపిల్లని పట్టుకుని కొడ్తావా! మనిషివా, పశువ్వా, పైసకమాయించటం రాదుగానీ పెళ్లాన్ని చావబాదటం మాత్రం వచ్చు. ఎందుకా వెధవ జన్మ, థూ'' అన్నాడాయన.

దాంతో మరింత కోపం వచ్చింది ఉగ్రనరశింహాచార్యులకు. మరేం మాట్లాడకుండా ఇంట్లోనుండి వెళ్లిపోయాడు. అలా వెళ్లినవాడు మళ్లీ నెల రోజులదాకా అత్తగారి ఇంటి ముఖం చూడలేదు అతను. నెల రోజుల తర్వాత, పీరుసాయిబ్బు గుర్రంబండెక్కి వచ్చాడు మామగారింటికి ఉగ్రనరశింహాచార్యులు.

పీరుసాయిబ్బు అసలు పేరు పీర్ మహమ్మద్. ఉగ్రనరశింహాచార్యుల తండ్రి గోపాలాచార్యుల కాలంనాటివాడు. ఇద్దరూ ఎంతో స్నేహంగా వుండేవాళ్లు. ఆ చనువుతో పీర్సాయిబ్బు కూలికి బండి నడుపుకునేవాడయినా సలహా ఇస్తే, మందలిస్తే నరశింహాచార్యులు ఏమీ అనుకొనేవాడుకాదు. ఇంటికి వెళ్లింతర్వాత సుందరమ్మ కొడుకుని పోరుపెట్టింది ఏదయినా ఉద్యోగం చూసుకోమని. పీర్సాయిబ్బు చేత చెప్పించింది. "ఈయన మామగారికి చెప్పటానికి మొహమాటపడుతున్నాడేమోలేమ్మా. నేనెళ్లి ఈయన కేదయినా నౌకరీ చూడమని చెప్తానులే' అని ఆమెతో అని, ఉగ్రనరశింహాచార్యులను వెంటబెట్టుకుని వచ్చాడు. పీర్సాయిబ్బు కృష్ణమాచార్యులను పిల్చి, "మీరే ఏదయినా నౌకరీ పిల్లవాడికి చూడండి. పనిలోబడ్తేగాని పిల్లవాడి బుద్ధి కుదర్దు'' అని చెప్పాడు.

"సరే చూద్దాంలే' అని అన్నాడు కానీ కృష్ణమాచార్యులు పస్తాయించాడు. బుద్ధి తిన్నగా వుండనివాడు మరేం కూస్తాడో అని సందేహించాడు. అతన్నే చెప్పనీ, అప్పుడే ప్రయత్నం చేద్దామని ఊరుకున్నాడు.

నరశింహాచార్యులకీ డబ్బు ఇబ్బందిగా వుంది. అందువల్ల భార్యతో అన్నాడు "మీ నాయన పాఠాలు చెప్తున్నాడుగా, నేనూ అదే చెప్తాను. డబ్బిచ్చే స్టూడెంటు గాడ్దల నెవళ్లనయినా చూడమను'' అని.

"మీరు పాఠాలు చెప్తారా? మీరేం శాస్త్రాలు చదువుకున్నారండీ'' అనడిగింది రంగనాయకమ్మ ఆశ్చర్యపోతూ.

"నీ బొంద. చదువంటే మీ నాయనదే చదువనుకున్నావా? ఎందుకూ పనికిరాని చదువు చదువుకున్నాడు మీ నాయన. మనం చదువుకుంది ఉర్దూ, పారశీకం, ఇంగ్లీషు చదువు. ఇప్పుడు చదవాల్సిన చదువదే'' అన్నాడతను.

రంగనాయకమ్మ తండ్రికి చెప్పింది. పల్లెటూళ్లలో డబ్బు ఖర్చుపెట్టి స్కూళ్ల చదువులు చదువుకునే కాలం కాదది. ఒకరో ఇద్దరికో బడి చదువుల వ్యామోహమున్నా నిజాంబాదు పంపుతున్నారుగానీ ఇలా ఊళ్లో మాస్టర్ల దగ్గర చదువు చెప్పించేది తక్కువ. డబ్బు రాకపోయినా అల్లుడికేదో వ్యాపకముంటుందని ఊళ్లో నలుగురు పెద్ద మనుషులకు చెప్పాడు కృష్ణమాచార్యులు "మా అల్లుడు ఇస్కూలు చదువులు చెప్తాడట. మీ పిల్లలెవరయినా చదువుకోదల్చుకుంటే పంపండి'' అని.

ఆయన మాట మేరకు ఊళ్లో రైతులు తమ పిల్లల్ని నలుగురైదుగుర్ని పంపారు. బడి పంతులుగా స్థిరపడకముందే ఏటి గట్టునుండి నాలుగు ఈతబరికెలు తయారు చేసుకొచ్చాడు నరశింహాచార్యులు. అవి చూసి "ఎందుకండీ ఇవి?" అనడిగింది రంగనాయకమ్మ.

"ముష్టిముండ, ఆడదానివి నీకు ఆరాలెందుకు. పిల్లగాడ్డలకు నాలుగు తగిలించకపోతే చదువురాదు. 'స్పేర్ ద రాడ్ స్పాయిల్ ద ఛైల్డ్ అన్నారు'' అన్నాడతను.

అక్కడకీ ఉండబట్టలేక రంగనాయకమ్మ అంది "మరి ఇంతమంది విద్యార్థులకు మా నాన్న పాఠాలు చెప్పాడుకానీ, ఎప్పుడూ ఎవర్నీ కొట్టి ఎరగడే'' అని.

"మీ నాయన చదువూ, ఆ దౌర్భాగ్యపు శిష్యులూ! ఇంక మాట్లాడక. మీ నాయన చదువు చదివిన ఆ సన్నాసులెందుకు పనికివస్తారు. రాగి చెంబేసుకుని 'భవతీ బిక్షాందేహి' అని అడుక్కుంటానికి తప్ప'' అన్నాడు.

అయితే ఉగ్రనరశింహాచార్యుల అధ్యాపన కార్యక్రమం వారం రోజులు కూడా కొనసాగలేదు. పిల్లల్ని చావబాదటం మొదలెట్టటంతో ఊళ్లో వాళ్లెవరూ తాము తమ పిల్లల్ని ఈ ఉగ్రనరశింహాచార్యుల దగ్గరకు పంపడానికి ఇష్టపడలేదు. వచ్చి నాలుగు తన్నేవాళ్లేగానీ కృష్ణమాచార్యుల మొహం చూసి ఊర్కొన్నారు జనం.

మళ్లీ మామూలే. తినటం, కళ్లకు గంతలు కట్టుకుని నిద్రపోవటం, అవసరాల్లో ఏదయినా లోటొస్తే భార్యను తిట్టటం, కొట్టటం కొనసాగించాడు నరశింహాచార్యులు.

కృష్ణమాచార్యులకు ఆర్థిక ఇబ్బందులున్నాయి. కొడుకు రామానుజాచార్యులను భార్యపోరూ, బావమరిది పోరూ పడలేక నిజాంబాదులో వుంచి చదివిస్తున్నాడు. ఆయన తల్లి చూడుకొడుత్తమ్మ మనమణ్ణి కనిపెట్టుకుని అక్కడే వుంది. నిజాంబాదులో వేరు కాపురం పెట్టటంతో డబ్బు ఎత్తి పంపించాల్సి వచ్చి ఇబ్బంది పడిపోయేవాడు కృష్ణమాచార్యులు. అందుకని అల్లుడికి వాళ్లనీ వీళ్లనీ ప్రాధేయపడి షక్కర్‌నగర్ షుగర్ ఫాక్టరీలో గుమాస్తా ఉద్యోగ మిప్పించాడు కృష్ణమాచార్యులు. రోజూ పంటకుర్తినుండి షక్కర్‌నగర్ వెళ్లిరావటం ఇబ్బందైపోయింది నరశింహాచార్యులకు. ఇంక అక్కడ పనేం చేయగలడు? రోజూ సాయంత్రం వచ్చేటప్పుడు ఆ అకౌంటు పుస్తకాలు సంచిలో వేసుకుని తీసుకొచ్చి మామగారికిచ్చేవాడు... "అబ్బా! దీనమ్మ ఆ ఫ్యాక్టరీ. పాడుగాను. పనెక్కువైపోయిందండీ. ఈ అకౌంట్లు కాస్తంత చేసిపెట్టండి'' అనేవాడు.

కృష్ణమాచార్యులకు పద్దుపుస్తకాలు రాసే అలవాటు లేదు. అప్పుడు అల్లుడికోసం అకౌంట్లు చేయడం నేర్చుకోవాల్సి వచ్చింది. అయితే మామగారు అకౌంటెన్సీ నేర్చుకున్నంతకాలం పట్టలేదు నరసింహాచార్యులు ఉద్యోగం చేయటం. ఆయేడు వానాకాలంలో విపరీతంగా వర్షం కురిసి ఏరు పొంగులమీద ఉండటంతో నరశింహాచార్యులు పంటకుర్తి నుండి షక్కర్‌నగర్ వెళ్ళలేకపోయారు. అప్పటికింకా చెరుకు రవాణా చేసేందుకై షుగర్ ఫాక్టరీవాళ్ళు వేయించుకున్న చిన్న గేజి రైల్వే లైను పడలేదు. ఆ రైల్వేలైను పడ్డ తర్వాత వాగుమీదుగా బ్రిడ్జి కట్టడంతో రైలువాగన్లూ పంటకుర్తిదాకా వచ్చేవి. జనమూ ఆ బ్రిడ్జిమీదుగా నడచి వెళ్ళడమూ సాధ్యమయింది.

వారంరోజులదాకా ఏరు ఉరవడిమీద ఉండటంతో నరశింహాచార్యులు ఆఫీసుకెళ్ళలేదు. ఆపైన ఆ ఉద్యోగం చేయాలన్న ఇచ్ఛ అతనికి కలగలేదు. కృష్ణమాచార్యులు రెండుమూడుసార్లు చెప్పి చూశాడు. కానీ నరశింహాచార్యులు ఆయనమాటలు పట్టించుకోలేదు.

కృష్ణమాచార్యులకు నిర్వ్యాపారంగా వుండే అల్లుడిని చూస్తే చిరాకుగా ఉండేది. ఆయనకు అంతకుముందు అంతకోపం వుందని ఎవరికీ తెలీదు.

"ఉద్యోగం చేసి చస్తే చచ్చాడు. లేకపోతే లేదు. కనీసం స్నానం, సంధ్యా లేని అప్రాచ్యుడుగా తయారయ్యాడు. సంధ్యవార్చటమెప్పుడో తగలెట్టాడు. స్నానమయినా ఏడ్చి తిండి తినొచ్చుగా. వట్టి జంతువు పుట్టుక పుట్టాడు'' అన్నాడాయన ఓరోజు భార్యతో.

పక్కగదిలో భార్యతో పచ్చీసు ఆడుతున్న అల్లుణ్ణి ఆయన గమనించలేదు. మామగారి మాట వినంగానే కోపం వచ్చింది ఉగ్రనరశింహాచార్యులకు. లేచి భార్యను గబగబా రెండు బాదులు బాది, గుడ్డలేసుకుని విసురుగా వెళ్ళిపోయాడు.

అల్లుడు కోపం వచ్చి వెళ్ళిపోయిన సంగతి తెలిసి "పీడాపోయింది'' అని నిట్టూర్చాడు. అయితే ఆయన సంతోషం ఎక్కువకాలం నిలవలేదు. బోధన్‌కి వెళ్ళినతను సాయంకాలానికల్లా తిరిగివచ్చాడు. సాయంత్రం విద్యార్థులతో వేణుగోపాలస్వామి ఆలయానికి వెళ్ళబోతున్న ఆయన ముఖంమీదికి సిగరెట్టు పొగ ఊదుతూ వంకరనవ్వు నవ్వుతూ ఇంట్లోకొచ్చాడు నరశింహాచార్యులు.

"ఇదుగో! ఇవాళ తేరగా దొరికిన అల్లుణ్ణి పట్టుకు అనరానిమాటలనటంకాదు. రేపు మీ కొడుకునూ నాలాగే తయారుచేస్తాను. చూసుకోండి'' అన్నాడు నరశింహాచార్యులు నివ్వెరపోయి చూస్తున్న మామగారితో.

అదిచూసి కృష్ణమాచార్యులు అవాక్కైపోయాడు. ఏం మాట్లాడకుండా విద్యార్థులతో వెళ్ళిపోయాడు. ఆయనకప్పుడు అర్థమైంది, తన ప్రారబ్ధకర్మ అల్లుడిరూపంలో తన్ను వెన్నాడుతోందని.

★ ★ ★

"రామానుజుడు ప్రత్యక్ష అనుమాన శబ్ద ప్రామాణ్యాలనంగీకరించాడు. ప్రత్యక్షప్రమాణంద్వారా వస్తు విభేదం మనకు తెలుస్తుంది. ఒక వస్తువును మొదటిసారిగా మనం చూసినప్పుడు నిర్వికల్ప జ్ఞానం కల్గుతుంది. ఉదాహరణకు ఓ పిల్లవాడు ఓ ఆవును మొదటిసారిగా చూశాడనుకుందాం. దానికేవో గుణాలున్నాయని పిల్లవాడు గుర్తిస్తాడు. మళ్ళీ ఆవును చూసినప్పుడు వాడికి మొదటిసారి తాను చూసిన ఆవు గుర్తుకువచ్చి ఆ జ్ఞానంతో 'ఇదీ ఆవే' అన్న సవికల్పజ్ఞానం కలుగుతుంది. అలా జ్ఞానమంతా పరమసత్యంవరకూ కూడా సగుణవస్తువునుండే ప్రాదుర్భవిస్తుంది. ఉపనిషత్తులు బ్రహ్మను నిర్గుణుడిగా వర్ణించాయంటే అర్థం కొన్ని గుణాలు లేవనికానీ, మరికొన్ని గుణాలు లేవనికాదు అంటాడు రామానుజుడు. వస్తువులు చేతనాచేతనాలు. జడత్వానికీ, చేతనత్వానికీ మధ్య వుండేదే జ్ఞానం. ఇది తనంతట తాను బహిర్గతమై, ఇతర ద్రవ్యాన్ని బహిర్గతపరుస్తుంది. ఇది వెలుగులాంటిది. ఎలా అయితే వెలుగు వస్తువులను చూపుతూ తనను తాను బహిర్గతం చేసుకోగలదో అలాంటిదే జ్ఞానం. వస్తువులను జడమైనవిగాను, అజడమైనవిగాను పరిగణించాడు రామానుజుడు. అజడమైనవాటిలో చేతనాలు కూడివున్నాయి. ఈ చేతనాలలోని జీవులు, ఈశ్వరుడికి సంబంధించినదే జ్ఞానం. ఇదే ధర్మభూతజ్ఞానం. దీనికి భిన్నమైన సంపూర్ణజ్ఞానం ముక్తజీవులను, ఈశ్వరుణ్ణీ అధివసించి వుంటుంది. ధర్మభూతజ్ఞానం జీవులను నిరంతరం అంటిపెట్టుకునే ఉంటుంది. వస్తువులనది ప్రదర్శింపచేస్తుంది. గాఢనిద్రలోనూ అది వుంటుంది. అప్పుడది క్రియాన్వితం కాదు కనుక తనను తాను

ప్రదర్శించుకోదు. అంటే జ్ఞానం వస్తువులలో ప్రతిఫలించినప్పుడు మాత్రమే అది సిద్ధించినట్లగపడ్తుంది. వస్తుప్రపంచంలో జ్ఞానం అవిన్మక్తం. మోక్షంలో అది విన్ముక్తం, సర్వవ్యాపీ అయివుంటుంది. విముక్తాత్మకు అప్పుడు తెలియందేదీ వుండదు''

అది పండగరోజు. అధ్యయనోత్సవం పరిసమాప్తిదినం. ఋగ్వేదంలో 'విష్ణోః పరమంపదం' అని వర్ణించిన విష్ణుపూజ దక్షిణభారతదేశంలో ఎప్పుడో ప్రారంభమయింది. భక్తులు, కవులైన ఆళ్వార్లు విష్ణువును కీర్తిస్తూ ఎన్నో పాటలను పాడారు. ఆ ఆళ్వార్లు పన్నెండు మంది. వాళ్ళు భక్తిపారవశ్యంతో పాడిన పాటలను పాశురాలను క్రోడీకరించినఒక గ్రంథాన్నే 'నాలాయిర ప్రబంధం' అంటారు. అది 'ద్రావిడవేదం'గా ప్రసిద్ధిపొందింది. దాంట్లో నాలుగువేల (నాలాయిరం) పాటలు, పద్యాలూ వున్నాయి. ఈ నాలాయిర ప్రబంధం నాలుగు బాణాలు. మొదటిది 'ముదలాయిరం'లో పెరియాళ్వారు, ఆండాళ్ (గోదాదేవి) పాశురాలున్నాయి. తిరుమంగై పాశురాల రెండోభాగాన్ని 'పెరియ తిరుమొయి' అంటారు. మూడోభాగం నమ్మాళ్వారుల 'తిరువాయ్ మొయి'. నాలుగోభాగాన్ని 'ఇయర్పా' అంటారు. దీంట్లో మిగతా ఆళ్వారుల పాశురాలున్నాయి. శ్రీవైష్ణవులు ఆచార్య నిష్ఠులు కావటంవల్ల, దాసదాస భావన వైష్ణవం ప్రాధాన్యం వహించటంవల్ల (అస్మద్గురుభ్యోనమః, అడియేక రామానుజదాసన్) వైష్ణవాలయాల్లో ఆళ్వార్ల విగ్రహాలను ప్రతిష్ఠించి, ప్రబంధ సారాంశమైన 'నిత్యానుసంధాన' గ్రంథపారాయణం జరిపించితేగానీ శిష్టులు వాటిని 'దివ్యాదేశం'గా పరిగణించేవాళ్ళు కాదు. సంవత్సరానికి ఒకసారి వైష్ణవులు ఈ ఆళ్వార్ల నాలాయిర ప్రబంధ పారాయణాన్ని అధ్యయనోత్సవం పేరిటి జరుపుకుంటారు. వైకుంఠఏకాదశి (ముక్కోటి) ముందు పదిరోజుల్ని 'పగల్‌వత్తు' (పగలు పారాయణం చేసేరోజులు) ఏకాదశి నుండి పదిరోజుల్ని 'రావత్తు' (రాత్రి పారాయణం చేసే రోజులు) అంటారు. మొదటి రెండువేల పాటల్ని పగల్‌వత్తులోను, రావత్తులో నమ్మాళ్వారుల రచన 'తిరువాయ్ మొయి' వేయిపాటలు పారాయణం చేస్తారు. చివరిరోజు 'పరమపదోత్సవం' మరుసటిరోజు మధ్యాహ్నమే నాలుగో ఆయిరాన్ని అనుసంధించి 'శాత్తుముఱై' (పరిసమాప్తి) నిర్వహిస్తారు.

కృష్ణమాచార్యులకు ఈ ఇరవైరోజులూ తీరిక వుండదు. ఎంతోమంది పెద్దలైన శ్రీవైష్ణవులు, ఆయన శిష్యులు, ఊరులోని రైతులు, పక్క ఊరివాళ్ళూ ఎంతోమంది వస్తారు. ఈ అధ్యయనోత్సవ నిర్వహణకుగాను ఊళ్ళోవాళ్ళు, పై ఊరివాళ్ళూ, శిష్యులూ, మిగతా వైష్ణవులూ చందాలిస్తారు కృష్ణమాచార్యులుకు. నిర్వహణ బాధ్యతంతా ఆయనది. ఆ చివరిరోజున కాస్తంత తీరికగా వున్న సమయంలో భక్తులు వేసిన ప్రశ్నలకు సమాధానంగా కృష్ణమాచార్యులు ప్రసంగిస్తున్నాడు. సందేహాలకు జవాబులిస్తున్నాడు.

"అంటే ధర్మభూతజ్ఞానం అద్వైతంలోని శంకరుడి అంతఃకరణంలాంటిదేనా?" అని ఎవరో ప్రశ్నించారు.

"అవును. కానీ శంకరవాదంలో అంతఃకరణ జడమైంది. బాహ్యసాక్షి సాయంలేక అది జ్ఞానంగా పరిణమించదు. రామానుజుడు వస్తుజ్ఞానం కలుగకముందే వస్తువులున్నాయన్నాడు. అంటే వస్తువు మిధ్యకాదు, యదార్థమైందే. ఆత్మ, దాని జ్ఞానంపైన దాని ఉనికి ఆధారపడదు కనుక వస్తువు ఉనికి సాపేక్షికం కాక పరిపూర్ణం" అన్నాడు కృష్ణమాచార్యులు.

"మరలాంటప్పుడు భ్రమని ఎలా సమర్థిస్తాం?"

"దీనికి రామానుజులు రెండు వివరణలిచ్చారు. ఉపనిషత్తులు సర్వమూ పంచభూతాత్మక (పంచీకరణ)మని అంగీకరించాయి. భిన్న వస్తువుల్లో పంచభూతాలపాళ్ళు భిన్నంగా వుండవచ్చు. ఎండమావిని మనం

దర్శించినప్పుడు మనకు అధికంగా కన్పించేది పృధ్వీభాగమే. పంచభూతాల్లో ఏ ఒకటి రెండు మాత్రమే వున్నప్పుడు మన స్సుకు వస్తుభ్రమ కల్గుతుంది. కనుక అక్కడ నీళ్ళు కన్పిస్తాయి. మరోవిధంగానూ కలిగే భ్రమ వుంది. మెరిసే గవ్వను చూసి వెండి అని భ్రమించవచ్చు. ఆ రజతశుక్తి భ్రాంతి ఆ రెండు వస్తువుల మెరుపు అనే సాధృ శ్యంనుండి ప్రభవిస్తుంది. దీన్నే రామానుజుడు 'సత్‌ఖ్యాతి' అన్నాడు. ఇంకో వివరణ కూడా ఇచ్చాడాయన. తెల్లటి శంఖం పచ్చకామెర్ల రోగికి పసుపుపచ్చగా కన్పించటానికి కారణం నయనరస్మే కాని మరేంకాదు''

"మరయితే స్వప్నాలగురించేం చెప్తారు. వస్తువులేకుండానే అక్కడ వస్తుభ్రాంతి కలుగు తోంది కదా. స్వప్నంలో కన్పించే ఏనుగు లాంటి జంతువు కర్తకు సంబంధించింది కాదు గదా!"

"వీటిని పరమ పురుషుడు సృజించాడని ఆయన చెప్తాడు. వ్యక్తి పురాకర్మననుసరించి జాగ్రదావస్థలో ఎలా కష్టనష్టాలను భావిస్తాడో అలాంటి అనుభూతిని పొందటానికే ఆయన వాటిని సృజించాడు. జీవుడు చేసుకున్న చిన్న చిన్న పాపపుణ్యాలకు తగినట్లుగా ఫలాలని చ్చేటట్లుంటాయవి''

"అంటే రామానుజులవారి దృష్టిలో రెండు రకాల యదార్థాలున్నాయన్నమాట. మృగతృ ష్ణ, రజితశుక్తి భ్రాంతుల ఉదాహరణ అందరికీ అనుభవైకవేద్యం కావటంవల్ల అది సార్వత్రిక యదార్థమనీ, అలా అందరికీ అనుభూతి కా నిది - కామెర్ల కళ్ళ పచ్చశంఖం, స్వప్నగ జంలాంటి ఉదాహరణలవల్ల వ్యక్తమయ్యేది వైయక్తిక యదార్థమనీ రామానుజుడు అభిప్రా యపడ్డారన్నమాట"

"కాదు అలాంటి వర్గీకరణ ఆయన అంగీక రించడు. భిన్న యదార్థాల నంగీకరించటంవ ల్ల ఆయన శంకరుడి మిధ్యావాదాన్ని అంగీక రించినవాడవుతాడు. అందుకనే తన 'సత్‌ ఖ్యాతి' సిద్ధాంత ప్రతిపాదనలో జ్ఞానం యదా ర్థమైందేకాక వ్యవహారానుగుణం కూడా కావా లని ఆయన చెప్పాడు''

"జ్ఞానం వ్యవహారానుగుణం కావల్సిన పనేముందీ?"

"వ్యవహారానుగుణం అంటే జీవితానికి ప్రయోజనకారి అయిన జ్ఞానం కావాలీ అని. మృగతృష్ణ, రజతశుక్తి ఉదాహరణల్లోని భ్రాంతి ఏమిటి? అక్కడ నీళ్లూ, వెండీ లేవని కాదు. అవి ప్రయోజన రహితమైనవని అర్థం చేసుకోవాలి. ప్రయోజన దృష్ట్యా అవసర మైంది మాత్రమే మనం గ్రహించాలి. మినహా యింపు లేకుండా జ్ఞానమంతా విలువైందే. అలాంటి విలువ మన ప్రయోజనానికి అనువు గా వుంటుందను కోవాల్సిన అవసరంలేదు. రెండు అంశాలను గుర్తుంచుకుని ఆ జ్ఞానం వ్యవహారానుగుణంగా వుందాలేదా అని మనం నిర్ణయించుకోవాల్సి వుంటుంది. మొద టగా, జ్ఞానం సాధారణమూ, సామూహికమూ అయిన వస్తువుల గూర్చినదై వుండాలి. పచ్చ శంఖం, స్వప్నగజం అలా చెప్ప అసమర్థాలు కాన అవి అసత్యాలు. రెండో అంశం వస్తు వులో ఆధిక్యభూతాన్ని, గ్రహించగ లగటమే. గవ్వ అని మనం పిల్చేదాంట్లో వెండి అల్పంగా వుండొచ్చేమో కానీ ఆధిక్యత వల్లే ఆ వస్తువు ప్రయోజనకారో మనకు తెలుస్తుంది. అంటే భగవద్రామానుజులు జీవ కాచరణంలో మన పరిసరాలను గూర్చిన సంపూర్ణ జ్ఞానం మనకక్కరలేదనీ, ఈ అసంపూర్ణత్వం జీవన ప్రయోజనాన్ని సఫలం చేసుకోవటంలో అడ్డంకి ఏమాత్రం కాదనీ చెప్పాడు''

"అంటే రామానుజులు సంపూర్ణ జ్ఞానం గూర్చిన ప్రస్తావన చెయ్యలేదనా మీరంటా రు?"

"చెయ్యకేం చేశాడాయన. మోక్ష ప్రాప్తిలో జీవుని లక్షణమిదే అని ఆయన చెప్పాడు. ప్రపంచంలో జ్ఞానం ఏదో రకమైన లోపాలవల్ల చరించలేక పరిమితులకు లోనయివుంటుంది. ఫలితంగా సామాన్యజ్ఞానం, భ్రమ కూడా

సంపూర్ణంగా బాహిరమవదు. అన్ని లోపాల్నీ అధిగమించి, భ్రమలు తొలగినప్పుడు మనిషి దృష్టి విస్తృతమై సంపూర్ణ జ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానం పొందిన వ్యక్తినే మనం ముక్తుడంటాం. అతడికంతా ఉన్నది ఉన్నట్లుగా జ్ఞాతమవుతుంది''

"రామానుజ దర్శనంలో భక్తి ప్రపత్తులకున్న ప్రాముఖ్యత కర్మ, జ్ఞాన మార్గాలకు లేవెందువల్ల?"

"వేదాల్లో రెండు విభాగాలున్నాయి. అవే పూర్వ, ఉత్తరకాండలు. పూర్వకాండలో బ్రాహ్మణాలూ, ఉత్తరకాండలో ఉపనిషత్తులు ప్రమాణాలు. మీమాంసకులు పూర్వకాండ అంటే కర్మకాండకు ప్రాధాన్యమిస్తారు. ఉపనిషత్తులు జ్ఞానమార్గాన్ని ప్రబోధిస్తాయి. శంకర భాగవత్పాదుల దృష్టిలో కర్మ, జ్ఞానకాండలు విరుద్ధమైనవి. అయితే అవి రెండు వర్గాల మనుషులకోసం ఏర్పడ్డాయి. ఇంకా అవిద్యలోనే కొట్టుమిట్టాడుతున్న వ్యక్తికి కర్మకాండ అవసరం. కర్మకాండలోని శూన్యాన్ని అర్థం చేసుకుని, దాన్నధిగమించ ప్రయత్నించే వ్యక్తి నుద్దేశించినదే జ్ఞానకాండ. అయితే రామానుజుడు ఆ రెండింటి మధ్య ఎలాంటి వైరుధ్యాన్నీ అంగీకరించడు. ఆయన దృష్టిలో అవి రెండూ అవసరమే. ఉత్తరకాండ భగవత్ప్రకృతిని గూర్చి చెప్తే, పూర్వకాండ ఆ భగవంతుని కొల్చే విధం చెప్తుంది. వివిధ కర్మల నాచరించటం వాటి ఫలితాలు పొందటం కోసంకాక, భగవత్కృప కోసం వాటి నాచరించాలి. అందుకు మార్గం భక్తిప్రపత్తులు వినా మరోటిలేదు''

"రామానుజుడు చెప్పిన అపృధకసిద్ధి ఏమిటి?"

"రామానుజుడు తత్త్వత్రయాలను చిత్, అచిత్, ఈశ్వరులను గుర్తించాడు. మొదటి రెండూ చరమాలే అయినప్పటికీ, అవి తుది తత్త్వం మీద, అంటే ఈశ్వరుడిమీద ఆధారపడివున్నాయి. ఆత్మపై శరీరం నిర్భరమైనట్లుగా అవి ఆధారపడివున్నాయి. దీన్నే అపృధక్‌సిద్ధి అని ఆయన చెప్పాడు. 'నియమేన అధేయత్వం, నియమేన విధేయత్వం, నియమేన శేషత్వం' అని ఆత్మ విధేయమైన శరీరాన్ని ఆయన అభివర్ణించాడు. అచిత్ (వస్తువు), చిత్(ఆత్మ) రెండూ భగవంతుడి శరీరం కావటంవల్ల, అవి ఆయన చేత నిర్దేశింపబడి, పరిరక్షింపబడి, ఆయన కోసం ఉనికిగొని వుంటాయి. ఈ విడివడరాని చిత్, అచిత్, ఈశ్వరుల ఐక్యతే రామానుజుల దృష్టిలో బ్రహ్మ. ఆత్మకూ, శరీరానికీ ఎలా అయితే జీవితో సంబంధముంటుందో, ఎలా అయితే అంగం అంగి ప్రాబల్యతకు లోనయి వుంటుందో అలాంటిదే బ్రహ్మకూడ. గౌణ భూతాలు అంటే అంగాలను ఆయన విశేషణాలుగాను, ప్రబల భూతాన్ని అంటే అంగిని ఆయన విశేష్యంగాను అభివర్ణించాడు. ఈ సమాహారమే విశిష్టం. అందుకే ఆయన తత్త్వం విశిష్టాద్వైతమైంది. వస్తు జాలాన్నంతా భగవద్రూపంగా భావించాడు రామానుజుడు. 'తత్వమసి'లోని 'త్వం' జీవుడిని సంబోధించినదని శంకరుని వాదమయితే, రామానుజుడు దానిని జీవునిలో వశించే అంతర్యామిగా భావించాడు. ఆ అంతర్యామి రూపాలే జీవుడు, అతని భౌతిక శరీరం. 'తత్'ను కూడా ఆయన విశ్వప్రభావానికి కారణమైన భగవంతుడిగానే భావిస్తాడు. అంటే ప్రపంచమూ, వైయక్తిక ఆత్మలూ యదార్థాలే. భిన్నంగా కన్పించినా అవి రెండూ ఈశ్వరుడిలోని భాగాలే..."

ఇలా రామానుజ మతవ్యాఖ్యానం కొనసాగుతుంటే పక్కగదిలో కూర్చున్న ఉగ్రనరశింహాచార్యులకు మనసు ఉడికిపోతున్నది. నెలరోజులుగా వాళ్ళూ వీళ్లూ రావటం, మామగారికి డబ్బులివ్వటం చూస్తూనేవున్నాడు అతను. ఊర్కే ఇంత డబ్బు మామగారి చేతిలో పడటంతో అతని మనస్సు ఈర్ష్యతో కొట్టుమిట్టాడుకుపోయింది. ఇంత డబ్బు ఉత్సవాల పేరిట తగలేసేబదులు తనకిస్తే, తను సక్రమంగా ఖర్చుపెట్టేవాడుగా అని అతని దుగ్ధ.

అప్పటికే ఒకటిరెండు సార్లు భార్యకి చెప్పాడు, "మీ నాయన్నడిగి ఓ వందరూపాయలు తీసుకురా, నాకర్జంటు పని వుంది'' అని.

"మీరే అడగండి. నాన్నను డబ్బడగటం నావల్లకాదు. ఇప్పటికే అందాల్సిన డబ్బు అందక ఆయన ఎంతో ఇబ్బందిపడిపోతున్నాడు'' అంది రంగనాయకమ్మ.

"బుద్ధిలేకపోతేసరి, ఎందుకింత డబ్బు తగలేయటం. ఆ డబ్బు నాకిస్తే చక్కగా బిజినెస్ పెట్టుకునేవాడిని. మీ నాన్నకీ దేవుడిపిచ్చి ఎప్పుడు వదుల్తుందో'

"ఆయన పిచ్చి ఆయన్ది. మిమ్మల్నేం డబ్బడగటంలేదుగా''

"నోర్మూసుకో. ఆడముండవి. నీకేంతెల్సొచ్చు. దేవుడు దయ్యమని డబ్బు తగలేస్తున్నాడు. కొంప గుండంచేస్తున్నాడు. అటు మీ తమ్ముణ్ణీ, తోడుగా మీ నాయనమ్మనూ నిజాంబాదులో వుంచి చదువు చెప్పిస్తున్నాడు. ఇంక మనకు మిగిలిచచ్చేదేముంది?"

"ఆయన డబ్బు మనకెందుకు? మన ఆస్తి మనకుందిగా. అయినా మీరేం వైష్ణవులండీ దేవుడి కైంకర్యంలో ఖర్చయ్యే డబ్బు వృధాఖర్చనుకుంటారు''

"నీ ముఖం వైష్ణవం. వైష్ణవమతంలో నాకు నచ్చిందొకటే. ఏరోజూ ఉపవాసాలుండాల్సిన పనిలేదు. హాయిగా రోజూ పులిహోరా, దధ్యోజనం, పిండివంటలతో సాపాటు చెయ్యొచ్చు''

భర్తకసూయ అని రంగనాయకమ్మకు తెల్సు. అయినా తనేం చెయ్యగలదు. తండ్రి ఏం తప్పుచేస్తున్నాడని తను ఆయనకు చెప్పగలదు. భర్తకు కూడా ఆమె ఏం చెప్పలేకపోయింది. అతని ఆలోచన, అహంకారం తప్ప మరేం ఆ బుఱ్ఱలోకి పోవనీ ఆమెకు తెలుసు.

పక్కగదిలో కూర్చుని తనకు పైసారాని మామగారి మెట్టవేదాంతం వింటూ ఉడికిపోతూన్న ఉగ్రనరశింహాచార్యులకు, తండ్రిపక్కనే తన భార్య కూర్చుని ఆ పనికిమాలిన మాటలను వినటం అతనికి మరీ కోపం కల్గించింది. గది గుమ్మంలో నిలబడి రెండు మూడుసార్లు భార్యని పిల్చాడు. రంగనాయకమ్మ భర్త పిలుపు విననట్టు మిన్నకుండిపోయింది. ఉగ్రనరశింహుడికి ఉగ్రంగా ఆగ్రహం వచ్చింది. విసవిసా వచ్చి రంగనాయకమ్మను జుట్టుపట్టుకు లాగి తిట్టుకుంటూ, బాదుతూ లోపలకు లాక్కెళ్ళాడు. అక్కడ చేరిన జనమంతా నిర్ఘాంతపోయి చూస్తున్నారు. కృష్ణమాచార్యులు ముఖం అవమానంతో మ్లానమైంది.

అందరిముందునుండి అలా తన్నుకుంటూ భార్యను లాక్కొచ్చినవాడు గదిలోకి రాంగానే, "పద, ఈ కొంపలో క్షణముంటే నేను మా నాయనకు పుట్టలేదు'' అన్నాడు.

రంగనాయకమ్మ ఏం మాట్లాడలేదు. ఏడుస్తూ కూర్చునివుంది.

"భోజనం చేసి వెళ్ళవచ్చులే. ఇప్పుడేం ముంచుకొచ్చిందని అంత గోలచేస్తున్నావు'' అంది శ్రీలక్ష్మి.

అత్తగారికేం సమాధానం చెప్పలేదు నరిశింహాచార్యులు. "లేలే... శనిగ్రహంముండా, చెప్తే నీక్కాదూ?" అని కాలితో ఒక్క తన్ను తన్నాడు రంగనాయకమ్మను.

శ్రీలక్ష్మి ఇంక వుండబట్టలేకపోయింది. "ఇదుగో, ఇంక దానిమీద చెయ్యి చేసుకున్నావంటే నీకు మర్యాద దక్కదు చెప్తున్నాను. అల్లుడివని మర్యాదగా చూస్తుంటే మరీ కొమ్మెక్కి కూర్చుంటున్నావు. జాగర్త' అంది ఆమె.

అత్తగారు నిర్మొహమాటంగా మాట్లాడేస్తుంది. అందుకే అత్తగారంటే ఏమూలో భయముంది అతనిలో. కోపంగా పక్కనున్న గ్లాసును తన్నుకుంటూ వెనకగదిలోకి పోయాడు నరశింహాచార్యులు.

భోజనాల ఏర్పాట్లు జరుగుతున్నాయి. విస్తళ్ళు వేశారు. వడ్డనలు ప్రారంభమైనాయి.

చాలామంది వచ్చి కూర్చున్నారు. కృష్ణమాచార్యులు వెళ్ళి అల్లుడిని సాపాటుకు రమ్మని ఆహ్వానించలేదు. వచ్చినవాళ్ళలో ఎవరో అన్నారు, "మీ అల్లుడుగారు భోంచేయరా'' అని.

కృష్ణమాచార్యులు ఉడయవర్లని పిల్చి, "ఇదుగో ఉడయవర్లూ! మా దశమగ్రహానికి ప్రళయతాపం హెచ్చిందట. వచ్చి సాపాటు చేసి తగలడమను'' అన్నాడు.

నరశింహాచార్యులు కిటికీలోనుండి భోజనపు ఏర్పాట్లు చూస్తూనేవున్నాడు. తన్ను పిలుస్తారా లేదా అని ఎదురుచూస్తున్నాడు. తనంతట తాను వెళ్ళి బంతిలో కూర్చోటానికి అహంకారం అడ్డొచ్చింది. మామగారి మాటలు వినగానే కోపంతో పిచ్చెక్కిపోయింది అతనికి. కోపంతో బూతులు తిట్టుకుంటూ మామగార్ని కొట్టటానికి వచ్చాడు. పదార్థాలు వడ్డించిన విస్తళ్ళనన్నీ తొక్కుకుంటూ, మంచినీళ్ళ గ్లాసులను తన్నుకుంటూ వచ్చి మామగారిమీద కలియబడ్డాడు. అక్కడున్న జనం అతన్ని పట్టుకు ఆపారు. ఆపినా ఆగక ఉగ్రనరశింహుడిలా తనను పట్టుకున్నవాళ్ళని చేతులతోను, కాళ్ళతోనూ తన్నటం మొదలెట్టాడు. ఇక లాభంలేదని అతన్ని పట్టుకున్నవాళ్ళు అతన్ని తన్నుకుంటూ బయటకు తీసుకెళ్ళారు. సౌమ్యుడు, సదాచారుడూ, పెద్దమనిషీ అయిన కృష్ణమాచార్యులుగారినలా అవమానించటం సహించలేకపోయారు ఊరివాళ్ళు.

"చెప్పండి ఆచార్యులగారూ! వీడికి మదం బలిసింది. మీ సొమ్ము తిని తెగ కొవ్వెక్కివున్నాడు. ఏకీలుకాకీలు విరిచేస్తాం మళ్ళీ మీ జోలికి రాకుండా'' అన్నారు వాళ్ళు.

"వద్దులేండి నాయనా! అతన్నలా వదిలేయండి. ఎవడికర్మ పరిపాకంబట్టి వాడి జీవితం అలా నడుస్తూ ఉంటుంది. ఎవడికర్మకెవరు కర్తలు..." అన్నారాయన.

పెద్ద అవమానం జరిగిపోయింది నరశింహాచార్యులికి. ఇంక అక్కడ ఉండకుండా భోజనవిస్తళ్లను తొక్కిన కాళ్ళతోనే చెప్పులయినా లేకుండా మిట్టమధ్యాహ్నం నడుచుకుంటూ తన ఊరికి వెళ్ళిపోయాడు.

కసాబిసా తొక్కిన ఆ భోజన పదార్థాలనెవరు తింటారు. అసలా హాలంతా పెద్ద ఆగమైపోయింది. ఆ విస్తళ్ళన్నీ ఎత్తించి, హాలంతా కడిగించి, మళ్ళీ వంటలు చేయించి భోజనాలు అయ్యేటప్పటికి సూర్యాస్తమయమైంది.

అలా అతను వెళ్ళిన వారంరోజులకల్లా కృష్ణమాచార్యులుకు లాయరు నోటీసు వచ్చింది. "నా క్లయింటు అయిన శ్రీ ఉగ్రనరశింహాచార్యులుగారి భార్య శ్రీమతి రంగనాయకమ్మగారిని మీరు ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా, ఆమె తన భర్తవద్దకు వెళ్ళాలని తపిస్తున్నా, అక్రమంగా, బలవంతంగా ఆమెను మీ ఇంట్లో ఉంచుకోవటం చట్టవిరుద్ధమైన పని. తను తన భార్యను తీసుకువెళ్ళడానికి వస్తే మీరు అతన్ని కొట్టి, తిట్టి పంపినట్లుగా మా క్లయింటు ఆరోపిస్తున్నాడు. అందువల్ల మళ్ళీ తాను కనుక మీ గ్రామం వస్తే మీరు తన ప్రాణానికే ముప్పు తెస్తారేమోనని భయపడుతున్నాడు. కనుక మీరు ఈ నోటీసు అందిన వెంటనే అతని భార్యయైన రంగనాయకమ్మను, ఆమెకున్న సొమ్ములతోపాటు, వివాహ సందర్భంగా కట్నంపేరిట ఆమెకు ఇస్తానన్న ఎకరం పొలం వెంటనే ఆమెపేరున రిజిష్టరు చేయించి, ఆ పత్రాలతోపాటు నా క్లయింటు ఇంటివద్ద దించవల్సింది. ఈ నోటీసు అందిన వారంరోజుల లోపల మీరీ పని చేయకపోయినట్లైతే మీపై సివిలు, క్రిమినల్ చర్యలు తీసుకోగలమని హెచ్చరించటమైనది'' అని వుంది ఆ నోటీసులో.

ఆ నోటీసును చదివిన కృష్ణమాచార్యులు హతాశుడైపోయాడు. పైగా ఆయనకు కోర్టులు, వకీళ్ళు అంతా కొత్త. ఆయన తనమానాన తను తన విధి విధానమైన జీవితం గడుపుకునేటటువంటివాడేకానీ లౌక్యవ్యవహారాలంతగా తెలియనివాడు. కూతురి జీవితం ఎలా గడుస్తుందా అని భయపడుతున్న కృష్ణమాచా

ర్యులు, శ్రీలక్ష్మికి ఇదొక అశనిపాతమైంది. పైగా కట్నంతాలూకు ఎకరం పొలమేమిటో వాళ్ళకర్థంకాలేదు. ఉడయవర్లని పిలిపించారు.

"నీకెందుకు బావా? నువ్వేం బెంగపడకు. నేను వెళ్ళి వాళ్ళతో మాట్లాడతాను. వాళ్ళేం కొత్తవాళ్ళా. నేనంతా సానుకూలపర్చుకొస్తానుగా'' అని ఆయన సాలూరు వెళ్ళాడు.

వెళ్ళంగానే నరశింహాచార్యులు ఉడయవర్ల మీద ఇంతెత్తున ఎగిరిపడ్డాడు. "ఆయన అల్లుణ్ణన్న ఆలోచన కూడా లేకుండా నన్నింత అవమానం చేస్తాడా? పైగా మీరేం మొహంపెట్టుకు వచ్చారండీ. నా పెళ్ళాన్ని తీసుకురాకుండా మీరెందుకొచ్చారసలు'' అని.

ఉడయవర్లూ ఊరుకోలేదు. "చాల్చాల్లేవయ్యా! నువ్వవమానం చేశావా, ఆయన అవమానం చేశాడా, చెప్పొచ్చావు. దాన్ని తిట్టి, కొట్టి, ఆ భాగవతోత్తముడేదో పండగ జరుపుకుంటుంటే రభసచేసి, వచ్చిన అతిథులెవరూ భోంచెయ్యకుండా వాళ్ళ విస్తళ్ళనన్నీ కాళ్ళతో తొక్కి నువ్వు చేసిన ఘనకార్యం గొప్పదా? అసలు పరువుగలవాళ్ళ ఇళ్ళల్లో ఎవరయినా నీ గోల భరిస్తారటయ్యా? కూతురు పెళ్ళయిన ఏడేనిమిదేళ్ళదాకా కూతురి సంసారాన్ని భరించాల్సిన అవసరం ఆయనకేంటి? నీ భార్యను నీ ఇంటికి తెచ్చుకో, ఎవరూ వద్దనరు. అయితే, ఆ ఎకరం గోలేమిటి? మాట్లాడుకున్న కట్నం నీకిచ్చేశారు. మళ్ళీ కొత్తగా కట్నమేమిటి?" అని దులిపేశాడు.

"అది వాళ్ళ దుర్మార్గానికి నేను వేసే జుల్మానా. నేను బోధన్‌లో కాపురం పెట్టాలనుకుంటున్నాను. మా వూరు మరీ పల్లెటూరు. ఇక్కడుంటే పొద్దుపోవటంలేదు. కనుక ఆయన్ని ఎకరం పొలం అమ్మి డబ్బు సర్దమనండి''

"బాగుంది, నీ కాపురం పెట్టుకోటానికి ఆయనెందుకు డబ్బివ్వాలి? ఆ ఎకరం పొలమేదో నీదే అమ్ముకో, ఆయనెందుకమ్మాలి?"

"ఎందుకమ్మడూ, చచ్చినట్టు అమ్ముతాడు. కొడుక్కి నిజాంబాదులో తల్లిని తోడుంచి చదువు చెప్పించటంలా. దానికెంత ఖర్చవుతున్నదీ, నేనెప్పుడయినా ఒక్కసారయినా అడిగానా? ఆయనకుమాత్రం బుద్ధుండక్కర్లా. కొడుక్కి అంత పెట్టేవాడు కూతురికేం పెట్టక్కర్లేదా? పెళ్ళిచేసి పంపేస్తే బాధ్యత తీరిపోతుందిటండీ!"

"ఇంతకీ ఏమంటావయ్యా! చివరిమాటేదో చెప్పు''

"చెప్పటానికేంవుందీ! ఎకరం పొలం అమ్మి డబ్బు పట్టుకురమ్మనండి, అంతే''

"ఇప్పటికిప్పుడు పొలం అమ్మాలంటే కొనేవాడు దొరకవద్దుటయ్యా''

"అయితే ఎకరం పొలం, దాని పేర రాసి ఆ కాయితాలు పట్టుకురమ్మనండి''

"ఏమమ్మా సుందరమ్మత్తా! నువ్వన్నా కొడుక్కు చెప్పలేవమ్మా, నీ కొడుకు ఇంత అసందర్భంగా మాట్లాడుతూంటే!"

"నేనేం చెప్పను నాయనా! ఆ కృష్ణమాచార్యులు అన్నయ్య మహానుభావుడు, పుణ్యపురుషుడు, పరమ భాగవతోత్తముడు. ఆయన వీణ్ణి అవమానించాడంటే నేనెట్లా నమ్మగలను. నేనే ఆ పిల్లను నా కొడుక్కు కట్టుకుని దాని గొంతు కోశాను. నేను నెత్తీ నోరూ కొట్టుకుని చెప్పాను. నా మాట వినడు. గట్టిగా అంటే తల్లిముండననైనా చూడకుండా కొట్టొస్తాడు. నేనసమర్థురాల్ని నాయనా! నేనేం చేయలేను. మా వెధవ చేసేపనుల్లో నాకూ భాగముందని మాత్రం అన్నయ్యను అనుకోవద్దని చెప్పు. ఆయన ఇవ్వవలసిందంతా ఎప్పుడో ఇచ్చేశాడు. ఇన్నేళ్ళూ కూతుర్నీ, అల్లుణ్ణీ, మనవడూ, మనవరాలితో సహా పోషించాడు. ఆయనమాత్రం ఇంకేం చేయగలడు'' అంది ఆమె.

"ఇదుగో ఉడయవర్లగారూ! నా భార్య మేనమామగా మిమ్మల్ని గౌరవిస్తాను. మా అమ్మకేంతెలుసు. ఆమెతో మాట్లాడి ప్రయోజనం లేదు. మీరు వచ్చారనే నేను రాజీకి

వచ్చాను. అదే మా మామ ముండాకొడుకు వస్తే చెప్పునా, చాటనా కొట్టి పంపేవాణ్ణి. నన్ను పోషించేదేమిటండీ ఆయన. ఆయన లాంటి సవాలక్ష బికార్లను నేను పోషించగల ను. రమ్మనండి, రేపు టౌనులో కాపురం పెడ్తానుగా, రోజూ వచ్చి దొబ్బి తిని పొమ్మ నండి. రెండ్రోజులు కూతురికీ, అల్లుడికీ తిండి పెట్టాడో లేదో, ఏదో పరాయివాళ్ళకు పెట్టినట్టు ఏడ్చుకుపోతున్నాడు''

ఉడయవర్లు పంటకుర్తి వచ్చి నరశింహాచా ర్లు అన్న మాటలన్నీ చెప్పాడు. కృష్ణమాచార్యు లకు ఎకరం పొలం అమ్మటం ఇష్టంలేదు. అల్లుడికివ్వటమూ ఇష్టంలేదు. ఆయనకే అప్పులయి ఒకటి, రెండెకరాలు అమ్మాల్సిన పరిస్థితిలో వున్నాడు.

ఈలోపల నరసింహాచార్యులు తల్లిని తీసు కొచ్చి బోధన్‌లో కాపురం పెట్టాడు. టౌనుకొ చ్చిన ఊరి పెద్దలతో కృష్ణమాచార్యులుకు కబుర్లు పంపేవాడు. మామని కోర్టుకీడుస్తానని బెదిరింపులు జారీచేసేవాడు. ఓరోజు పంటకు ర్తిలో పెద్ద రైతు రాఘవరెడ్డి బోధన్‌లో కన్పిస్తే ఆయన్ను హెూటల్లో కూర్చోబెట్టి కాఫీ టిఫెను లిప్పించి మామగార్ని తిట్టటం మొదలెట్టాడు. "చూశారుగదండీ మా మామ మంచితనం. నా భార్యను కాపురానికి పంపకుండా ఇంట్లోపె ట్టుకు కూర్చున్నాడు. అంత కూతురు గారాబ మయితే పెళ్ళెందుకు చేశాట్ట? పెళ్ళి చెయ్య కుండా ఇంట్లో పెట్టుకోకపోయార్టా? పైగా పెళ్ళ ప్పుడు నా పెళ్ళాం పేరిట ఎకరం పొలం రాస్తానని చెప్పి తర్వాత మాట్లాడకుండా ఊర్కొన్నాడు. మరేమయ్యా పొలమిస్తానన్నా వుకదా, ఏమిటి సంగతి అంటే నేనెప్పుడిస్తాన న్నానూ' అంటాడు. ఇదేం పెద్దమనిషితరహా అండీ. ఊళ్ళో పెద్దలు మీబోటివాళ్ళయినా ఆయన్నోట్లో ఇంత గడ్డి పెట్టవచ్చుకదా! నా సంగత్తెలియదు ముండాకొడుక్కి! ఎప్పుడయి నా టౌనుదిక్కు వచ్చినప్పుడు బుర్ర బద్దలుకొ డతాను పంగనామాల కొడుకుని!" అంటూ తన నుద్ది విన్పించాడు.

ఇలా నల్గురైదుగురితో 'బుర్ర బద్దలుకొడతా ను' అని కబురు పంపటంతో కృష్ణమాచార్యుల భార్య, తల్లి భయపడిపోయారు. రంగనాయక మ్మ దిగాలుపడిపోయింది. నిజానికతను అంతటి మనిషి కూడా. కోపం వస్తే పిచ్చి ఎక్కినట్టవుతుంది అతనికి. ఆ పిచ్చిలో ఏంచే స్తాడో కూడా అతనికి తెలియదు.

చివరకు ఊరిపెద్దలంతా కృష్ణమాచార్యుల కే నచ్చచెప్ప ప్రయత్నించారు. "మీ అల్లుడు త్రాష్టుడెలాగో వినడు. మీరయినా వినండి. మీకు ఇద్దరు పిల్లలే కాబట్టి పిల్ల తిన్నా పిల్లవాడు తిన్నా మీకొకటే. ఎకరం పొలం పిల్లపేరున పెట్టండి. ఫలసాయం అనుభవి స్తుంటారు'' అని.

"అయ్యో బాబూ! విషయం అంతటితో పోదండీ. పొలం దానిపేరున పెట్టినప్పటి నుండి అదమ్మెయ్యమని దాని ప్రాణం తీస్తా డండి'' అని కృష్ణమాచార్యులు మొత్తుకున్నా డు.

నిజానికి అది చాలా తలవంపులు పన యింది కృష్ణమాచార్యులుకు. ఆయన జీవి తంలో ఎప్పుడూ ఏ విషయానికీ ఇలా రచ్చకె క్కింది లేదు. ఎవరి చేతా మాటనిపించుకు న్నదీ లేదు. చివరికలా అల్లుడివల్ల అందరిచే తా చెప్పించుకోవాల్సి వచ్చింది.

అయితే పీరుసాయిబ్బు కృష్ణమాచార్యుల నుద్ధరించాడు. ఓరోజు అతను బండికట్టుకుని పంటకుర్తి వచ్చాడు. "కోడల్ని పంపించండి ఆచార్లగారూ! సుందరమ్మక్క కూడా తీసుకుర మ్మన్నది'' అన్నాడు కృష్ణమాచార్యులుతో.

"ఆ ఎకరం పొలం దానిపేర రిజిష్టరు చేసి ఆ కాయితాల్తో పంపుతాను మా అమ్మాయిని. ఒట్టిచేతుల్తో పంపిస్తే దాన్నేంచేస్తాడో అతను'' అన్నాడు కృష్ణమాచార్యులు.

"ఉట్టినే మీ సొమ్ముతింటే మా ఇజ్జతే ముంటుందయ్యా! మీరు పొలం ఇవ్వనక్కర్లే దు. కోడల్ని పుట్టింట్లో వుంచితే మాకే తల్ల వంపులుగా వుంది''

"ఇప్పుడిలా పంపిస్తే ఏం తందనాలు తొక్కుతారో. అమ్మాయిని బతకనిస్తాడో లేదోన య్యా పీరుసాయిబ్బూ!"

"మీరట్టా భయపడకండి ఆచారిసాబ్! మేమందరం లేమా? అమ్మాయినేమన్నా అంటే మేం చూస్తూ ఊర్కొంటామా?" అన్నారు పీరుసాయిబ్బు.

ఇద్దరు పిల్లల తల్లైన కూతురికి అప్పుడు చీరె సారెలిచ్చి అంపకాలు పెట్టారు తల్లిదండ్రులు. మనసులో అల్లుడేం గందరగోళం చేస్తాడోననే సందేహం వాళ్ళకు లేకపోలేదు. అయితే పీరుసాయిబ్బు నమ్మకంమీద కూతుర్ని పంపారు.

నరశింహాచార్యులకు భార్యంటే ప్రేమే. ఆమె లేకుండా ఒంటరిగా వుండటం దుర్భరమన్పించింది. పీరుసాయిబ్బు నాలుగు తిట్టి అమ్మాయిని తీసుకొస్తానని పోబోతుంటే పైకి బింకానికి వద్దన్నాడుకాని, భార్య వచ్చిన తరువాత ఆమెనేమీ అనలేదు.



కూతుర్ని అత్తవారింటికి పంపినప్పటి నుండి రోజూ బోధన్‌కొచ్చి పాలమ్ముకునే చెంచమ్మతో పాలు, పెరుగూ పంపేవాడు, అడపాదడపా కూరలూ పంపేవారు కృష్ణమాచార్యులు. అవేం వద్దనలేదు నరశింహాచార్యులు. ఎప్పుడయినా బోధన్ వచ్చినప్పుడు మనసుండబట్టలేక అల్లుడు ఇంట్లోలేని సమయం చూసుకుని కూతుర్ని చూసి వెళ్లేవారు ఆయన. కూతుర్ని చూడకుండా వుండలేని కృష్ణమాచార్యుల వ్యామోహం నరశింహాచార్యులకు మామగార్ని సాధించటానికి అనువుగా లభించింది. ఓ రోజు "ఏడే! రోజూ పంగనామాలెట్టుకుని సాతాని ముండాకొడుకులా తయారై వస్తున్నాట్ట మీ నాయన. ఆయన్ని మనింటికి రావద్దని చెప్పు'' అన్నాడు భార్యతో నరశింహాచార్యులు.

తనను అంత ప్రేమగా చూసే తండ్రిని తమ ఇంటికి రావద్దని ఎలా చెప్పాలో ఆమెకు తోచలేదు. భర్తతో ఏం మాట్లాడినా చిక్కే. అందుకే ఏం మాట్లాడలేకపోయింది ఆమె.

"నీకే చెప్తుంట, విన్నావా? మీ నాయన్ని మనింటికి రావద్దని చెప్పు''

"ఆయనేం చేశాడండీ పాపం రావద్దని చెప్పటానికి'' అంది రంగనాయకమ్మ.

"ఆ పాపిష్టి ముండాకొడుకు దృష్టి పడ్తే మనకు దరిద్రం చుట్టుకుంటుంది. నీకు తెలీదు. చెప్తున్నా విను. ఆ నా కొడుకుని రావద్దని చెప్పు''

"నేను చెప్పటమెందుకూ మీరే చెప్పొచ్చుగా''

"ఛఫ్ నోర్మూసుకుని నేను చెప్పింది చెయ్యి. లేకపోతే చాంతాడు తిరగేస్తా''

రంగనాయకమ్మేం మాట్లాడలేదు. కృష్ణమాచార్యులు వచ్చి వెళ్తూనే వున్నాడు కానీ రంగనాయకమ్మ మాత్రం తండ్రిని తమ ఇంటికి రావద్దని చెప్పలేకపోయింది. అయితే నరశింహాచార్యులు మాత్రం తను పట్టిన పట్టు విడవలేదు. రోజూ అడిగేవాడు, "రావద్దని చెప్పావా మీ నాయనకి'' అని. చెప్పలేదంటే కొడ్తాడేమోనని భయం. ఓసారి మరీ నిర్బంధించి అడిగితే అంది... "అట్లాగే చెప్తాను. ఆయన మొహం చూడటమే మీకంత కష్టమైతే, రోజూ ఆయన పంపే పాలూ, పెరుగూ తీసుకోవటమెందుకూ. అవీ పంపవద్దని కూడా చెప్తాను'' అని.

"పాల్లేకపోతే చాయ్‌కి ఇబ్బంది. పెరుగు లేకపోతే సాపాటు చేసినట్టుండదు'' అన్నాడు అతను.

"పాలూ, పెరుగూ మనం నెల ఖాతాపెట్టి ఇక్కడే పోయించుకుందాం"

"మనకు పైసలు దండగ. ముసలి నా కొడుకు పొగరణచాలి. పంపించనీ మధ్యలో నీ గోలేంది?"

"ఆయన రావటం ఇష్టంలేనప్పుడు, ఆయన పంపే వస్తువులుమాత్రం మన కెందుకూ''

"ఏ... తిక్క తిరుగుతుందాయేం. ఎవడ బ్బ సొమ్ము పంపిస్తాడు. మనకు హక్కులేదూ ఆయనకున్నదాంట్లో'' అన్నాడు నరశింహాచా ర్యులు భార్యవంక విచిత్రంగా చూస్తూ.

"అవును, మనకన్నీ హక్కులే, బాధ్యతలే మాత్రంలేవు'' అంది రంగనాయకమ్మ మనసు కష్టపెట్టుకుంటూ.

అప్పుడే నెత్తిన బుట్టపెట్టుకుని వచ్చింది చెంచమ్మ. బుట్ట దించుకుంటూ, "అమ్మా! ఇయ్యాళ పెరుగు దొరకలేదు. నిన్న పాలు విరిగిపోయాయంట. మజ్జిగ మాత్రం పంపా రు'' అంది బుట్టలోనుండి మజ్జిగకుండ తీస్తూ.

నరశింహాచార్యులకు భార్య వాదనతోనే మంటగా వుంది. మామగారు మజ్జిగ పంపార నేటప్పటికి అతని కోపం నసాళానికంటింది.

"తప్పుడు కొడుకు! ఇంట్లో పాలు విరిగితే, పొరుగింట్లో పెరుగు తీసుకు పంపించొచ్చుగా. ఈ మజ్జిగ నీళ్లతో కూడేం తినిచస్తాం. అంతా నీవల్లే జరుగుతోంది. ఆ నాకొడుకుని ఇంటికి రావద్దని చెప్పమంటే చెప్పవా? గుమ్మం ఎక్కొద్దంటే కమ్మెచ్చున తీసినట్టుండేవాడు. మనిషి పొగరు దిగి, సరిగ్గా మసలుకునేవాడు. నువ్వు చెప్పకపోబట్టే అలుసు తీసుకుని ఆ నా కొడుకు ఇవాళ మజ్జిగ పంపాడు. రేపసలేం పంపడు. ఛీనీయవ్వ! ఈ మజ్జిగ నీళ్లెవడికి కావాలి. వాడి బొందనే పెట్టుకోమను'' అని అంటూ ఆ మజ్జిగ కుండ తీసుకుని రంగనాయ కమ్మ తలకేసి కొట్టాడు నరశింహాచార్యులు.

కుండ పగిలి, మజ్జిగంతా రంగనాయకమ్మ ను తడిపేసింది. తలకు గాయమై రక్తం కారసాగింది. నరశింహాచార్యుల తల్లి అది చూసి పెద్దగా అరిచి రాగాలు పెట్టసాగింది "ఓర్నాయనో, నా కొడుకు చచ్చినాడు నా కోడల్ని చంపేశాడురో నాయనో! ఓర్నీ అహంకారం నాశనంగాను. ఆ పెద్దమనిషి నెందుకు సాధించి ఛస్తావురా. నీకు బాగుపడే రోజులులేవురా. కానీ సంపాదన లేకుండా ఇంట్లో తిని కూర్చోటమే కాకుండా మనుషుల ను కూడా చంపుకుతింటున్నావురా. నా కడుపు నెందుకు పుట్టావో. నేనేం పాపం చేశానో క్రిందటి జన్మలో నీలాంటి దుష్టుడిని కనటాని కి..." అని.

సాధారణ పరిస్థితుల్లో అయితే తల్లి అలా తిడ్తే, ఆమెని ఇల్లంతా తిప్పి చాంతాడుతో ఉతికి వుండేవాడే ఉగ్రనరశింహాచార్యులు. కానీ భార్య తలకి గాయమై రక్తం కారటం మొదలవగానే అతనికి భయం పట్టుకుంది. తల పగిలిందేమో, ఆమె చచ్చిపోతుందేమో. చస్తే పోలీసుకేసు, జైలుశిక్ష... అలా ఆలోచన లు మనసులో తట్టి గప్‌చుప్‌గా ఇంట్లోనుండి ఉడాయించేశాడతను.

నిజానికి భర్త శిక్షణా పర్యవేక్షణలో రంగనా యకమ్మ తలగట్టి పడ్డది కనుక కొద్ది గా యంతో సరిపోయిందికానీ, రోజూ బొప్పెలు కట్టి మానేటటువంటి శిక్షణలేని మామూలు తలైతే విచ్చిపోయివుండేది.

చెంచమ్మ పంటకుర్తికి తిరిగివెళ్లి కృష్ణమాచా ర్యులకు, శ్రీలక్ష్మికీ ఈ వార్త చెప్పగానే వాళ్లు కూతురికేమైందోనని గుండెలు బాదుకుంటూ వచ్చారు. అప్పటికే ఆమె తేరుకుంది. సుంద రమ్మ గాయం మీద పసుపు అద్ది, కట్టుక ట్టింది.

అలా భయంతో బిక్క చచ్చిపోయి పరారా యిన నరశింహాచార్యులు వారం రోజులదాకా అయిపులేడు. నిజాంబాదులో స్నేహితుడింట

తిష్ట వేశాడుకాని, ఎప్పుడు వచ్చి పోలీసులు పట్టుకెళ్తారేమోననే భయంతో వణికిపోయాడు. వారం రోజులున్నా ఏం కాకపోవటంతో, ఇంక మనసుండబట్టలేక, అక్కడే చదువుతున్న బావమరిది రామానుజాచార్యుల దగ్గరికి వెళ్లి "అరే! మీ ఇంటికెళ్లి మీ అక్కకెట్లావుందో చూసిరారా. నేను వచ్చి వారం రోజులయింది. నాకిక్కడ పనులతో వెసులుబాటుకావటం లేదు. నేను వచ్చేటప్పటికి మీ అక్కకు ఒంట్లో బావుండలేదు. ఎట్లా వుందో ఏమో నువ్వెళ్లిచూసిరా. మరో మాట. నేనిక్కడున్నట్టు అక్కడెవరికీ చెప్పకు'' అని డబ్బులిచ్చి పంపాడు నరశింహాచార్యులు.

చూడుకుడుత్తమ్మ మనమరాలికెలావుందోనని గాబరాపడ్డది. మనవడు బోధన్‌వెళ్లి తిరిగి వచ్చి తన బావగారు చేసిన ఘనకార్యం చెప్పినప్పుడు ఆమె నరశింహాచార్యులను తిట్టిపోసింది. రామానుజాచార్యులు బావగారి దగ్గరకు వెళ్లి, "నువ్వెక్కడకు వెళ్లావో అని దిగులు పడ్తున్నారు బావా అందరూ. నువ్వలా అక్కను చెండుకు తింటం బాగాలేదు'' అన్నాడు.

"నీ ముఖం రా వెధవా! ఈ ఆడవాళ్లున్నారు చూశావూ. ఎప్పటికప్పుడు వీళ్లని తందంతాం పితరంతాం చేస్తూ వుంటేనే తప్ప వాళ్లు మన మాటవినరు. రేపు పెళ్లి చేసుకుంటావుకదా! గారాబం చేసి నెత్తి కెక్కించుకోకు'' అన్నాడు నరశింహాచార్యులు. భార్యకేం కాలేదని తెల్సి పోలీసుల బెడద తొలగిపోయిన ఆనందంతో బావమరిదికి హితబోధచేస్తూ...

పెద్ద ప్రమాదం గడిచి బయటపడిన సంతోషంతో బావమరిదిని తీసుకెళ్లి హొటల్లో వద్దన్నకొద్దీ టిఫిన్ పెట్టించాడు. సిగరెట్టిచ్చి ముట్టించమన్నాడు.

"వద్దు బావా! నేనెప్పుడూ సిగరెట్టు తాగలేదు'' అన్నాడు రామానుజాచార్యులు.

"ఒరే పిచ్చిసన్నాసీ! పులిహారలూ, దద్యోజనాలు తిని నీ బుర్ర మొద్దుబారిపోయింది. మీ నాయనలాంటి చదువులేని మూర్ఖులు సిగరెట్టు తాగటం తప్పంటారుకానీ వాళ్లకేం తెల్సురా దీనిమజా! తాగిచూడు కిక్కొస్తుంది. అప్పుడు నువ్వే అంటావు 'బావా! నువ్వన్నదే కరెక్టు' అని''

రామానుజాచార్యులు ఎంత చెప్పినా వినలేదు నరశింహాచార్యులు. బలవంతంగా అతని చేత సిగరెట్టు తాగించిందాకా అతని మనసుండబట్టలేదు. అలా మొదలైన సిగరెట్ల పాఠం మళ్లీ జీవితంలో మర్చిపోలేకపోయాడు రామానుజాచార్యులు.

ఆరోజు బావమరిదిని సినిమాకు తీసుకు వెళ్లాడు నరశింహాచార్యులు. సినిమాహాల్లో సినీతారల గురించి అదిట్లా, ఇదిట్లా, అదలా సినిమాలోకొచ్చింది. సినిమాలోకొచ్చి అదెన్ని చేతులు మారిందనుకున్నావు. ఒరే నేనసలు సినిమా ఫీల్డ్‌లో కెళ్లాల్సినవాడిని. మీ నాయనా, అమ్మా పడనిచ్చారు కాదుగానీ, అదే సినిమా ఫీల్డ్‌లోకి వెళ్తే మనమిట్టా వుండేవాళ్లమా?" అంటూ సినిమా ఫీల్డు గురించి రంజైన కథలు చెప్పాడు. రామానుజాచార్యులు బావగారి వంక గొప్పగా చూస్తూ ఆయన సినీజ్ఞానానికి మురిసిపోయాడు.

భార్య బాగా వుందని తెల్సిన నరశింహాచార్యులకు భయం తీరిందిగానీ, భార్యమీద, తల్లిమీద కోపంవచ్చింది. తనింత భయంతో ఇక్కడ తన్నుకు చస్తుంటే తనకు కబురంపాల్సిన బాధ్యతలేదూ వాళ్లకు. నీయమ్మ, చావ నీముండల్ని. తను వెళ్లడుగాక వెళ్లడు కొంపకు అని భీష్మించుకు కూర్చున్నాడతను. స్నేహితుడి దగ్గర అప్పుచేసి మూడు సినిమాలు, ఆరు హొటళ్లుగా జల్సాగా కాలం గడపసాగాడు.

నరశింహాచార్యులు నిజాంబాదులో గుండులా వున్నాడని తెల్సినా రంగనాయకమ్మా, సుందరమ్మా అతడు ఇంటికి రాలేదని దిగులు పడ్డారు. అతన్ని తీసుకు రమ్మని పీరుసాయిబ్బును పంపారు. ఆ మర్నాడు 'రాజువెడలె రవి తేజములలరగ' అన్నట్లు గృహప్రవేశం చేశాడు నరశింహాచార్యులు.

"ఏమయ్యారు ఇన్ని రోజులు. మీరెక్కడకు వెళ్లారోనని మేం దిగులు పడ్డాం" అంది రంగనాయకమ్మ.

"నీ మొహం, ఎక్కడకు వెళ్తాను! అయినా మగాడన్న తర్వాత సవాలక్ష పనులుంటాయి. అన్నీ నీకు చెప్పి ఏడ్వాలా? నోర్మూసుకో" అని మగతనం వెలగబెట్టాడు నరశింహాచార్యులు.

రామానుజాచార్యులు పెళ్లి జరిగింది. పెళ్లిలో ఏం గోల చేస్తాడో నరశింహాచార్యులని రంగనాయకమ్మా, ఆమె తల్లిదండ్రులూ ఎంతో భయపడ్డారు. కాని కృష్ణమాచార్యులు ముందే జాగ్రత్తపడి అల్లుడికి, కూతురికి, పిల్లలకు వియ్యాపురాలికీ మంచి మంచి బట్టలు పెట్టటమే కాకుండా ఆడబిడ్డ కట్నం కింద కూతురికి ఘనంగానే ముట్టచెప్పాడు. భార్యకొచ్చిన ఆ డబ్బునెలా ఖర్చు చేయాలన్న ఆలోచనలో పడిన నరశింహాచార్యులకు పెళ్లిలో ఏదో గోలచేసి మామగార్ని ఇబ్బంది పెట్టాలనే ఆలోచనకు తీరిక లేకపోయింది. పాపం, సాదాసీదా మనిషవటంవల్ల ఒకసారికి ఒక ఆలోచన మాత్రమే చేయగలడతను. గ్రహశాంతవటంవల్ల ఆ పెళ్లితో కొంత సఖ్యత కుదిరింది మామా అల్లుళ్లకు.

మనవడి పెళ్లయింతర్వాత ఎక్కువ కాలం బతకలేదు చూడుకుడుత్తమ్మ. ముసలితనం తప్ప ఆమెకేం రోగం రాలేదు. తింటూ తిరుగుతూనే ఎవరిచేతా చేయించుకోకుండా కాలం చేసింది.

నరశింహాచార్యులకు డబ్బు ఇబ్బంది ఎప్పుడూ వున్నదే. ఓరోజు భార్యనడిగి ఆమె చంద్రహారం తాకట్టుపెట్టి డబ్బు తీసుకు రావటానికి బయలుదేరాడు. అంతలో కృష్ణమాచార్యులు రావటంతో మామగారికీ విషయం తెలుస్తుందేమోనని భయపడ్డాడు నరశింహాచార్యులు. అనుకున్నట్లుగానే కృష్ణమాచార్యులు కూతుర్ని "నీ మెళ్లో చంద్రహారమేమయిందే" అని అడగనే అడిగాడు.

రంగనాయకమ్మ భర్త వంక చూసిందిగానీ ఏం మాట్లాడలేదు.

కృష్ణమాచార్యులు గ్రహించాడు, "ఇదుగో నరశింహాచార్యులూ! అమ్మకు తింటే ఎన్ని రోజులొస్తాయయ్యా సొమ్ముగానీ, ఆస్తిగానీ. ఏదీ ఆ చంద్రహారమిలాతే. నీకెంత డబ్బు కావాలో నేనిస్తాగా'' అని అన్నాడాయన.

"సరే ఎవరైతే నాకేం. ఇదుగో ఇది తీసుకుని రెండొందలివ్వండి'' అన్నాడు నరశింహాచార్యులు.

అతనికి తెల్సు మామగారిచ్చిన డబ్బు తిరిగివ్వాల్సిన అవసరముండదనీ, నగా ఎక్కడకూ పోదనీ.

అలా మామగార్ని బ్లాక్‌మెయిల్ చేయటం సాగించాడు నరశింహాచార్యులు. పొలాలు అమ్మటానికి ప్రయత్నించాడుకానీ పడనిచ్చాడుకాదు కృష్ణమాచార్యులు. ఆయన సాలూరు వెళ్లి రైతులకు చెప్పాడు, "అతను పిల్లలు కలవాడు, పొలాలు అమ్ముకు తింటుంటే ఎన్ని రోజులుంటుంది ఆస్తి. మీరతన్ని పొలాలు అమ్మనివ్వకుండా చూడండి. బేరాలురానివ్వకండి'' అని. ఆ రైతులకు కృష్ణమాచార్యులంటే గౌరవం. నరశింహాచార్యుల సంగతివాళ్లకు మొదటినుండి తెల్సిందే. పొలమమ్మాలన్న అతని ప్రయత్నాల్ని వాళ్లు వమ్ము చేశారు. గోలచేస్తే "మీ మామగార్ని తీసుకురండి. ఆయన సరేనంటే అలాగే అమ్ముదురుగాని'' అనేవాళ్లు.

ఇంటికొచ్చి తల్లిని, భార్యని చెడతిట్టేవాడు అతను. మామగార్ని బండబూతులు తిట్టేవాడు. "ఈ పంగనామాల నా కొడుకెక్కడ దొరికాడంట నాకు. వీడు చస్తేగానీ నాకీ జీవితంలో మనశ్శాంతి లేదు'' అనేవాడతను.

"మీరాయన్ని 'పంగనామాలవాడు' అని తిట్టినందువల్ల అగౌరవం ఆయనకికాదు. మీ సంస్కారం మాత్రమే బయటపడుతోంది'' అంది రంగనాయకమ్మ.

"ఏం నా సంస్కారానికేమొచ్చిందే. మొగుడికి ఎదురు చెప్పటం నేర్పి పంపాడుగా ఆ

మహా సంస్కారవంతుడు''

"ఏం ఎదురు చెప్పాను మీ మాటకు?"

"ఏం చెప్పలేదే నీయవ్వ! నా మాటకంటే ఆయనకే ఎక్కువ విలువిస్తున్నావు నువ్వు''

"ఆయన్ని తిట్టొద్దన్నాను తప్పా?"

"తప్పా, తప్పున్నరా? అసలు నా ఆస్తి సంగతి ఆయనకెందుకు? నా విషయాల్లో జోక్యం ఎందుకు కలుగచేసుకోవాలి? నా పొలానికి బేరం రాకుండా చేస్తాడా రైతులకు చెప్పి?"

"నువ్వూ, నీ పిల్లలూ సుఖంగా, సంతోషంగా వుండాలనే కదురా ఆయన తాపత్రయం" అంది సుందరమ్మ.

"నువ్వూర్కోవమ్మా! పెట్టింది తిని పడుండక అనవసరపు మాటలు మాట్లాడతావు'' అన్నాడు నరశింహాచార్యులు కోపంగా.

"మా పెట్టేవులే నాయనా నీ స్వంత సంపాదనలో ఏమన్నా పెట్టావా? మీ నాయన ఆస్తిని కరిగించి పెడ్తున్నావు. నిజానికా ఆస్తి నాది. నాకు రావల్సింది కొడుకువి కనుక నువ్వేం చేసినా మాట్లాడక ఊరుకుంటున్నాను'' అంది సుందరమ్మ.

"ఛట్ నోర్ముయ్యి! నేను పుట్టటంతోనే ఆస్తి హక్కుతో పుట్టానే. ఆస్తి నీదన్నావంటే బొక్క విరగ్గొడతాను. నీలాంటి తల్లులెవరూ వుండరు! నీకూ, దానికీ కూడా నాకంటే ఆయనే ఎక్కువైపోయాడు. నా ఆస్తి అమ్ముకుంటాను, ఆర్చుకుంటాను, చూస్తాను ఆ నాయాలెట్టా అడ్డం వస్తాడో'' అన్నాడు విసవిసా బయటకు నడుచుకుంటూ వెళ్ళిపోతూ.

[illegible]ా బయటకెళ్ళిన నరశింహాచార్యులు నాల్గు రోజులదాకా ఇంటి ముఖం చూడలేదు. అతను ఇంటికొచ్చిన రెండు రోజులకు పోస్టులో లాయరు నోటీసు ఒకటి వచ్చింది అతనికి.

"మీరు నా క్లయింటూ, నిజాంబాదు వాస్తవ్యుడూ అయిన మధుసూదనరావుగారి దగ్గర ప్రోనోటురాసి వెయ్యి రూపాయలు తీసుకుని రెండు సంవత్సరాలు కావస్తున్నది. రెండు సంవత్సరాలలోపల డబ్బు అసలు, ఫాయిదాలతో సహా చెల్లిస్తానని హామీ పత్రం రాసి వుంటిరి. కనుక ఈ నోటీసు అందిన పది రోజుల్లో మొత్తం వడ్డీతోసహా చెల్లించవల్సింది. లేకపోయినట్లయితే మీ మీద కోర్టులో సివిలుదావా వేయటమవుతుంది'' అని వుంది ఆ నోటీసులో.

"ఏమిటిరా ఆ వచ్చిన కాయితం" అనడిగింది సుందరమ్మ.

"మా మావకు చావు నోటీసు''

"ఏమిట్రా అది?"

"నేను మధుసూదనరావు దగ్గర తీసుకున్న వెయ్యి రూపాయలు వడ్డీతో సహా వెంటనే చెల్లించాలట. లేకపోతే కోర్టులో వేసేస్తాడట" అని నరశింహాచార్యులు తల్లికి వివరిస్తూనే వున్నాడు. అంతలో కృష్ణమాచార్యులు హడావుడిగా నడుస్తూ ఇంట్లోకొచ్చాడు.

"అమ్మయ్య! ఇంట్లోనే వున్నావన్నమాట. బయటికెళ్లావేమోననుకున్నాను. ఏమిటయ్యా ఈ ఉత్తరం" అన్నాడు ఆయన లాల్చీ జేబులో నుండి ఉత్తరం తీసి అల్లుడికిస్తూ.

ఆ ఉత్తరం చదివి చూసుకుని, "అహాం మీకూ వర్తమానమందిందన్న మాట. ఆ నా కొడుకు ఫాస్ట్‌గానే యాక్ట్ చేస్తున్నాడు. ఇంకేం చెయ్యదల్చుకున్నారో చెయ్యండి'' అన్నాడు నరశింహాచార్యులు చిద్విలాసంగా నవ్వుతూ.

"రా నాన్నా! కూర్చో'' అంది రంగనాయకమ్మ మంచంవాలుస్తూ

"అదేమయ్యా! అతనలా రాస్తే నీకు చీమ కుట్టినట్టయినా లేదు!"

"ఏమిటి నాన్నా! ఎవరు ఏం రాశారు'' అనడిగింది రంగనాయకమ్మ.

"ఎవరో మధుసూదనరావుట. ఆయన దగ్గర రెండేళ్ళక్రితం వెయ్యి రూపాయలు అప్పు చేశాట్ట నీ మొగుడు. డబ్బు అసలు, ఫాయిదాలలో కనుక చెల్లించక పోయినట్లయితే కోర్టుకెళ్తాట్ట. పరువు ప్రతిష్టలున్న మనుషులు కనుక మీ అల్లుడి విషయం మీకు రాస్తున్నాను.

వాడంతట వాడు బాకీ తీర్చడన్న సంగతి నాకుతెల్సు. మీరు వాడిపై వత్తిడి తీసుకు వచ్చి నా బాకీ వసూలయ్యేట్టు చూడవ ల్సింది. నేను కోర్టులో కేసువేస్తే పోయేది మీ పరువేకాని, వాడిది కాదు. ఎందుకంటే వాడికి పరువు ప్రతిష్ఠలు లేవుకనుక. ఆ సంగతి నాకూ మీకూ తెల్సిందే' అని రాశాడే అమ్మాయి!" అన్నాడాయన తన మనసులోని బాధను వ్యక్త పరుస్తూ.

"ఎవరండీ అతను'' అనడిగింది రంగనా యకమ్మ.

"నిజాంబాదులో నా దోస్త్ లేడూ వాడు'' అన్నాడు నరశింహాచార్యులు నింపాదిగా.

"ఆయన దగ్గరెందుకు తీసుకున్నారు అప్పు?"

"ఎందుకు తీసుకోవటమేంది! అన్నీ నీకు వివరంగా చెప్పాలా? ఇంటి ఖర్చుల కోసమే తీసుకున్నాను''

"పొలం మీద వచ్చే అయివేజంతా తగలె డుతూనే వున్నారు. పైన ఈ అప్పెందుకు చేశారు?"

"నేనేం మింగలా! నీకూ, నీ పిల్లలకోసమే తీసుకున్నాను''

"అంత గొంతుమీద కత్తెరేం వచ్చిందిరా, పత్రం రాసిచ్చి అప్పు చేయటానికి'' అనడి గింది సుందరమ్మ.

"అవసరంపడే తీసుకున్నానంటే అర్థమ యిచావటంలా? నా దగ్గర పైసలేదు. ఇప్పుడు చావండి అందరూ కట్టగట్టుకుని'' అన్నారు నరశింహాచార్యులు కోపంగా.

"అదేమిటయ్యా అట్లా మాట్లాడతావు. అత ను కోర్టుకు లాగేది నిన్నేకాని నన్నుకాదు. నీకేం పట్టనట్టూ, బాధ్యతలేనట్టూ మాట్లాడకు'' అన్నారు కృష్ణమాచార్యులు.

"సరే బాధ్యతవుందంటాను. దానివల్ల ప్ర యోజనమేంది?"

"పద, అతని దగ్గరకెళ్లి మాట్లాడదాం. పత్రం తిరగరాద్దాం. బాకీ తీర్చటానికి మరి కొంత సమయమివ్వమని అడుగుదాం"

"నేను రాను. ఆ గాడ్ద కొడుకుతో మాట్లాడా ల్సిన అవసరం నాకులేదు. వెధవ, స్నేహితుడ నైనా చూడకుండా నాకు లాయరు నోటీసిప్పి స్తాడా? వాడి పొగరణుస్తాను. వాడెంత, వాడి తాహతెంత. కొని పారెయ్యగలను వెధవను''

"అంత కొని పారెయ్యగలిగితే మరతని అప్పు తీర్చెయ్యండి'' అంది రంగనాయక మ్మ.

'ఓర్నీయవ్వ! ఒకసారి చెపితే నీ బుర్రకెక్క దా? చెమ్డా లెక్కదీస్తాను, మళ్లీ వాగావంటే. నా దగ్గర పైసలేదంటే వినవేం" అని చొక్కావే సుకుని, సిగరెట్టు ముట్టించి మామగారి మొ హాన ఉఫ్ అని పొగ ఊదుతూ బయటకెళ్లిపో యాడు నరశింహాచార్యులు.

ఇంత బాధ్యతా రహితంగా మాట్లాడే వ్యక్తి వంక నిర్ఘాంతపోయి చూస్తూ కూర్చుండిపో యారు తండ్రీ, కూతుళ్లు.

"ఇప్పుడేం చేద్దామంటావన్నయ్యా! అప్పు తీర్చకపోతే వాణ్ణి ఖైదు చేస్తారేమో'' అంది సుందరమ్మ భయపడిపోతూ.

"అదే నాకూ అర్థం కావటం లేదమ్మా! ఉడయవర్లతో సంప్రదించి ఏం చెయ్యాలో ఆలోచిస్తాను'' అన్నాడు కృష్ణమాచార్యులు ఉస్సురని లేస్తూ.

మర్నాటికల్లా ఉడయవర్లని నిజాంబాదు పంపాడు కృష్ణమాచార్యులు. అతను తిరిగివ చ్చి చెప్పిన సంగతిది! "నేను వెళ్లి అతనితో మాట్లాడాను బావా! ఆ మధుసూదనరావు పాపం మనిషి చాలా మంచివాడు. మరేం చేయనండీ, ఎంతకాలమాగేది. నాకూ డబ్బు ఇబ్బందిగా వుంది. వాడూ నా మిత్రుడే. వాడిని కోర్టుకీడ్చడం నాకూ ఇష్టంలేదు. వాణ్ణ డిగితే డబ్బివ్వడు. పైన బూతులు తిడ్తాడు. మరిక నాకు మార్గాంతరం లేక అలా చెయ్యా ల్సి వచ్చింది. పోనీ, మీకూ అంతగా చేతిలో డబ్బాడకుంటే పత్రం తిరగరాయమనండి. నా తంటాలు నేను పడ్తాను అనన్నాడు".

మధ్యాహ్నానికల్లా బావామరుదులు బోధన్ కి వచ్చారు. వాళ్లు వచ్చేటప్పటికే కళ్లకు గంతలు కట్టుకుని గుర్రుకొట్టి నిద్రపోతున్నాడు పక్కగదిలో నరశింహాచార్యులు.

మొగుడిని నిద్రలేపి తండ్రీ, మామయ్యా వచ్చారని చెప్పటానికి భయపడింది రంగనాయకమ్మ. సుందరమ్మే వెళ్లికొడుకుని నిద్రలేపింది. "లేరా నాయనా, మీ మావగారూ, ఉడయవర్లూ వచ్చారు'' అంటూ.

"నీయవ్వ! ఓ వేళాపాళా లేదా ఈ ముసలి ముండాకొడుకులు రావటానికి. వస్తే వచ్చి చచ్చారు, నీకేం పోయేకాలమే సుఖంగా నిద్ర పోతున్నవాడిని నన్ను లేపటానికి'' అంటూ లేచి, నిద్రమత్తులోనే వెళ్లి, మామగారి ఎదురుగా నిలబడి "ఏంటీ, ఏం కావాలి?" అనడిగాడు.

"ఏవీ లేదు. నేను నిన్న నిజాంబాదు వెళ్లి ఆ మధుసూదనరావుతో మాట్లాడి వచ్చాను. అతను నువ్వు పత్రం తిరగరాస్తే చాలన్నారు. మరి నిజాంబాదు వెళ్దాం పద" అన్నాడు ఉడయవర్లు.

"నేనా దరిద్రుడి మొహం చూడను. మళ్లీ ఆ వెధవతో సంబంధం పెట్టుకునే ప్రశ్నేలేదు'' అన్నాడు నరశింహాచార్యులు.

"మరెట్లా పరిష్కరించాలనుకుంటున్నావీ సమస్యను?"

"వాడిబొంద వాడేం చేస్తాడు నన్ను. నరికి పారెయ్యనూ వెధవని! మిమ్మల్ని బెదిరించటానికి రాశాడా వుత్తరం"

"మామకి రాసిన ఉత్తరం సంగతి సరేనయ్యా! నీకూ లాయరు నోటీసు పంపారుగా. దాని సంగతేమిటి?"

"ఏవుంది... కోర్టులో కేసు వేసుకోనివ్వండి. వాళ్లు తీర్పిచ్చినపుడే అప్పు తీరుస్తాను. ఇప్పుడంత ముంచుకుపోయిందేవుంది?" అన్నాడు నరశింహాచార్యులు ఆవలిస్తూ.

"కోర్టుకెక్కి నానా రభస చేసుకోటంకంటే గుట్టు చప్పుడుగాక అతనితో మాట్లాడి ఫైనల్ చేసుకుంటే సరిపోతుంది కదయ్యా'' అన్నారు ఉడయవర్లు.

"మళ్లీ అదేమాటంటారు! నేనా వెధవ ముఖం చూడనని చెప్తే మీకర్థం కాదేం"

"మరి తీర్పిచ్చిన నాడయినా బాకీ తీర్చాలా లేదా? ఆ పైన కోర్టు ఖర్చులు, వకీలు ఫీజు, ఇవన్నీ అనవసరపు దండగలు కదయ్యా?"

"అవును, అయితే నన్నేం చేయమంటారు?"

"అందుకే నిజాంబాదు వెళ్లి అతనితో మాట్లాడమంటాను''

"నేనక్కడకురాను''

"పోనీ పొలం ఓ రెండెకరాలమ్మి ఆ అప్పు తీర్చెయ్యి''

"ఇప్పుడు నా పొలానికి బేరాలు రావు. అలా రాకుండా చేసింది మీరే'

"మా ప్రయత్నం మేం చేసుకుంటాంగా. బేరాలు తెచ్చే పూచీమాది''

"నేను పిల్లలుగలవాడిని. పొలమమ్మటం నాకిష్టం లేదు. ఇట్టా అమ్ముకుపోతుంటే ఎంత ఆస్తయినా ఇట్టే కరిగిపోతుందని మామగారెప్పుడో అన్నారు. ఆయన మాత్రం ఇవాళ నా పొలమెందుకు అమ్మమంటాడు?"

ఈ మాటలతో చిర్రెత్తుకొచ్చింది ఉడయవర్లకు.

"అయితే, నువ్వనేదేంటయ్యా! మా పొలాలు అమ్మి నీ బాకీ తీర్చమంటావా?"

"తీర్చండి, తప్పేం వుంది. నామీద ఎక్కడలేని ప్రేమ ఒలకపోస్తున్న వాళ్లకు ఈ బోడి వెయ్యి రూపాయల అప్పెంత? తీర్చెయ్యండి''

"నీ బాకీ తీర్చాల్సిన అవసరం మాకేం లేదు. నువ్వు తీర్చుకో, మానుకో బాకీ తీర్చకపోతే జైల్లో పెడ్తారు. లేకపోతే ఆస్తి జప్తు చేస్తారు. అప్పుడు కాని తిక్కతిరిగి తిన్నగా వుండవు''

"ఏందండీ... నా ఇంట్లో వచ్చి కూర్చుని మర్యాద లేకుండా నన్ను తిడ్తారు. అసలా కేసు విషయం నాకు సంబంధించింది. దాంట్లో మీరు తలలు దూర్చాల్సిన అవసరమేముంది? పరాధికారం పైన వేసుకుంటే జరిగేదేంటో, మహా పండితులు మీకు చెప్పాల్సిన అవసరం నాకు లేదు'' అన్నాడు తిరిగి వెళ్లబోతూ నరశింహాచార్యులు.

"ఎక్కడికీ మళ్లీ బయల్దేరావు'' అనడిగాడు ఉడయవర్లు.

"బంగారంలాంటి నిద్ర చెడగొట్టారు. కళ్లు తూలిపోతున్నాయి. మధ్యాహ్నం కాసేపు నిద్ర పోకపోతే నాకు వంట్లో బాగుండదు. వెళ్లి పడుకుంటాను'' అన్నాడు నరశింహాచార్యులు.

ఇంక ఈ సమయంలో అతనితో మాట్లాడటం వ్యర్థమని అర్థమైంది బావా మరుదులకు. వాళ్లేం మాట్లాడలేదు.

"ఏవేవ్, నాలుగ్గంటలకల్లా గారెలు వండు. మీ నాయనా, మీ మామయ్యా కూడా వచ్చారుగా తింటారు. అల్లం మిరపకాయలు బాగా దట్టించు. నిద్రలేచాక వెయ్యి. గారెలు వేడిగా లేకపోతే నాకు బాగోదు. వింటున్నావా నిద్ర మొహందానా!'' అని భార్యకు ఆజ్ఞలు జారీ చేసి శయన గృహానికి వేంచేశాడు నరశింహాచార్యులు.

సమస్య తీర్చకుండా వట్టి చేతులతో వెళ్లిపోవడం బావామరుదులకిద్దరికీ ఇష్టంలేదు. ఆ కుంభకర్ణుడు నిద్ర లేచిందాకా నిరీక్షించటం తప్ప మరి గత్యంతరంలేకపోయింది వాళ్లకు.

సాయంత్రం నాలుగూ, నాలుగున్నరకు నిద్రలేచి, ముఖం కడుక్కువచ్చి, వంటింట్లో పీటమీద వేంచేసి, భార్య తయారు చేసి ప్లేట్లో పెట్టి తెచ్చిచ్చిన వేడివేడిగారెలు తింటూ ఆత్మారావణుడిని తృప్తిపర్చిన నరశింహాచార్యులు ప్రసన్నవదనుడయాడు.

"మీ అమ్మాయిని పూజా పునస్కారాలు, భక్తీపాడూ అని చెడగొట్టినా, చక్కగా వంటచేయడం మాత్రం నేర్పారు. అందుకు కృతజ్ఞతగా నేను కూడా నా చేతనైన సాయం మీకు చెయ్యాలి. ఏం కావాలో చెప్పండి చేస్తాను'' అన్నాడు నరశింహాచార్యులు భక్తులకు వరాలను గ్రహించే భగవంతుడిలా.

"ఏంవుందయ్యా! పొలం రెండెకరాలమ్మి, ఆ బాకీ తీర్చు'' అన్నారు కృష్ణమాచార్యులు.

"అట్టాగే, రెండెకరాలు కాదు, మూడెకరాలు అమ్ముతాను. నాకూ వేరే చేబదుళ్లున్నాయి. అవీ తీర్చాలి. బేరం కుదిర్చి రిజిష్టారు ఆఫీసుకు ఆ కొనే నా కొడుకుని తీసుకురండి. సంతకం చేసేస్తాను. ఖర్చులక్రింద రూపాయి శాతం కమీషను కూడా తీసుకోండి. నాకభ్యంతరంలేదు'' అన్నాడు నరశింహాచార్యులు ఉదారంగా.

మరింక కృష్ణమాచార్యులకు తప్పలేదు. మూడెకరాలూ అమ్మించి, నరశింహాచార్యులను వెంటబెట్టుకుని నిజాంబాదులో మధుసూదనరావు దగ్గరకు వెళ్లాడు ఉడయవర్లు. అతని బాకీ వడ్డీతో సహా చెల్లించి పత్రం రద్దు పర్చారు.

"మీరెళ్లండింక. మావాణ్ణి చూసి చాలాకాలమైంది. నేనివాళ వాడితో వుండి, రాత్రికి సినిమా చూసి, రేపు బోధనొస్తాను. మా అమ్మకు, మీమేనకోడలికీ అలా అని చెప్పండి'' అని పంపేశాడు నరశింహాచార్యులు ఉడయవర్లను.

నిన్నమొన్నటి దాకా ఒకళ్ల నొకళ్లు బండ బూతులు తిట్టుకున్న మిత్రులిద్దరూ ఆత్మీయంగా మాట్లాడుకోవటం చూసి ఆశ్చర్యపోయాడు ఉడయవర్లు.

అయితే ఇదంతా మామగార్ని వంచటానికి మిత్రులిద్దరూ కలిసి పన్నిన పన్నాగమని రెండు రోజుల్లోనే తెల్సిపోయింది రంగనాయకమ్మకు. నరశింహాచార్యులే చెప్పాడామెకు. "మీ నాయన రోగం మా బాగా కుదిర్చాను. లేకపోతే సవ్యంగా అమ్ముదామనుకుంటే నా పొలానికి బేరం రానివ్వడా? పోతే పోయింది

వెధవడబ్బు మీ నాయన పొగరు మొత్తం మా బాగా అణిచాను. పంగనామాల నా కొడుకు. మళ్లీ మన విషయంలో జోక్యం చేసుకోకుండా వాతపెట్టాను'' అన్నాడతను భార్యకు తన ప్రతాపాన్ని తెలియబరుస్తూ.

"డబ్బు పోవటమేంటీ?" అనడిగింది రంగ నాయకమ్మ.

"మరి ఆ మధుగాడు ఊరికే ఒప్పుకున్నాడా ఈ నాటకమాడటానికి. వసూలయిన డబ్బులో మూడో వంతు ఇస్తేగానీ వీల్లేదన్నాడు. సర్లే, స్నేహితుడి లం... కొడుకువైపోయావు. తీసుకు చావు. మా ఉడయవర్లు బాబాయొస్తాడు. నన్ను నీ ఇష్టమొచ్చినట్టు తిట్టు. జైల్లో పెట్టిస్తానని బెదిరించు. అమాయకం నా కొడుకులు! కోర్టులు, కేసుల సంగతి తెలియని వాళ్లు. నా దారికి రాకపోతే చెవికోయించుకుంటాను అని చెప్పాను వాడికి. మా చక్కగా నాటకమాడాడు. నాకే ఆనందంవేసి ఇంకో వంద రూపాయలు తీస్కోరా, బహుమానంగా అన్నా. 'వద్దురా, స్నేహితుడువి నువ్వు, నీ కన్యాయంచెయ్యలేను నేను' అన్నాడు వాడు. ఏ ఫ్రెండ్ ఇన్ నీడ్ ఈజె ఫ్రెండ్ ఇండీడ్ అన్నట్టు ప్రవర్తించాడు వాడు.''

మొగుడి మూర్ఖత్వానికి, అహంకారానికి నవ్వాలో, ఏడవాలో అర్థంకాక మిన్నకుండిపోయింది రంగనాయకమ్మ.

కాని ఎవరి జీవితాల్ని ఎవరు శాశ్వతంగా కాపాడగలరు! కృష్ణమాచార్యుల భార్య శ్రీలక్ష్మి చనిపోవటంతో ఆయన చివరి భవబంధం తెగిపోయినట్లయింది. కొడుకు రామానుజాచార్యులు చదువు పూర్తిచేసి హైదరాబాదులో ఉద్యోగం చేసుకుంటున్నాడు. అతను భార్యతో అక్కడే కాపురం పెట్టాడు. తండ్రిని తన దగ్గరకు రమ్మన్నాడుకానీ ఆయనకు అక్కడకు వెళ్లటం ఇష్టంలేదు. తనే వంట వండుకునేవాడు. శిష్యులకు పాఠాలు చెప్పేవాడు. అలా అధ్యయన, అధ్యాపన కార్యాల్లో ఆయన జీవనం గడిచిపోసాగింది.



"ఆ సంచీ, సామాను ఏమిటి నాన్నా! ఎక్కడ కన్నా ప్రయాణమా?" అని అడిగింది రంగనాయకమ్మ తండ్రి రావటం చూసి.

"అవునమ్మా! తీర్థయాత్రలకని వెళ్తున్నాను. తిరిగివద్దామనే వెళ్తున్నాను. ఏమో మళ్లీ వస్తానో లేదో, అందుకని నిన్ను చూసి వెళ్దామని వచ్చాను'' అన్నాడు కృష్ణమాచార్యులు ఉస్సురని చాపమీదకూర్చుంటూ.

"అదేమిటి నాన్నా! మరి తమ్ముడికి చెప్పావా!" అని అడిగిందామె. ఆమె ఇంకేమనగలదు. తండ్రిని తన దగ్గర వుండమనలేదు. తను పంటకుర్తి వెళ్లి ఆయన దగ్గరా వుండలేదు.

"ఇంతకు ముందొకసారి ఇటు వచ్చినప్పుడు వాడికి చెప్పాను. హైదారాబాదులో వాడిని చూసే వెళ్తాను. వాడు వద్దన్నాడు. అయినా ఇంకెప్పుడు అవన్నీ తిరిగి చూడగలను. వంట్లో ఇంకా ఓపిక వున్నప్పుడే తిరిగి రావటం మంచిదని బయల్దేరాను. సాయంత్రం దాకా ఇక్కడే వుంటాను. సాయంత్రం బండికి వెళ్తాను'' అని అన్నాడాయన.

రంగనాయకమ్మ ఇంక ఉండబట్టలేకపోయింది. "నువ్వువెళ్లవద్దు నాన్నా! మా ఇంట్లో వుండు'' అంది ఆమె.

అక్కడేవున్న పీరుసాయిబ్బు కలగజేసుకుంటూ, "అదేందమ్మా! ఆయన్నాపటమెందుకూ? పోనీ, చూసిరానీ. ఆ అల్లా ఆయ

న్ని తన తీర్థస్నానాలకి పిలిపించుకుంటున్నాడు. నాకూ మక్కాయాత్ర పోవాలని ఎన్నాళ్లి నుండోవుంది. ఖర్చుతో కూడుకున్నపని. నావల్ల అవుద్దో కాదో. ఈ తనువు రాలిపోయేలోగా చూడగలనో లేనో' అని అన్నాడు.

"అదేం తాతా! అంత కోరిగ్గావుంటే వెళ్లిరా వచ్చుగా'' అంది రంగనాయకమ్మ.

"ఎట్టా కుదురుతుందమ్మా! అది మన దేశం కాదయ్యే. సముద్రందాటి పోవాలి. నా చేతనైనంత కూడబెడ్తూనే వున్నాను. ఆ అల్లా దయ ఎట్లావుందో, నన్ను పిలిపించుకునే శక్తి ఆయనకేగాని నాకులేదు. సరే, ఆచారిసాబ్! సాయంత్రం నేను వచ్చి మిమ్మల్ని స్టేషనుకు తీసికెళ్తాను. మీరు నడిచెళ్లకండి'' అన్నాడు లేస్తూ పీరుసాయిబ్బు.

"నీకు కష్టం ఎందుకు పీరుసాయిబ్బూ! నేను నడిచి వెళ్లగలనులే' అన్నారు కృష్ణమాచార్యులు.

"అట్లాకాదు ఆచారీ సాబ్! అల్లా తానకెళ్తున్నావు. నా పనినే చేయొద్దూ. ఏ కాస్త పుణ్యం చేసినా నా హజ్‌యాత్ర వీలు పడ్తుందేమో'' అని వెళ్లిపోయాడతను.

నరసింహాచార్యులు ఊళ్లోలేడు. నిజాంబాదు వెళ్లాడు. వుంటే మామగార్ని చూసి మురమురలాడేవాడే. సుందరమ్మకు వియ్యంకుణ్ణి చూస్తే చాలా సంతోషం. ఆయన ఉన్నంతసేపూ నాలుగు భక్తి మాటలు చెప్తాడనీ, తత్త్వబోధ చేస్తాడనీ ఆయనంటే ఆమెకు గౌరవం. "వదినగారు పోయినప్పటినుండి మీసాపాటుకు ఇబ్బందిగా వుందేమో. మీరూ మాతో వచ్చి వుండొచ్చుకదా! ఇదేం పరాయిల్లా! కూతురి ఇల్లేకదా!" అని అంది ఆమె.

"లేదు లేమ్మా! నాకక్కడేం ఇబ్బందేంలేదు. ఒక్కడి కోసం వంట చేయటమెంతసేపు. అయినా నేనెక్కడుంటే వెళ్లమారిపోదమ్మా! బంధనాలు తెంచుకోటం కష్టంగావుంది. ఆ పోతనామాత్యుడన్నట్టు

'దేహము కారాగేహము,
మోహము నిగళంబు రాగముఖరములు రిప్పు
వ్యూహములు భక్తితో ని
న్నూహింపని యంత తడవు నో కమలాక్ష

పాండిత్యం శ్రీపతి పాదాబ్జ సేవకు మనసు నాయత్తం చేయటం లేదెందుచేతనో' అన్నాడాయన నిట్టూరుస్తూ.

"అదేంటి అన్నయ్యగారూ! మీరే ఇలా అంటే మరి మాబోటి అజ్ఞానుల సంగతేమిటి?" అంది ఆమె.

"జ్ఞానం ఎందుకమ్మా! కర్మ పరతంత్రుడైన వ్యక్తి మాత్రమే ఆపైన జ్ఞాన మార్గంలోకి ప్రవేశించగలడు. శ్రవణ, మనన, నిధి, ధ్యానములతో జీవుడు నిజతత్త్వాన్ని గ్రహించగలగాలి. శరీరం, జీవుడి కంటే భిన్నుడైన వ్యక్తి ఈశ్వరుడు అనే గ్రహింపు నిస్తుంది జ్ఞానం. శరీరం, ఇంద్రియాలు శరీరి అధ్యాత్మిక ప్రగతినెలా కుంటుపరుస్తాయో తెలియచెప్తుంది జ్ఞానం. ఆత్మజ్ఞానం లక్ష్యమేకాని, పరమలక్ష్యంకాదు. భౌతిక పరిసరాల్తో తనకున్న సంబంధాన్ని జ్ఞానం తెలియచెప్తే అదే అవధికాదు. భగవంతుడితో తనకున్న సంబంధాన్ని కూడా అవగతం చేసుకోవాల్సి వుంటుంది. భగవంతుణ్ణి తెల్సుకునేంతవరకూ మనిషి తన్ను గురించి సరిగ్గా తెల్సుకోలేడు. ఇది భక్తి-ప్రపత్తుల వల్ల మాత్రమే సాధ్యమవుతుంది. మరా భక్తి నాకు కలగటంలేదే''

"నాన్నా వంటయింది. సాపాటుచేసి కూర్చుని మాట్లాడుకోవచ్చు. లే.. మళ్లీ స్నానం చేస్తావేమో. స్నానం, సంధ్య అయితే సాపాటు చేద్దాం" అంది రంగనాయకమ్మ వంటింట్లోనుండి.

"పిల్లల్ని రానీ అమ్మా! తొందరేం" అన్నాడాయన.

"శేషు స్కూలుకెళ్లాడు, మధ్యాహ్నానికిగాని రాడు. ఆండాళ్లు, విరలు ఇక్కడే ఎక్కడో ఆడుకుంటుంటారు, వస్తారు. నువ్వులే' అంది ఆమె.

రంగనాయకమ్మ పెద్ద కొడుకు శేషశయనా చార్యులకు పదకొండేళ్లు, ఆరోతరగతి చదువు తున్నాడు బోధన్ స్కూల్లో. ఆండాళ్లుకి తొమ్మి దేళ్లు, విఠలాచార్యులకు ఏడేళ్లు. వాళ్లనింకా స్కూలులో వేయలేదు.

భోజనమయింతర్వాత సుందరమ్మ పక్క గదిలో పడుకుని కునుకుతీసింది. "నాన్నా! పడుకుంటావేమో, మంచం వాలుస్తాను'' అంది రంగనాయకమ్మ.

"వద్దమ్మా! ఇవాళ పడుకోను. మళ్లీ ఎప్పు డు నిన్ను చూస్తానో ఏమో, నీతో కబుర్లు చెప్తూ కూర్చుంటే నాకు తృప్తిగా వుంటుంది. కూర్చో'' అన్నాడాయన, చాపమీద ఆమెకు చోటిస్తూ.

"మరిప్పుడీ ప్రయాణం పెట్టుకోపోతే ఏం నాన్నా? దేవుడు ఎక్కడలేడు. ఆ తీర్థ స్నానా ల్లోనే వున్నాడాఏం?" అంది రంగనాయకమ్మ, వచ్చి తండ్రి పక్క కూర్చుంటూ.

"నిజమేనమ్మా! ఆ సర్వాంతర్యామి అంత టా వున్నాడు. ఈ బంధనాలు, మోహం ఇవింకా నన్ను వీడటం లేదమ్మాయి! వీటి నుండి పారిపోవాలని ప్రయత్నం.

'పుత్ర దార గృహ క్షేత్ర భూరి విషమ
ఘనసుఖాసక్తు డగుచునే మనుజుడేని
నర్థిజరియించువాడు భవాబ్ధిలోన
జెంది యెన్నాళ్లకును దరి జేరలేడు'

అని అన్నారు. మరి ఆ నిశ్చయజ్ఞానం వెదుకు తూ వెళ్తున్నాను. ఇది సత్యం, కాదనే తపన అయితేవుంది. బంధనాలు **తెంచు**కోలేని అశక్త తావుంది. ఇది ప్రతిజీవీ పడే యాతనేమో నాకు తెలియదు. ఆ గజేంద్రుడికీ కలిగింది సందేహం 'కలడు కలండనెడివాడు కలడో లేడో అని. రుక్మిణమ్మ తల్లీ డోలాందాయమా నమైంది 'ఘనుడా భూసురుడేగెనో, నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో, విని కృష్ణుండిది తప్పుగా దల్చెనో, విచ్చేసెనో అని. గజేంద్రుడి కి కలిగినట్టు 'నీవే తప్ప నితః పరం బెరుగ అన్న ప్రపత్తి కలిగినప్పుడే సర్వ సంశయ విచ్ఛేదమూ కలిగి పరమాత్మ సాన్నిధ్యం ఒనగూడుతుంది''

రంగనాయకమ్మ వింటూ కూర్చున్నది.

"ఇవాళ నా మనసులోవున్న ఆలోచనలన్నీ చెప్పాలనిపిస్తోందమ్మాయి! మన దేశం, మన నిజాం రాష్ట్రం కూడా నిన్నమొన్నటిదాకా పర దాస్యశృంఖలాలలో మగ్గిపోయింది. మొన్నీ మధ్యేగా మన నిజాం రాష్ట్రం భారతదేశంలో విలీనమైపోయింది. ఎంతోమంది మహానుభా వులు దేశ స్వాతంత్ర్యానికై ప్రాణాలొడ్డి పోరాడా రు, నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా ఉద్యమాలు లేవదీశారు. మనమేం చేశాం? నేనేం చేశాను? స్వీయజ్ఞాన లబ్ధికి ప్రయ త్నించాను. శ్రియః పతి మనసులో కుదురుకో వాలన్న తపన, ఆరాటంవున్నాయి. పిల్లలు సుఖంగా జీవితం గడపాలి, వాళ్లకే కష్టం రాకూడదు అన్న తాపత్రయం పడ్డాను. నిజాని కెంత స్వార్థం! నాకు వ్యక్తిగతంగా మోక్షం వస్తే ప్రపంచానికేమిలాభం? నా వ్యక్తిగత జీవనం సుఖశాంతులతో గడచిపోతే దేశాని కేమి ఒరుగుతుంది. నేను దేశానికి, మిగతా జనానికి ఏం చేశాను? ఈ సర్వజీవుల్లోనూ వశించే పరాత్పరుడు భిన్నుడంటుంది రామా నుజ మతం. నేనుమాత్రం ఆ పరమేష్టి ప్రపత్తి కోరితే చాలా! ప్రపంచం సంగతి నా కక్కరలే దా? నేనెక్కడున్నాను. నా ఉనికి ఏమిటి? ఇవన్నీ ప్రశ్నలు. వీటికి సమాధానాల్లేవు. ఒక ప్పుడు వారసత్వంగా వచ్చిన నా ఆచారం, అధ్యయనం, అధ్యాపకం నాకు తృప్తిని కల్గించాయి. అక్కడ నన్ను నేను వెదుక్కోగలి గాను. పోనుపోను అవి నేను కాదన్న సంశయం కలగసాగింది. కానీ నేనవి విడనాడ లేదు''

"నీ మనసులో ఇన్ని సందిగ్ధాలున్నాయని నాకెప్పుడూ తెలీదు నాన్నా'' అంది రంగనా యకమ్మ.

"ఎవరి మనసులోని సందిగ్ధాలు ఎవరికి తెలుస్తాయమ్మా! మనిషి జీవితంలో పెద్ద విషాదం మనస్సులో తలెత్తే ప్రశ్నలకు సమాధా

నాలు దొరకకపోవటం. మీ అమ్మ బతికి వున్నప్పుడు భౌతిక ప్రపంచానికీ నాకూ వారధి గా వుండేదామె. నాకు ప్రతి విషయంలోనూ సందేహమే. మీ అమ్మది నిశ్చయబుద్ధి. ప్ర పంచంలో రెండే ఆమెకి కన్పించేవి తెలుపు, నలుపు, దుర్మార్గం, సన్మార్గం. నిజానికంత విస్పష్టంగా విడదీసినట్టుందా ప్రపంచం? ఆమెకేం సందేహం వుండేదికాదు. చిన్నచిన్న విషయాల్లోనే నాకు సందేహం, చిన్నచిన్న ఆచారాలపట్లే అపనమ్మకం యుక్త వయస్సు రాకుండా ఆడపిల్లలకు పెళ్లి చేయటం మంచిది కాదన్న ఆలోచన నాదయితే, అలాచేయకపోతే సమాజపు కట్టుబాట్లు కాదన్నట్టవుతుంది. అదీ కాక అసలా ఆచారం మంచిదనే నిశ్చయబుద్ధి మీ అమ్మది. లౌకిక విషయాలకొచ్చినప్పుడ ల్లా ఆమె ఆలోచనలే నాకు ఆచరణ యోగ్యమ యాయి. బుద్ధి కాదంటున్నా వాటినే ఆచరించా ను. నిజానికి నేను నేర్చుకున్న, చెప్పిన చదువుకు ఈ కాలంలో విలువేముంది? దాని ప్రయోజనమేమిటి? మీ ఆయన అన్నట్టు రాగి చెంబు పట్టుకుని అడుక్కు తినటానికి మాత్రం పనికివస్తుంది. మీ అమ్మ తన కొడుక్కు చదువు వద్దంది. నిజానికది చదువుకాదా అన్నది నా మనసులో సందేహం. అయినా ఆమె మాటే విన్నాను. వాడికా ఇస్కూలు చదువే నాకు భారమైనా చెప్పించాను''

"తమ్ముడికీ చదువు పనికి రాదనుకుంటూ, మరి ఆ చదువే నీ దగ్గర చదువుకున్న విద్యార్థులకెందుకు చెప్పావు నాన్నా?" అనడి గింది రంగనాయకమ్మ.

"చక్కటి ప్రశ్న వేశావమ్మాయి! నిజానికి నేను చదువుకున్నది చదువు కాదని నేను నమ్మలేదు. ప్రయోజనం లేకపోవచ్చు. నా చదువు నా శిష్యులకే కాదు. నీకూ చెప్పాను. వాళ్లనెవర్నీ నేను రమ్మనీ, నా దగ్గర చదువుకో మనీ ప్రాధేయపడలేదు. వాళ్లకూ వేరే అవకాశా ల్లేకా, ఇస్కూలు చదువులు చదివేస్తోమతులే కా, నాది ఉచితమైన చదువు అవటం వల్లా వాళ్లు నా దగ్గరకొచ్చి చదువుకున్నారు. నా చదువుకు ఇప్పుడు ప్రయోజనం లేకపోవచ్చు. అది చదువు కాదన్న అపనమ్మకం నాకిప్పటికీ లేదు. కారణం ఇప్పటి చదువు జీవనోపాధి కవసరమైన కుశలతాజ్ఞానం ప్రసాదించేదే కాని, నిజమైన జ్ఞానం ఇచ్చేదికాదు. నువ్వు ఆడపిల్లవు కనుక, నీకు జీవనోపాధి కవసర మైన కుశలతా జ్ఞానం నీకనవసరమనుకున్నా ను. నిజమైన జ్ఞానం అవసరమనుకుని నీకా చదువు చెప్పాను. ఇవాళ నీకూతుర్ని ఇస్కూ ల్లో వేస్తానంటున్నావు. కాని ఆనాడు ఆడపిల్లలు చదువుకోటం వింత. నేను అప్పుడూ ఆ ఆలోచనల్లో ఇమడలేకపోయాను. అందుకే నా కొచ్చిన చదువు నీకు చెప్పాను. తండ్రి కూతురి కి చదువు చెప్పుకోవటం ఎవరికీ ఆక్షేపణ కలిగించే విషయం కాలేదు. మీ అమ్మ నిస్సంశయంగా చెప్పేసింది, నా కొడుక్కి చదువు వద్దని. నాకు సాంప్రదాయపు చదువు విషయంలో దాని ప్రయోజనం విషయంలో సందేహం వుంది కనుక నేను ఆమె మాటను వ్యతిరేకించలేదు''

"మరి నీకు మనోవ్యధ ఎందుకు నాన్నా! నీ విషయంలో నీకు స్పష్టమైన ఆలోచనలు న్నాయికదా!"

"నేను నీకు తండ్రిని కనుక, పుట్టినప్పటి నుండి తండ్రిని గౌరవించటం తప్ప అన్యథా భావించటమనేది నేర్చుకోకపోవటంవల్ల నీక లా అన్పిస్తుందమ్మాయి! నిజానికి నేనేమిటో, నేను చేయాల్సిందేమిటో పుట్టి బుద్ధెరిగినప్పు టినుండీ ఇప్పటిదాకా శోధిస్తూనే వున్నాను కాని నాకు సమాధానాలు దొరకలేదు''

"మరి వైష్ణవ మతం సమాధానాలు ఇవ్వలే కపోయిందా నాన్నా?"

"ఎప్పటికప్పుడు మేధావులు, జ్ఞానవేత్తలూ ఆలోచనలు చేస్తూనే వున్నారమ్మా. ఏ కొద్ది మందికో సమాధానాలు దొరికాయేమో. ఆ శంకరభగవత్పాదుడెంత యోచనచేశాడు! అయితే ఏం - ఆయన అద్వైతం, మాయా వాదం, నిరాకార నిర్గుణుడైన ఆ పరదైవం

ప్రజలకందనంత ఎత్తునుండిపోయాయి. తనను ప్రశంశించే, పూజించేవాళ్ళ ప్రేమనీ, భయాన్నీ, గౌరవాన్నీ పట్టనంతదూరంలో వుండిపోయాడా నిర్గుణాకారుడు. ఇంత తత్వానికీ ఫలితం ఏమిటి? అంత జ్ఞానం అధివశింపచేసుకోవడం ప్రాకృతబుద్ధికి అసంబద్ధంగా, అసంభవంగా కన్పించింది. ప్రపంచమంతా మాయ, మిథ్య, భగవంతుడు నిరాకారుడు. విపరీతమైన కాంతిపుంజంమధ్య చిమ్మచీకటైన దేవుడు. ఇది శంకరభగవత్పాదుల తత్వ వివేచన. బలహీనులు, పతితులు అయిన మానవులు హృదయాక్రోశంతో అర్థిస్తే ఏదో కోణాన్నుండి సాయం లభించటమనే సాధారణ అనుభూతిని, ఆయన దర్శనం గ్రహించలేదు. భక్తులు తమ కష్టసమయంలో పొందే జీవద్వంద్వమైన ఆత్మీయభావనకు ఆయన చోటివ్వలేదు. కర్తకనుభూతం కాని అమూర్తభావాన్ని సగుణబ్రహ్మోపాసకుడు మనసా వ్యతిరేకించాడు. మానవుడిలోని ఆంతరిక దైవీయప్రాణి నిత్యసత్యజ్ఞానంవల్లనో, పరిపూర్ణ సౌందర్యభావంవల్లనో తృప్తిపడక సర్వులపై ప్రవహించే పరిపూర్ణ ప్రేమతత్వం కలిగినదైవున్నది. విశ్వాత్మకూ, పరిమిత ప్రపంచానికీ మధ్య వుండే సంబంధం సాకారం చేసుకోవాలన్న మానవుడి ఆరాటం భావనతో తృప్తిపడలేదు. అలాంటప్పుడే భక్తిప్రపత్తులతో కూడిన భాగవత మతానికీ, రామానుజ మతానికీ ప్రాముఖ్యం వచ్చింది''

"అంటే రామానుజ మతం వినా మరో శరణ్యం మానవాళికి లేదన్నది అసందిగ్ధమే కదు నాన్నా?"

"లేదమ్మా! అన్ని మార్గాల్లో ఇదోమార్గం. బహుశః సులువైన మార్గమేమో! రామానుజుడికి దేవుడూ, జీవాత్మలూ, జడప్రకృతీ అంతా యదార్థమే. వాటి యదార్థత సంపూర్ణంగా భగవంతుడిమీద ఆధారపడి వున్నదయితేనేం, ఈ ప్రపంచానికి ఆధారభూతమైన ఓ ఆధ్యాత్మిక సూత్రాన్ని ఆయన గుర్తించాడు. అది ఆయన దృష్టిలో మిథ్య కాదు. విముక్తాత్మల నిరంతర వైయక్తిక ఉనికిని గూర్చి ఆయన స్పష్టంగా చెప్పాడు. జడప్రకృతీ, జీవులూ తామంతటతాము యదార్థమైనా, ఆ రెండింటిలో ఏదీ బ్రహ్మకాదు. జడప్రకృతికా స్పృహలేదు. జీవులు అవిద్యలో కొట్టుమిట్టాడుతున్నాయి. అయితే అవి బ్రహ్మకు శరీరం, బ్రహ్మ వాటి ఆత్మ. ఆ ఆత్మ వాటిని నియతం చేస్తుంది కనుక వాటికి ఉనికి ఉంది. బ్రహ్మను విడిచి అవి లేవు. మరి ఆ బ్రహ్మ ఎవరూ? వైకుంఠనివాసియైన విష్ణువు. ఇలా రామానుజుడు మతాన్ని ప్రజల అనుభూతికి దగ్గరగా తీసుకొచ్చాడు. భక్తిప్రపత్తులు వైకల్యామార్గమనీ చెప్పాడు''

"మరింక నీకింత అసందిగ్ధత ఎందుకు నాన్నా? నువ్వు ఆయన దర్శనంతో సమాధానపడలేదా?"

"ఋగ్వేదకాలంలో భగవంతుడిని ప్రార్థించటం, కర్మకాండలతో ఆయన్ని తమకు మేలుచేసేట్టుగా బలవంతపెట్టడం ఉన్నాయి. ఇవి రెండూ భక్తి, కర్మమార్గాలకు దారినిచ్చాయి. బౌద్ధం పతనమై వదలి వెళ్ళిన అయోమయ పరిస్థితుల్లో కుమారిలభట్టు బ్రాహ్మణమత సంప్రదాయాన్ని వర్ణప్రాతిపదికపై బలవత్తరం చేయప్రయత్నించాడు. మూడు అగ్రవర్గాలకే యజ్ఞయాగాది క్రతువులపై అధికారం లభించటంతో, మిగతా అత్యధిక జనం భక్తిమార్గాన్ని అనుసంధించింది. అంటే మీమాంసకులకు ప్రతిచర్యగా సగుణరూప మతాలయిన వైష్ణవం, శైవం, శాక్తేయం ప్రబలాయి. ఇవి సామాజిక స్థాయికి అంత ప్రాధాన్యాన్నివ్వలేదు. సామాజిక అనుస్పందనలో సగుణారాధన అంతర్గతంగా వుంది. దైవం మనందరికీ తల్లీతండ్రీ అయినప్పుడు అందరి సామాజిక స్థాయీ ఒకటే అవుతుంది. అందులో ఎక్కువ తక్కువలేం లేవు. తల్లిదండ్రుల హృదయాలకు బిడ్డలందరూ ప్రేమాస్పదులే. ఇలా సమానవాదాన్ని అంగీకరించే మన వైష్ణవమూ ఏంచేసింది? ఆచారపరంగా

వర్ణాలనూ, కులాల ఆధిక్యతానైచ్యాలనూ పాటిస్తూనేవుంది''

రంగనాయకమ్మేం మాట్లాడలేదు. ఓ క్షణముండి కృష్ణమాచార్యులే చెప్పాడు. "అద్వైతం జీవుడిలోనే మాధవుడున్నాడు. మానవసేవే మాధవసేవ అన్నది. ఆ ఆదర్శంతోనే వివేకానందుడు, రామకృష్ణ మిషన్‌వాళ్ళూ మానవాళికి కొంత సేవ చెయ్య ప్రయత్నించారు. మరిప్పటి రామానుజమతం ఏంచేస్తున్నది? సమాజాన్నుండి దూరమైపోయింది. వైదిక మతంలోని అవలక్షణాలనన్నీ తిరిగి తెచ్చుకుంది. ఇవి నా ఆలోచనలమ్మాయి! ఇవి నీ నెత్తిమీద రుద్దటంలేదు. మనకు బుద్ధి వుంది కనుక మనం ఆలోచించాలి''

"మరి భగవద్భక్తి తప్పంటావా నాన్నా?"

"లేదమ్మా! నేనేదీ తప్పనటంలేదు. మనం పదకొండో శతాబ్దం తర్వాత ఆలోచించటం మానేశాం. అందుకే మన జాతి ఇన్నివేల ఏండ్లు దాస్యంచేసింది. ప్రపంచానికీ, మనిషికీ, భగవంతుడికీ మధ్య వుండే సంబంధాన్ని ఎప్పటికప్పుడు తిరిగి దేశ కాలాల ప్రకారం నిర్వచించాల్సిన అవసరం వుంది. మానవ భౌతిక జీవనాన్ని గురించి కూడా ఆలోచించాల్సివుంది... లేదు, మనం ఆలోచించటం మానేశాం. అందువల్లే మనకింత అధఃపతనం సంభవించింది. నిన్నా, మొన్నా గాంధీ ఆలోచించాడు. ఆయనేకాదు, ఇంకా ఎంతోమంది ఆలోచించాల్సివుంది. ఇన్ని శతాబ్దాల మైల ఒక్క మనిషి ఆలోచనతోనే క్షాళనంకాదు''

ఆయనలా సాయంత్రంవరకూ కూతురితో మాట్లాడుతూనే వున్నాడు. మనసులో మాట ఆమెకు చెప్తూనే వున్నాడు. ఎప్పుడూ బహిరమవని ఆయనలోని అంతర్వేదన ఆనాడలా కట్టలు తెంచుకు ప్రవహించింది. ఆయన నిర్వేదం ఎందుకో, దేనికోసమో రంగనాయకమ్మ ఎప్పటికీ అర్థంచేసుకోలేకపోయింది.



సాయంత్రం బండి కట్టుకుని కృష్ణమాచార్యులను తీసుకెళ్ళటానికి పీరుసాయిబు వచ్చాడు. వెళ్ళబోయేముందు కూతుర్ని వంటగదిలోకి ఒంటరిగా పిల్చి చెప్పాడు కృష్ణమాచార్యులు, "పొలం మూడెకరాలు మిగిలాయి. అది తమ్ముడికి రాసేశాను. ఇక నీకు... ఇది నాదేవతార్చన పేటిక. ఇంక నా దేవుణ్ణి నువ్వే కొలువు. నేను ఎప్పటికయినా తిరిగి వచ్చేటట్లయితే మళ్ళీ నా దేవుళ్ళను నేను తీసుకుంటాను. లేకపోతే ఇక వీళ్ళందరూ నీవాళ్ళే. రోజూ ధూపదీప నైవేద్యాల కైంకర్యం నువ్వే కొనసాగించవల్సి వుంటుంది. తమ్ముడికిద్దామనుకున్నాను. కాని వాడికంత భక్తివిశ్వాసాలు లేవు. నా దేవుడి భారం, భక్తివిశ్వాసాలు లేని వ్యక్తికెందుకని ఇవ్వటంలేదు. ఆఁ మరోమాట. చూడు, పేటికలో చిన్న బాలకృష్ణుడి విగ్రహం ఉంది. ఇది మిగతా విగ్రహాలమాదిరి ఇత్తడి లేక రాగితో చేసిందికాదు. వన్నెబంగారంతో చేసింది. బాలకృష్ణుడిని ప్రత్యేకంగా నీకోసం తయారుచేయించాను. సీలల అమరికతో మూడు భాగాల అమరిక వుంది ఈ విగ్రహంలో. తల ఒక భాగం, చేతులు ఉరఃభాగం ఒకటి, ఉదరం, కాళ్ళు మూడోభాగం. సీల విప్పితే ఏ భాగానికా భాగం విడిపోతుంది. ఒక్కొక్కభాగం మూడు తులాల బంగారంతో చేయించాను. ఈ భౌతిక ప్రపంచంలో డబ్బు చాలా అవసరం. చాలా అవసరమైనవారికి, చాలా ఇబ్బందుల్లో వున్నవారికి, మరి గత్యంతరం లేనివారికి బాలకృష్ణుడిపరంగా నువ్వు మూడుసార్లు దానంచెయ్యి... గుప్తదానం చెయ్యి. నీకెంత అవసరం కలిగినా, కటిక దారిద్ర్యం కలిగినా నీ వ్యక్తిగత అవసరానికి వాడుకోవద్దు. అదే కనుక మొదలయితే రేపటికల్లా నీ బాలకృష్ణుడు మొత్తం షరాబుకొట్లో వుంటాడు. మొదటిసీల ఉదర, ఉరఃభాగాల్ని కలిపేచోట వుంది. కిందిభాగం తిప్పితే అది విడివడుతుంది. అయినా చూసేవాళ్ళెవరికీ పాకుతున్నట్లుండే బాలకృష్ణుడి పొట్ట, కాళ్ళు లేవని తెలియదు. అలాగే రెండోభాగం తీసేసినప్పుడు లోపం కన్పించ

దు. ఒక్క బాలకృష్ణుడి శిరస్సు మాత్రమే చేయించారనుకుంటారు. నీ చేతిమీదుగా ఆర్తులకు ఎవరికైనా సరే మూడుసార్లు సాయంచెయ్యగలవు. ఎంతోమందికి ఎంతో సాయం చెయ్యాలనే ఉంటుంది. కానీ అది మనవల్ల అయ్యే పనికాదు. చివరగా, నీ తండ్రి నీగురించి ఆలోచించి, మధనపడి, నీకోసమై పరానికింత మిగుల్చుకుంటావని ఇచ్చిన కానుక ఇది. బాలకృష్ణుడి శిరస్సు ఇచ్చేసింతర్వాత నీకింక ఈ ప్రపంచంతో పనిలేదు. గుర్తుంచుకో తల్లీ! జీవితంలో ఎప్పటికీ నీకోసం, నీవాళ్ళకోసం దీన్ని వినియోగించవద్దు. దేవతార్చనా పేటికలో వుంటుంది కాబట్టి అన్ని విగ్రహాల వంటిదే ఇదీ అనుకుంటారుగానీ, దీని సంగతెవరికీ తెలియదు. నువ్వు ఎవరికీ చివరకు నీ భర్తకు కూడా చెప్పాల్సిన పనిలేదు. రెండోచెవికి ఇది పోయిన్నాడు నీదగ్గరేం వుండదు. మన కలిమో, పేదరికమో మనతో వుంటుంది. ఇతరులకు పోయే కలిమిని మనమే అట్టిపెట్టుకుందామని ప్రయత్నం చేస్తే మనకు ఒనగూడేది మరింత దారిద్ర్యం తప్ప మరేంరాదు. ఇంత చెప్పటమెందుకంటే, నా గారాబు కూతురు ఎక్కడ పొరపాటు చేస్తుందోనేమోననే భయంతో. అప్పుడు నేను దగ్గర వుండకపోవచ్చు. ఆ తప్పునెవరు సరిదిద్దుతారు. అందుకనే ఇంత చెప్పాను తల్లీ, గుర్తుంచుకో' అని చెప్పాడు.

వంట ఇంట్లోనుండి బయటపడి పీరుసాయిబుతో మాట్లాడుతున్న సుందరమ్మకు, పిల్లలకు వీడ్కోలు పలికి, కూతురివంక చూసి నవ్వి బండెక్కి వెళ్ళిపోయాడు కృష్ణమాచార్యులు.

అలా వెళ్ళినవాడు మళ్ళీ వెనక్కి తిరిగి చూడలేదు. ఎక్కడకు వెళ్ళాడో, ఏయే ప్రదేశాలు చూశాడో, ఎక్కడెక్కడ తలదాచుకున్నాడో, తీసుకెళ్ళిన డబ్బు ఎంతవరకు సరిపోయిందో ఏమీ, ఎవరికీ తెలీదు. ఏళ్ళు గడిచాయి, మనిషి ఆచూకీ తెలియలేదు. వున్నాడో, పోయాడో కూడా తెలియదు. ఆ తర్వాత రంగనాయకమ్మకు అర్థమైపోయింది. తండ్రి తనకంతగా అంపకాలు పెట్టిపోవడం ఇంక తిరిగి రాకూడదన్న నిశ్చయం చేసుకోవటంవల్లనేనని. ఆయన తిరిగిరాడని తనూహించుకోలేకపోయింది. తండ్రిని తల్చుకున్నప్పుడల్లా రంగనాయకమ్మ మనసు క్షుభితమైపోయేది. ఆయన అంతర్వేదన సమసిపోయిందోలేదో, ఆయన ప్రశ్నలకు సమాధానాలు దొరికాయో లేదో ఆమెకు తెలియదు. చివరిరోజువరకూ ఆయన మనసులో రేగుతున్న జ్వాల ఆమెకవగతం కాలేదు. అలా మనస్సు క్షుభితమైనట్టు కూడా ఆయనెప్పుడూ ప్రవర్తించలేదు. ఆయనకు తన పిల్లలమీద వున్న మమకారం తక్కువైనదేమీ కాదు. ఆయన కర్తవ్యం ఆయన నిర్వహించారు. ఇంకా మరింత మోహబంధనాలు పెంచుకోకుండా ఆయన ప్రస్థానంచేశాడు.



**త**ండ్రి ప్రస్థానం చేసేకాలానికి రంగనాయకమ్మ ముగ్గురు పిల్లల తల్లి. శేషశయనాచార్యులు, ఆండాళమ్మ, విఠలాచార్యుల తరువాత ఆమెకిద్దరు పిల్లలు పుట్టి చనిపోయారు. అప్పటికామె తండ్రి ఇల్లు వదలిపోలేదు. ఆయన వెళ్ళిపోయిన మరుసటి సంవత్సరం వేంకటాచార్యులు పుట్టాడు. ఆ తరువాత నాలుగేళ్ళకు రంగనాధాచార్యులు పుట్టాడు.

ఈ ఐదేళ్ళలో రంగనాయకమ్మ సంసారం వీధినపడినట్లయింది. మామగారుండగా పొలం అమ్మటానికి వీల్లేకపోయింది నరశింహా

చార్యులకు. మామ పీడ తొలగిపోగానే మొత్తం ఆస్తిని తెగనమ్మేశాడు అతను మూడేళ్ళలో. ఈ మూడేళ్ళు రాజాలాగా బతికాడు నరశింహాచార్యులు. ఆ తరువాత ఎట్లా అన్న ఆలోచన అతనికెప్పుడూ లేదు. రంగనాథాచార్యులు పుట్టేటప్పటికి నరసింహాచార్యుల కుటుంబం గర్భదారిద్ర్యంలో వుంది. ఏపూటకాపూట గండమే. పొయిలో పిల్లి లేవటం కష్టమయ్యేది.

ఆండాళ్ళుకు ఇంట్లో పరిస్థితి తెలియంది కాదు. కుట్లూ, కత్తిరింపులు నేర్చుకుని ఇంటి చుట్టుపక్కల స్త్రీలకు జాకెట్లు కుట్టి యిచ్చేది. మిషనువుంటే ఆమె పని తేలికయ్యేది. తమకు మిషను కొనుక్కునే తాహతు లేదని ఆమెకు తెల్సు. అందువల్ల చేతికుట్టే మిషను కుట్టుకంటే బాగా చేయగలిగేది. శేషశయనాచార్యులు తను చదువుకోటమే కాకుండా చిన్నచిన్న పిల్లలకు చదువుచెప్పేవాడు. రంగనాయకమ్మ తన శక్తివంచన లేకుండా తన ప్రయత్నం తను చేసేది. విస్తళ్ళు కుట్టటం, అప్పడాలు చేయటం మొదలుపెట్టింది. ఆ మూలంగా వచ్చేది అల్పమే, అయినా గత్యంతరం లేకపోయింది. మొదట్లో ఈ పనులు చేయటం నామోషీగా అన్పించేది ఆమెకి. కాని ఆమె జీవితావసరాలు ఆమె సిగ్గును అధిగమింపచేశాయి.

ఓసారి...

ఆరోజు పొద్దునకే ఇంట్లో బియ్యం నిండుకున్నాయి. సొదా దినుసులూ ఏంలేవు. కిరాణా దుకాణానికి వెళ్ళి బియ్యం, సొదాలు తెమ్మని పెద్దకొడుక్కి చెప్పింది రంగనాయకమ్మ.

"నేను వాడి కొట్టుకు వెళ్ళను. మనం పాతబాకీ కట్టలేదంటాడు'' అన్నాడతను. చేసేది లేక చిన్నకొడుకు విఠలును బతిమాలి పంపింది, కాని ప్రయోజనం లేకపోయింది.

"మీ నాయనున్నాడా ఇంట్లో. ఈ అరువు బేరం నావల్లకాదు. పాతబాకీ చుప్తాచేసి సరుకులు పట్టుకెళ్ళమను. మీ నాయనకు సిగ్గులేదు. పాతబాకీ జమచెయ్యమంటే కొట్లాడటానికొస్తాడు. ఏమొహం పెట్టుకుని పంపించాట్ట నిన్ను'' అని తిప్పి పంపేశాడు పిల్లవాడిని. అతనికి అవమానం అన్పించింది. ఏడ్చుకుంటూ ఇంటికొచ్చాడు.

రంగనాయకమ్మ కేంచేయాలో తోచలేదు. "నాదగ్గర చారాణా వున్నయ్యమ్మా అరకిలో బియ్యం వస్తయ్యి. తెచ్చేదా'' అంది కూతురు ఆండాళ్ళు.

"సరే... పట్టుకురా'' అంది రంగనాయకమ్మ.

ఈ దినదిన గండపు బతుకెలా ఈడ్చాలో రంగనాయకమ్మకు అర్థంకాలేదు. ఆమె క్రితంరాత్రి భోజనం చేయలేదు. ఇంట్లో వున్న కాసిని బియ్యపుగింజలూ ఉడకేసి అందరికీ పెట్టింది. ఈ పూట వచ్చే ఆ అరకిలో బియ్యం ఇంతమందికి ఏం సరిపోతాయి. నరశింహాచార్యులకేం పట్టలేదు. భోజనం చేసి కళ్ళకు గంతలు కట్టుకు పడుకుంటాడు. ఆపైన భోజనంలో పదార్థాలు సరిగా వుండటంలేదని విసుక్కుంటాడు.

మధ్యాహ్నం పిల్లలకీ, భర్తకీ, అత్తగారికీ భోజనంపెట్టి, తానో గ్లాసు మంచినీళ్ళు తాగి పడుకున్న రంగనాయకమ్మ మనసు పరిపరివిధాల పోయింది. సంవత్సరం తీరుబడిగా ఆమె మనసును ఛిన్నాభిన్నం చేస్తున్నదా బాలకృష్ణ విగ్రహం. ఇలా తిండికి లేని రోజనల్లా ఆమె మనస్సు 'ఇంత బాధపడేబదులు అదమ్మేస్తేనేం' అని ఉద్బోధించేది. 'భౌతికజీవనం ఇంత నికృష్టంగా వున్నప్పుడు పరాన్ని గూర్చిన ఆలోచనెందుకు? ఇహ తనీ బాధ పడలేదు. తను తండ్రిమాట తప్పి రౌరవాదిన రకాల్లో పడనీకానీ. కనీసం ఓ ఆర్నెల్లు, సంవత్సరమైనా ఇలా పస్తులుండే తిప్పలు తప్పుతుంది'' అన్న ఆలోచన వచ్చింది ఆరోజు. 'సాయంత్రం దాన్ని ఆయనకిచ్చి అమ్మిస్తాను. లేకపోతే రాత్రికి అందరూ పస్తులుండాల్సిందే' అనీ అనుకుంది ఆమె.

సాయంత్రం నాలుగు గంటలకు చేతిలో

సంచీ పట్టుకుని వచ్చాడు పెరియనంబి. సంచీలోంచి రెండు పెద్ద పొట్లాలు, పులిహోరా, దద్దోజనం తీసి రంగనాయకమ్మకి స్తూ, "నిన్ను చూసి చాలారోజులయిందమ్మా! ఇవాళెటూ ఇక్కడ పనుండి వచ్చాను. నిన్ను చూసిపోదామనిపించింది. వస్తున్నాకదాని దేవుని ప్రసాదం పట్టుకొచ్చాను'' అన్నాడు.

"అవును చిన్నాయనా! ఎన్నాళ్ళయిందో నిన్ను చూసి!" అంది రంగనాయకమ్మ.

తన తండ్రికి ఆప్తుడు, శిష్యుడూ అయిన పెరియనంబిని చూసి సంతోషమే కలిగింది. కానీ అతను తెచ్చిన పులిహోరా, దద్దోజనం పొట్లాలు మరింత ఆనందం కలిగించాయి. ఈపూటకు వెళ్ళమారిపోతుంది అనుకున్న ఆమె మనసు ఖిన్నమైంది.

ఆరోజు రాత్రి అందరూ ఆ పులిహోరా, దద్దోజనం తిన్నారు. "వీడిబొంద! పులిహోరలో ఇంకా నాలుగు పచ్చిమిరపకాయలు వేస్తే ఎంత బావుండేది'' అంటూ తిన్నాడు నరశింహాచార్యులు. రంగనాయకమ్మ ఆపూట ఎంగిలిపడగలిగింది.

ఆపూట గడిచే అవకాశం దొరకటంతో రంగనాయకమ్మ కృష్ణవిగ్రహం అమ్మే ప్రసక్తి భర్తదగ్గర తేలేదు. మరి రేపటి సంగతి ఏమిటి? అన్న ఆలోచన ఆమె మనసును తొలుస్తూనే వుంది. రేపు పొద్దున అమ్మించేస్తాను అనీ అనుకుంది రాత్రి పడుకోబోయేటప్పుడు.

అయ్యో! ఇదేమిటి నేనెటుపోతున్నాను. ఇది మా వూరి ఏటిగట్టుకదూ! నేనిక్కడకెందుకొచ్చాను. దూరంగా వేణుగోపాలస్వామి ఆలయ ధ్వజస్తంభంపై వేలాడుతున్న ఆకాశదీపం కదూ అది అనుకుంది ఆమె, ఏటిలో నీళ్ళు ఉరవడిగా ప్రవహిస్తున్నాయి. వర్షాకాలంలో ఉవ్వెత్తున లేచి ప్రవహించే ఏరు వేణుగోపాలస్వామి ఆలయంమెట్లదాకా ప్రవహిస్తూ స్వామిని అభిషేకించాలన్న ఉత్సుకత కనబరచేటట్లుంది. ఆలయ ప్రహరీగోడ దాటి వస్తూన్న పెరియనంబి కన్పించాడామెకు. ఏవిటటాయన తన్ను చూడలేదా! చూసి కూడా పలకరించకుండా వెళ్ళిపోతున్నాడే' అనుకుంది ఆమె.

చిన్నాయనా! అని పెద్దగా పిల్చింది.

వచ్చావా నువ్వు. నా పనయిపోయింది. నువ్వు వెళ్ళు. అన్నాడాయన.

ఆమెకర్థంకాలేదాయన మాటలు. ఆమె కోవెలలోకి వెళ్ళింది. గర్భగృహంలో నీల శరీరుడూ, పీతాంబరధారీ, శిఖిపింఛమౌళీ, వ్యత్యస్త పాదుడూ అయిన వేణుగోపాలుడు వేణుఊదుతూ తనవంక వాత్సల్యంతో చూస్తున్నాడు.

'జగదీశ యోగీశ సర్వభూతాధార సకల
సంపూర్ణ యీశ్వర మహాత్మ
కాష్ఠగత జ్యోతికైవడి నిఖిలభూతములందు
నొకడవై తనరుదీవు'

అంటూ నమస్కరించిందామె. మరుక్షణంలో అక్కడ వేణుగోపాలుడు లేడు. ఆ స్థానంలో ఆమెకి తండ్రి కన్పించాడు. ఆయన తనవంక చూసి నవ్వినట్టనిపించింది ఆమెకు. 'పిచ్చితల్లీ! ఎందుకమ్మా, నీకీ మనోఖేదం. నేను లేనూ నీవెంట. రా, నా దారికిరా!' అన్నాడాయన.

తను ఆయనవైపు అడుగులు వేసింది. తప్పటడుగులు పడ్తున్నాయి. తను చిన్నప్పుడు నడవటం బాగా రాక తప్పటడుగులు వేస్తూ ఆయనదగ్గరకు వెళ్ళినప్పుడు వాత్సల్యంతో, ప్రేమతో చూసే చూపు. అదే చూపు ఆయన మొహంలో ద్యోతకమైంది.

"పాలమ్మా, పాలు'' అని పెద్దగా వినపడటంతో రంగనాయకమ్మకు మెలకువ వచ్చింది. తనున్నది పంటకుర్తి వేణుగోపాల స్వామి ఆలయంలోకాదు, ఉగ్రనరశింహస్వామి నిప్పచ్చరమైన కొంపలో అన్న యదార్థత ఆమె కలగన్న ఆనందాన్ని లుప్తంచేసింది. తెల్లవారిపోయింది ఆ ఆనందం.

పిల్లలందర్నీ లేపి వాళ్ళకి టీ కలిపి ఇచ్చింది రంగనాయకమ్మ. నరశింహాచార్యులెప్పుడూ ఎనిమిది గంటలకు ముందు లేవడు. లేపితే అరుస్తాడు. అందువల్ల అతన్ని

లేపడానికి సాహసించరెవరూ.

నరశింహాచారి లేచి చాయ్ తాగుతున్న సమయంలో పీర్‌సాయిబు వచ్చాడు.

'ఏం ఇవాళ బాడుగలేం లేవా, తీరిగ్గా వచ్చావిటూ'' అన్నాడు నరశింహాచార్యులు.

"బాడుగలకేం మస్తుంటాయి. ఈమధ్య కన్పించటంలేదు నువ్వు. చూసి వెళ్దామని వస్తి'' అన్నాడతను.

ఇంతలో ఇంటి యజమాని పిల్చాడు "నర శింహాచార్యులూ!" అని.

"ఏమిటి?" అంటూ బయటకెళ్ళాడు నర శింహాచార్యులు.

పీరుసాయిబు పిల్లల్తో మాట్లాడుతున్నాడు కాని అతని దృష్టి ఇంటిబయట జరుగుతున్న సంభాషణమీదే వుంది.

"చూడవయ్యా, నువ్వు సంవత్సరంనుండి కిరాయి చెల్లించలేదు. నువ్వు పెద్దమనిషివి, కష్టాల్లో వున్నావని నాకు తెల్సు. నాకూ డబ్బు వత్తిడిగా వుంది. కనీసం ఓ ఆర్నెల్ల కిరాయయి నా జమచేయించు'' అన్నాడు ఇంటి యజ మాని. ఆయనకీ తెల్సు నరశింహాచార్యులది బతికి చెడిన కుటుంబమని. అందుకనే కిరాయి అడగాలంటే పస్తాయిస్తాడాయన.

"ఇస్తాలేండి. ఇప్పుడు పైకం చేతిలో లేదు. వారం తర్వాత చూస్తాను. అయినా పొలాల మీద వచ్చే అయివేజంతా ఏంచేస్తున్నారు. కిరాయిమాత్రం నిక్కచ్చిగా అడుగుతారు'' అన్నాడు నరశింహాచార్యులు.

"నా పొలాల అయివేజు సంగతి నీకనవ సరం. నువ్వు కిరాయికుంటున్నావు. కిరాయి కట్టు'' అన్నాడాయన మనసు కష్టపెట్టు కుంటూ.

"ఫో నీయవ్వ! నాదగ్గర డబ్బు లేదు. వచ్చినప్పుడిస్తాను. ఏం చేసుకుంటావో చేసు కో ఫో' అని ఇంట్లోకొచ్చేశాడు నరశింహాచా ర్యులు.

తిట్టుకుంటూ వెళ్ళిపోయాడు ఇంటి యజ మాని.

"ఏందయ్యా! ఇంట్లోవుంటూ, కిరాయి కట్ట నని జులుం చేస్తే ఎట్లా? ఈ పది రూపాయలూ జమెయ్యి, తరువాత చూసుకుందాం" అంటూ రొంటిమడతల్లోనుండి లెక్కపెట్టి పది ఒకరూ పాయి నోట్లు ఇచ్చాడు పీరుసాయిబు. పాతబ డ్డ నోట్లు అవి. అతని పది, పదిహేను రోజుల సంపాదన అది. అతనిలా కొద్దిమాత్రపు డబ్బు ఇచ్చినా, పేరుకు అప్పేగాని, అది అతను తీర్చమని అడగడు. నరశింహాచార్యులెప్పు డూ తీర్చి ఎరగడు. కొడుక్కి తండ్రి ఇచ్చే డబ్బు బాకీకాదు.

"చూడూ, నువ్వేమయినా నౌకరీ చూసుకో, లేకపోతే ఇంట్లో మనుషులు పస్తులుండి చచ్చి పోవాల్సివస్తుంది'' అన్నాడు పీరుసాయిబు లేస్తూ.

"సర్లే, అందరూ నాకు చెప్పేవాళ్ళే'' అన్నా డు నరశింహాచార్యులు.

పీరుసాయిబు మరేం మాట్లాడకుండా వెళ్ళి పోయాడు.

నరశింహాచార్యులు ఆ పదిరూపాయలు జేబులో వేసుకుని వెళ్ళిపోయాడు. ఓ అర గంటలో కడుపునిండుగా హొటల్లో ఇడ్లీలు, దోసెలూ తిని, రెండు పెద్ద పొట్లాల్లో ఇడ్లీలు, దోసెలూ పార్సిలు కట్టించుకు వచ్చాడు. 'ఒరేయ్ శేషూ, విఠలూ, ఆండాళ్ళూ అందరూ రండిరా. హొటల్లో టిఫిను తెచ్చాను. తిందు రుగాని!"

పిల్లలందరూ చుట్టూ చేరగానే అందరికీ తలా ఒక పొట్లం ఇచ్చి, "ఎట్లా వున్నాయిరా ఇడ్లీలు, చట్నీ బాగా లేదూ! దోసె అద్భుతం. రెండు దోసెలు తింటేగాని నాకు తిన్నట్లని పించలేదు. మీ అమ్మ పెట్టే చప్పిడి కూడు తిని నోరు చచ్చిపోయినట్లయింది'' అంటూ వ్యాఖ్యానించాడు నరశింహాచార్యులు.

"ఆ టిఫిను తేవటానికి డబ్బెక్కడిది!" అనడిగింది రంగనాయకమ్మ.

"ఇందాక పీరుసాయిబు ఇచ్చాడులే పది

రూపాయలు'' అన్నాడు నరశింహాచార్యులు.

"మరా డబ్బు పెట్టి ఇంట్లో సొదాలు తెచ్చుకుంటే నాలుగురోజులు గడిచిపోయేవిగా, ఏం పనులండీ మీరు చేసేవన్నీ'' అంది రంగనాయకమ్మ.

"మీ అమ్మకి మనం హాయిగా తింటే ఈర్ష్యరా! అసలీ పంటకుర్తివాళ్ళందరికీ ఓర్చలేనిరోగం. వట్టి పల్లెటూరుజాతి! నూనె కారే జిడ్డుమొహాలు! వాళ్ళకేంతెలుసు దర్జా, దర్పం అంటే! అడుక్కుతినే మొహాలు! మనం కాస్తంత హాయిగా వుంటే సహించలేరు'' అన్నాడు నరశింహాచార్యులు.

అదంతా చూస్తున్న సుందరమ్మ ఇక సహించలేకపోయింది. "ఛీ! నీ బతుకు పాడుగాను. నీకు పీరుసాయిబు డబ్బెందుకిచ్చాడు, నువ్వేం చేశావు ఆ డబ్బుతో! పందిలా తినొచ్చావు సిగ్గులేదూ! నీ జీవానబడి ఆ పిల్ల చావాలా! దానికేం పెడ్తున్నావురా నువ్వు! కనీసం తిండికి మొహం వాస్తున్నదే! పుట్టింట్లో అదెట్లా బతికింది? నువ్వెట్టాంటి బతుకిచ్చావు దానికి? ఇంత నిర్వ్యాపారత్వం, ఇంత ఘోరం, క్రౌర్యం నేను చూడలేను. ఆ బావిలోపడి చస్తాను. ఆ తర్వాత నువ్వు దాని గొంతుపిసికి, నువ్వే చావు చస్తావో చావు. ఇహ నావల్ల కాదు'' అంటూ ఆమె లేచి రయ్యిరయ్యిన బావివైపు పరుగుతీసింది.

రంగనాయకమ్మ, పిల్లలూ పరుగెత్తి ఆమెనాపుచేశారు. రంగనాయకమ్మ బతిమాలి బామాలి అత్తగార్ని ఇంట్లోకి తీసుకొచ్చింది. ఇదంతా నిర్ఘాంతపోయి చూస్తూ కూర్చున్నాడు నరశింహాచార్యులు. సాధారణంగా అయితే ఇలాంటి మాటలంటే తల్లిమీద చాంతాడు తిరగేసేవాడే. లేచి పక్కగదిలోకెళ్ళి తలకు తుండు చుట్టుకుని పడుకున్నాడు. ఓ అరగంట తర్వాత కొడుకు శేషశయనాచార్యులను పిల్చి, "మీ అమ్మనడిగి, ఈ నాలుగు రూపాయలతో బియ్యం, సొదాలు తీసుకురా'' అన్నాడు.

సాయంత్రందాకా అలాగే పడుకునుండిపోయాడతను. మధ్యాహ్నం భోజనాలకి పిల్చినా వెళ్ళలేదు. రంగనాయకమ్మ బతిమిలాడుతుంటే, "ఏం ఫర్లేదులే హొటల్లో బాగానే మింగొచ్చాడు. ఓపూట తిండి తినకపోతే ఇబ్బందేంలేదు'' అంది సుందరమ్మ.

ఆరోజు సాయంత్రానికి లేచి, గుడ్డలేసుకుని, "నిజాంబాదు వెళ్తున్నాను. రెండురోజుల్లో వస్తాను'' అని భార్యకి చెప్పి వెళ్ళిపోయాడు నరశింహాచార్యులు.

నిజాంబాదులో తన మిత్రుడి పలుకుబడితో ఓ చిన్న ఉద్యోగం సంపాదించాడు నరశింహాచార్యులు. అది ఓ కెమికల్ ఇండస్ట్రీలో సేల్స్ ఎక్జిక్యూటివ్ ఉద్యోగం. పేరు పెద్దదే కాని, జీతం చిన్నది. ఎప్పుడూ ఊళ్ళు తిరగాల్సి వుంటుంది. కాంపులకి వెళ్ళినందుకుగాను బత్తా ఇస్తారు. అలా ఉద్యోగంలో చేరింతర్వాత నరశింహాచార్యులకు తన తిండి విషయమ్మై ఇబ్బందిలేకుండా గడచిపోయింది. తన ఖర్చులుపోను, డబ్బు మిగిలినప్పుడు పదీ, పరకా ఇంటికి పంపిస్తుండేవాడు నరశింహాచార్యులు. పిల్లలూ, తనూ కష్టపడి సంపాయించినదానికి తోడు అప్పుడప్పుడూ భర్త పంపించే డబ్బుతో ఎలాగో కష్టంమీద సంసారం నెట్టుకురాసాగింది రంగనాయకమ్మ.

పీరుసాయిబు సాలూరునుండి రెండుమూడురోజులకొకసారయినా ఊళ్ళో పండిన కూరలు తీసుకొచ్చి ఇచ్చేవాడు.

"నీ రుణాన పోతున్నాం తాతా! ఇవన్నీ ఎందుకు?" అనేది రంగనాయకమ్మ.

"అట్టా అనక కోడలా! నేనేం కొనుక్కొచ్చి ఇస్తున్నానా? ఆ అల్లా ఎవరికెవరికి రుణం పెట్టాడో ఎవరికి తెల్సు. నేనే నీ రుణం తీరుస్తున్నానేమోనమ్మా! అయినా ముసల్ది పోయింతర్వాత నాకు బతకాలనే ఇచ్ఛ లేదు తల్లీ! పిల్లల్ని చూసి బతుకుదామంటే మాకు పిల్లలే కలగలేదు. ఆ ఒక్క హజ్‌యాత్ర చేయగలిగితే నా జన్మ తరించినట్లే తల్లీ'' అనేవాడు పీరుసాయిబు.

ఓసారి పిల్లల స్కూలు ఫీజు విషయంలో

చిన్న గలాటా అయింది. ఆ నెల మొదటివా
రంలో నరశింహాచార్యులు ముగ్గురు పిల్లల్నీ
ఫీజు కట్టని మిగతాపిల్లలతోపాటు క్లాసులో
నుండి బయటకు పంపేశారు. పిల్లలు ముగ్గు
రూ ఏడుపు ముఖాలేసుకుని, అవమానభా
రంతో ఇంటికొస్తుంటే దోవలో తండ్రి కన్పించా
డు వాళ్ళకు. అతనప్పుడు రెండురోజులకోస
మని ఇంటికొచ్చివున్నాడు.





ఫీజు కట్టలేదని క్లాసులోంచి పంపారనేటప్పటికి అతనికి మండిపోయింది. స్కూలుకి వెళ్ళి, "ఏందయ్యా హెడ్‌మాస్టరూ! మంచీ మర్యాదా లేదా, ఫీజొకనెల ఆలస్యమైతే పిల్లల్ని క్లాసులనుండి పంపెయ్యటమేనా?" అనడిగాడు.

"ఒక నెల కాదండీ, మూడునెల్లనుండి కట్టలేదు మీరు'' అన్నాడు హెడ్‌మాస్టారు.

"కడ్తామయ్యా కడ్తాం. ఒకరోజు అటో ఇటో. అంత ఖచ్చితంగా మాట్లాడితే కుదర్దు. నువ్వెట్టా చదువుకొచ్చావో, ఇవ్వాళెట్టా హెడ్‌మాస్టరయ్యావో నాకూ తెల్సు''

"అనవసరపు విషయాలు మాట్లాడే తీరిక నాకు లేదు. ఇక వెళ్ళండి. ఫీజుకట్టి మీ పిల్లల్ని క్లాసులకు పంపండి''

"అంటే ఫీజు కట్టకపోతే పిల్లల్ని క్లాసులకు పోనివ్వవా?"

"వీల్లేదు''

"ఎవడివిరా నువ్వు బాడఖోగాడా! తక్కువ నా కొడుక్కు తక్కువ బుద్ధులే వుంటాయి''

"గెటవుట్ ఫస్ట్ ఫ్రం మైరూం" అన్నాడు హెడ్‌మాష్టరు కోపంగా పైకిలేస్తూ.



"ఏం కూశావురా నా కొడకా... నిన్నూ..." అంటూ హెడ్‌మాష్టరు గొంతు పట్టుకున్నాడు ఉగ్రనరశింహాచార్యులు.

ఇంతలో ఈ గోలవిని లోపలికొచ్చిన ఉపాధ్యాయులు నరశింహాచార్యులను పట్టి బయటకు తీసుకొచ్చారు. అతను రోషంతో, ఆవేశంలో ఇంకా అరుస్తూనేవున్నాడు.

ఆ ఉపాధ్యాయుల్లో సుదర్శనం ఒకడు. ఆయనకి నరశింహాచార్యుల గురించి తెలియందేంలేదు. అతను కృష్ణమాచార్యుల వద్ద తెలుగు, సంస్కృతం చదువుకున్నాడు. తరువాత తెలుగులో యూనివర్సిటీ పరీక్షలిచ్చి హైస్కూల్లో తెలుగుపండితుడి ఉద్యోగం సంపాదించుకున్నాడు. తననుండి పైసా ఆశించకుండా భోజనం పెట్టి చదువు చెప్పిన గురువంటే అతనికి అపారమైన భక్తి గౌరవాలున్నాయి. అతను ఎంతో కష్టంమీద నరశింహాచార్యులుకు నచ్చచెప్పి, "నేనంతా కనుక్కొని సరిచేస్తాను. ఎక్కడో ఏదో పొరబాటుంది, లేకపోతే మీలాంటివారు పిల్లలకు ఫీజు కట్టకపోవటమేమిటి?" అని నమ్మపలికి నరశింహాచార్యులనింటికి పంపేశాడు.

నరశింహాచార్యులనింటికి పంపేసి ముగ్గురు పిల్లల మూడునెల్ల ఫీజులు కట్టి ఆరోజు సాయంత్రం ఇంటికొచ్చి, ఫీజు రసీదులు ఇస్తూ నరసింహాచార్యుల ఆగడమంతా వివరిస్తూ, "చూడండి అక్కయ్యగారూ! బావగారు ఇంత ఆవేశపడ్తే ఎట్లా? మీరయినా కాస్తంత సర్దిచెప్పండి'' అన్నాడు రంగనాయకమ్మతో. అప్పుడు నరశింహాచార్యులు ఇంట్లో లేడు. కాబట్టి సరిపోయింది. కాని లేకపోతే సుదర్శనం గల్లా కూడా పట్టేవాడే?

"నీకు తెలీంది ఏముంది సుదర్శనం. ఆయన తీరే అంత. ఆయన ఒకరిమాట వింటాడా, వింటే మాకీపరిస్థితి వచ్చేదా?" అంది రంగనాయనమ్మ కళ్లనీళ్లు పెట్టుకుంటూ.

"సరేనండీ అక్కయ్యగారూ! మీరేమనుకోకపోతే ఒకమాట. పిల్లల ఫీజు ఈ స్కూల్లో చదువుతున్నంతవరకు నేను కడ్తాను. మీరేం బాధపడకండి. నాన్నగారు నాకు చేసిందాంట్లో కొంత రుణమైనా ఈవిధంగా తీర్చుకోనివ్వండి..." అన్నాడతను.

"సరే నాయనా! ఈ పరిస్థితుల్లో నేను మాత్రం బింకంపోయి చేసేదేముంది అట్టాగే కట్టు. మాకు వీలయినప్పుడు తీర్చుకుంటాం" అంది ఆమె.

నరశింహాచార్యులు హెడ్‌మాష్టరు పిల్లల్ని క్లాసులోనుండి పంపేశారని అప్పుడంత ఆవేశపడ్డాడుగాని, ఆ తరువాత పిల్లల ఫీజు సంగతిగాని, వాళ్ళెట్టా చదువుతున్నారనిగాని పట్టిచ్చుకున్న పాపాన పోలేదు. ఫీజు కట్టకుండాపిల్లలు స్కూల్లో ఎట్లా చదువుతున్నారోనన్న ఆలోచన కూడా అతనికి రాలేదు. రంగనాయకమ్మ కూడా సుదర్శనం పిల్లల ఫీజు కడ్తున్నాడని చెప్పలేదు. చెప్తే వ్యర్థమైన పౌరుషానికి పోయి, ఆ వచ్చేసాయం కూడా రాకుండా చేస్తాడేమోనని ఆమె భయపడింది.

ఓసారి పెద్ద కొడుకు శేషశయనాచార్యులు పదోతరగతి చదివేటప్పుడు నరశింహాచార్లు బోధన్ కాంపులో వున్నాడు.

"ఒసేయ్ రంగా! ఎక్కడ చచ్చావే? మీ నాయనా ఏమిచ్చినా, ఏమివ్వకపోయినా పూజా పునస్కారాలంటూ సమయం తగలవేసే వారసత్వం మాత్రం ఇచ్చిపోయాడు'' అంటూ గావుకేకలు పెట్టసాగాడు.

రంగనాయకమ్మకు భర్త తండ్రిని తిట్టినప్పుడల్లా హృదయం తూట్లుపడినట్లు బాధ కలుగుతుంది. పూజ ముగించుకుని లేస్తూ అంది, "ఉన్నన్నాళ్ళూ సాధించింది చాలకనా మనిషి లేకపోయినా ఇంకా ఆయన ఊసెందుకూ?" అని.

"ఇంకా చావలేదుగా. చేయరానిపనులేం చేశాడో పరారయ్యాడు. ఎక్కడో పురాణాలు వల్లిస్తూ, జనాన్ని మోసంచేస్తూ, నిక్షేపంగా గుండులాగా వుండేవుంటాడు'' అన్నాడు నర

శింహాచార్యులు సరసంగా భార్యతో మాట్లాడుతూ.

"శ్రీహరీ!" అంటూ చెవులు మూసుకుంది రంగనాయకమ్మ.

"సరే వంట తగలెట్టావా? నాకు ఆకలి మాడిపోతున్నది''

రంగనాయకమ్మకు ఆశ్చర్యమనిపించింది, ఎందుకు మొగుడు ఇంత సౌమ్యంగా మాట్లాడుతున్నాడా అని.

"అయిపోవచ్చింది, ఒక్కపావుగంట" అంది ఆమె.

"మనకు మంచిరోజులు రాబోతున్నాయి..." అన్నాడు నరశింహాచార్యులు పీట వాల్చి కూర్చుంటూ వంటింట్లో.

"ఏమిటా మంచిరోజులు...?"

"గంజిలో నీలకంఠం కోమటి కొట్టులేదూ. దాంట్లో మన పెద్దోణ్ణి గుమాస్తాగా వేసుకుంటానన్నాడు. నెలకు ముప్పైరూపాయలిస్తాట్ట. నిజంగా వాడెట్టాగయినా పెద్దమనిషే. మా ఊరివాడు. ఇక్కడకొచ్చి స్థిరపడ్డాడు, 'అయ్యో ఆచార్లగారూ! మీరంతటివారు ఎలా అయిపోయారు' అన్నాడు. నేను పరిస్థితి ఇలా వుందిరా, మరి నువ్వేమయినా సాయం చెయ్యగలవా అన్నాను. 'మీ కిష్టమైతే మీ అబ్బాయిని నా కొట్లో గుమాస్తాగా పెట్టుకుంటాను' అనన్నాడు. ఇంక మనం హాయిగా వుండొచ్చు. నాకూ ఈ ఊళ్లు పట్టుకు తిరిగే బాధ తప్పుతుంది. ఇంటిపట్టునే వుండి పిల్లల యోగక్షేమాలు విచారించవచ్చు'' అనన్నాడు నరశింహాచార్యులు.

"చిన్నవెధవ వాడేం నౌకరీ చేస్తాడు. ఇంకా చదువుకుంటున్నాడుగా'' అంది రంగనాయకమ్మ నిర్విణ్ణఅవుతూ.

"వాడి మొహం చదువు! ఎందుకూ ఈ చదువులు! ఒట్టి దండుగ! నేను చదువుకోలా! ఎందుకూ! డబ్బు సంపాదించే తెలివితేటలుండాలిగాని, చదువెందుకే, చంకనాకనా? వాణ్ణి చదువు మాన్పించేస్తాను..."

"నువ్వు నిర్వ్యాపారంగా ఇంట్లో కూర్చోటానికని వాణ్ణి చదువు మాన్పించి కోమటి కొట్లో గుమాస్తాగా పెడ్తావుట్రా? ఈ జన్మలో వాడి జీవితం బాగుపడేనా? ఏం ఆలోచనలురా నాయనా!" అంది సుందరమ్మ కొడుకు మాటలు వింటూ.

"నీ బొంద, నీకేం తెలిసిచచ్చు. ముసలి ముండవి, నోర్మూసుకుపడుండు''

"ఇప్పటివరకూ అన్నిటికీ చచ్చినట్టు పడి వుండబట్టే సంసారాన్నీ తీరుకు తెచ్చావు. నీ సుఖంకోసం ఇంక పిల్లల భవిష్యత్తును కూడా నాశనం చేస్తానంటే నేనూర్కోను, ఉరేసుకు చస్తాను''

"చస్తాను, చస్తాను అన్న ముండలే కాని, చచ్చిన ముండలేదట. అయినా ఆడముండలు, మీతో సంప్రదించటం నాదే బుద్ధి తక్కువ. మీకేం తెల్సే లోకవ్యవహార..."

"ఆ నీకు తెల్సు నాయనా! తెలిసే ఇంత ఆస్తీ తిరుమంగళం పాడించావు''

"ఛట్ నువ్వు నోరుమూసుకుంటావా లేదా! పాడుముండా! దండగ తిండి తినటమే కాకుండా ఇంకా బోడి సలహాలిచ్చావంటే నీ ప్రాణం తీస్తాను'' అని వెళ్ళి, తల్లిని వంగదీసి నాలుగు చరుపులు చరిచి విసవిసా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు, నరశింహాచార్యులు.

"ఓరి నీ చేతులు పడిపోను. తల్లిని కొట్టే ముదనష్టపు వెధవని నేనెలాకన్నాను తండ్రీ! కిందటి జన్మలో చేసుకున్న పాపం ఇలా కొడుకు రూపంలో సాక్షాత్కరించింది నాయనా!" అని రోదించసాగింది సుందరమ్మ.

అలా కొడుకు చేతిలో దెబ్బలు తిన్న ఆమెకు సాయంత్రానికల్లా జ్వరమొచ్చింది. "డాక్టరు దగ్గరకు తీసుకెళ్దామండీ, ఆమె మూసిన కన్ను తెరవకుండా పడివుంది జ్వరంతో' అంది నరశింహాచార్యులుతో.

ఇంకా తల్లిమీద కోపం దిగని నరశింహాచార్యులు "చావనీ ముండని, దాని సంగతి నా దగ్గరెత్తవద్దు'' అని భార్యని కసురుకున్నాడు.

ఆమె సంగతి ఎవరూ పట్టించుకోవాల్సిన అవసరం లేకుండానే రెండు రోజుల్లో ఆమె కన్ను మూసేసింది. ఆమె మనసు చివికిపోయింది. కొడుకు సంసారం ఎలా బాగుపడ్తుందా అని దిగులుపడ్తూ గుండె ఆగి మరణించింది.

శేషశయనాచార్యులు హెచ్.ఎస్.సి. పరీక్ష పాసయ్యాక, చదువు మాన్పించేయాలనుకుంది రంగనాయకమ్మ. పైచదువు బోధన్‌లో లేదు. నిజామాబాదుకు పంపాలి. కాలేజీ ఫీజులు కట్టేశక్తి తనకు లేదు. అయితే సుదర్శనం ఊర్కోలేదు, "పైకెక్కి వచ్చే పిల్లగాణ్ణి చదువు మాన్పించటమెందుకక్కయ్యా! కాలేజీ ఫీజు సంగతి నేను చూసుకుంటాను. రోజూ సీజను టిక్కెట్టు మీద రైల్లో వెళ్ళి చదువుకువస్తాడు'' అని ఆమెకు నచ్చచెప్పాడు. రంగనాయకమ్మ ఏం నిర్ణయం తీసుకోలేకపోయింది. భర్తనడిగితే చదువాపేసి కోమటికొట్లో గుమాస్తాగా జేరమంటాడు. అది ఆమెకు ఇష్టంలేదు. పైగా అతన్ని సంప్రదించటానికి కూడా ఇబ్బంది ఉంది ఆమెకు. అతనెప్పుడూ ఊళ్లమీద వుంటాడు, వీలయినప్పుడు డబ్బు పంపటమేకాని పెళ్ళాంబిడ్డల యోగక్షేమం పట్టించుకోవటం అతను మానేశాడు. ఓసారి పీరుసాయిబ్బు వచ్చినప్పుడు పరిస్థితి చెప్పి ఏం చేయమంటావని అడిగింది. "దీంట్లో ఆలోచించటానికేముందమ్మా! పంపించు. పిల్లగాడయినా పైకి వస్తే అంతకంటే కావల్సిందేముందీ'' అన్నాడతను.

నరశింహాచార్యులకు ఉద్యోగం చెయ్యటం ప్రాణాంతకంగా వుంది. ఎప్పుడు బోధన్‌కి వచ్చినా, మళ్ళీ నౌకరికి వెళ్ళాలంటే పిల్లవాడు స్కూలుకెళ్ళటానికి మొండికేసినట్టు మొండికేసేవాడు. అయితే రంగనాయకమ్మ ఊరుకునేది కాదు. భర్త మళ్ళీ ఉద్యోగానికి వెళ్ళిందాకా పోరేది. ఒకోసారి కోపం వచ్చి కొట్టేవాడామెను. అయితే అతనికీ పరిస్థితి అర్ధం కాకపోలేదు. తను ఉద్యోగం చేసి సంపాదించకపోతే, నోట్లోకి నాలుగువేళ్ళూ వెళ్ళవని తెలియని పరిస్థితి కాదు. అందుకే తను ఉద్యోగం మానేయగలిగే అవకాశాలకోసం ప్రయత్నించేవాడతను.

ఓసారి అతను మహాసంతోషంగా బోధన్‌కి వచ్చాడు. రంగనాయకమ్మకు ఒక చీరె, పిల్లలకు బట్టలు కొనుక్కొచ్చాడు. భర్త ఇంత ఖర్చుపెట్టటానికి కావల్సిన డబ్బు ఎలా సంపాదించాడా అని ఆమె ఆందోళనపడింది. నౌకరీ చేసేచోట పైవాళ్ళకు తెలియకుండా తస్కరించాడా అన్న ఆలోచన ఆమెకు వచ్చింది కాని, అంత ధైర్యం తన మొగుడికి లేదని సమాధానపడింది. పైకెంత దురుసుగా వ్యవహరిస్తాడో లోపలంత పిరికిమనిషని ఆమెకు తెలియంది కాదు. అందువల్ల పోలీసులు, జైలులాంటి బాధాకరమైన ఊహలు కల్గించేపని ఆయన చేయడని రంగనాయకమ్మ నమ్మకం.

"ఇప్పుడింత ఖర్చుచేసి ఈ బట్టలు తీసుకురాపోతేనేం? అయినా ఇంత డబ్బు ఎక్కడిది?" అనడిగిందామె భర్తని.

"ఆ వెధవ వద్దన్నకొద్దీ మూడొందలు చేతులోపెట్టాడు. వాడికీ మన అవసరం వుందికదా తప్పేంవుందని తీసుకున్నాను'' అన్నాడు నరసింహాచార్యులు విషయరంగప్రవేశానికి నాందిగా. తన ప్రతిపాదన భార్య ఎలా తీసుకుంటుందోనన్న అనుమానం అతనికి లేకపోలేదు.

"ఎవరతను? ఏమిటతనికి మీతో అవసరం?"

"అదేనే బాన్సువాడలో వుండే మా పినతల్లి కొడుకు లేడూ- వరదాచార్యులు. వాడిచ్చాడు. మొన్న నిజాంబాదులో కన్పించి ఎంత ఇదైపోయాడనీ, 'ఓరే అమ్మ పోవటంతో మన బంధుత్వాలు పోయాయటరా. నువ్వెప్పుడూ మా ఊరే రావు. మమ్మల్ని మర్చిపోయావు' అని ఒకటే గోల.

"అది బాగానే వుంది. డబ్బెందుకిచ్చాడు?"

"ఎందుకిచ్చాడేమిటి నీ బొంద! రేపు వాడి

ఆస్తి అంతా మంది కాదూ. ఇవాళ మూడొంద లు ఖర్చుపెట్టుకుంటే పోయేదేముంది?"

"ఆయన ఆస్తి మనదెలా అవుతుంది?"

"కాకేం చేస్తుంది. వాడికి పిల్లలు లేరు. ఎంతమంది దేవుళ్ళను మొక్కినా ప్రయోజనం కలుగలేదు. 'ఓరే, మీ విఠలాచార్యులను నాకు దత్తత ఇవ్వరా. నీ కొడుకు కాబట్టి కలసిపోతాడు. నా ఆస్తి కూడా పరాయివాళ్ళు తింటే నాకేం బావుంటుంది' అనన్నాడు. నాకూ వాడన్నమాట బానే వున్నట్టనిపించింది. వాడిని మన దగ్గరుంచుకుని మనం వాడికి ఒరగబెట్టేదేముంది. కనీసం వాడయినా బాగు పడ్తాడు. వరదుడి ఆస్తి అంతా మనవాడిదే అవుతుంది. మనదే అవుతుందనుకో. ఇంక మాటలు పడ్తూ ఈ బోడి ఉద్యోగాలు ఎవడి కిందో చేయాల్సిన అవసరం వుండదు. నువ్వూ పిల్లలూ పడే బాధలు కూడా తప్పిపోతాయి. ఏ విధంగా చూసినా వాడి ప్రపోజల్ నాకు మంచిగానే కన్పించింది. నువ్వేమంటావు'' అన్నాడు నరశింహాచార్యులు.

రంగనాయకమ్మకు భర్త స్వార్థపు పరాకాష్ఠ దృగ్గోచరమై నివ్వెరపోయింది. ఆ వరదాచార్యులు నిజానికి తమంత ఆస్తి పరులేం కాదు. ఐదారెకరాల భూమికంటే లేదతనికి. మనిషి జాగ్రత్తపరుడు కాబట్టి, పైగా తాము ఇద్దరు మనుషులే కాబట్టి సంసారాన్ని గుంభనంగా నెట్టుకొస్తున్నాడు. నిజానికి దత్తివ్వటమే కనుక జరిగితే రెండేళ్ళలో తన భర్త ఆ ఆస్తి మంగళంపాడేస్తాడు. ఆపైన వాళ్ళ ఘోష తను చూడలేదు. దత్తు ఇవ్వటంలో భర్త ఆలోచన తను ఉద్యోగాన్ని మానేసి నిర్వ్యాపారంగా కూర్చోటం కోసమేగాని పిల్లవాడి భవిష్యత్తు దృష్టిలో పెట్టుకుని చేసే పనికాదని ఆమెకు తెల్సు. అత్తగారు పోయినప్పుడు దినవారాల కొచ్చిన వరదాచార్యులు, అతని భార్యా విఠలుడిని చూసి ముచ్చటపడిపోయారు. వరదాచార్యులు భార్య తాము దత్తత చేసుకోవాలనే ఆలోచనలో వున్నట్టు చెప్పింది కాని, వాళ్ళ దృష్టిలో విఠలుడున్నట్లు రంగనాయకమ్మ భావించలేదు. పిల్లలు లేని వాళ్ళెవరైనా దత్తత చేసుకోవటంలో తప్పు పట్టదు రంగనాయకమ్మ. కాని భర్త ఆలోచనా ధోరణిని ఏవగించుకుంది ఆమె.

"అయితే విఠలుడిని వాళ్ళకు దత్తు ఇద్దామనుకుంటున్నారన్న మాట"

"మరి వాళ్ళు విఠలుణ్ణే అడిగారు, నేనేంచేయను. 'పోనీ మా రంగణ్ని తీసుకోరా' అన్నా. వాడింకా చిన్న వెధవకాబట్టి మీకు బాగా అలవాటవుతాడు అనీ అన్నా. కాని వాడు విఠలుణ్నే ఇమ్మని అడిగాడు''

"నా పిల్లలు నాకేం ఎక్కువ కాదు. విఠలుణ్ణీ దత్తు ఇవ్వను. రంగణ్ణీ ఇవ్వను. నా చాతనయినట్టుగా పెంచుకుంటాను. మీరు ఉద్యోగం చేసి పెంచటం కష్టమైతే ఉద్యోగం మానెయ్యండి. కానీ ఏదో పద్ధతిలో ఇతరుల డబ్బుమీదపడి బతకాలన్న ఆలోచన చేయకండి'' అంది రంగనాయకమ్మ స్థిరనిశ్చయంతో. ఇంతకు ముందు భర్త చేసిన చేతలన్నీ ఆమె క్షమించగలిగిందిగాని, అతనిప్పుడు చేసిన ప్రస్తావన ఆమెకు మర్మఘాతమైంది.

"నీయవ్వ! ఆడముండల్ని సలహా అడిగితే ఇంతే. వాళ్ళకు బుర్రుండదు, ఆలోచించుకోరు. మంచి ఆలోచన చెప్తే వినరు. మూర్ఖపు మొహాలు. నువ్వేమన్నా తన్నుకు చావు, వాడికి మాటిచ్చాను. విఠలుణ్ణీ దత్తు ఇచ్చేది ఖాయం" అన్నాడు నరశింహాచార్యులు కోపంగా.

రంగనాయకమ్మ భర్తకేం సమాధానం చెప్పలేదు. పిల్లలందర్నీ పేరుపేరునా పెట్టి పిల్చింది ఆమె. "ఓరే శేషూ, విఠలూ, వెంకూ, రంగా, ఆండాళ్ళూ అందరూ రండిరా. మీ నాయన పోషించలేక మిమ్మల్నందర్నీ అమ్మేస్తాట్ట. వచ్చి మీరయినా ఇంత గడ్డి పెట్టండి'' అంది ఆమె ఆక్రోశంతో.

"ఎవర్ని అమ్ముతాట్టమ్మా'' అనడిగాడు పెద్దకొడుకు శేషు.

"అమ్మటం కాదురా, బుర్రలేని ఆడది ఏదో

వాగుతోంది. దానికి పరిస్థితి తెలియదు. చెప్తే వినదు. మీ బాన్సువాడా వరదాచార్యులు పెదనాయన లేడూ, ఆయన విఠలుణ్ణి దత్తు ఇవ్వమని అడిగాడు. మంచి ఆస్తి పరుడు. కనీసం వాడి జీవితమైనా బాగుపడ్తుందని నా ఆలోచన" అన్నాడు నరశింహాచార్యులు కొడుక్కు నచ్చచెప్పే ధోరణిలో.

కొడుకు కాలేజీ చదువుల కొచ్చింతర్వాత కొంత మర్యాదగా మాట్లాడటం నేర్చుకున్నాడు నరశింహాచార్యులు.

"నేను ఎవరికీ దత్తు వెళ్ళను. అమ్మనొదిలి ఎక్కడకూ వెళ్ళను. నీకంత కష్టమైతే ఏ హొటల్లో అయినా కప్పులు కడుగుకుంటూ బతుకుతాలే అన్నాడు విఠలు.

"ఓర్నీయమ్మ కడుపు కాల! మొండి ముద నష్టం వెధవ. నీకు ఆ పంటకుర్తివాళ్ళ పోలికలే వచ్చినట్టున్నయ్యి. వాళ్ళు పైకిపోరు, ఇంకోళ్ళ ని పోనివ్వరు. గడ్డివామికాడ కుక్కకాపలా తంతు. వరదుడి ఆస్తిని వాడూ వాడూ తింటే మనకేం లాభంరా, హాయిగా నువ్వే అనుభవిస్తావు. వాళ్ళనడిగి డబ్బు తెచ్చి మీ అమ్మకివ్వు, అంత ప్రేముంటే. నేను వద్దన్నానా?" అన్నాడు నరశింహాచార్యులు.

"మనకెవరి డబ్బూ అవసరంలేదు నాన్నా! ఇన్నేళ్ళూ బతికాం. ఇంక బతక్కపోం.తమ్ముణ్ణి దత్తు ఇవ్వాల్సిన అవసరంలేదు'' అంది ఆండాళ్ళు.

"నువ్వు నోర్మూసుకోవే. నీబోడి సలహా ఎవరూ అడగలేదు''

"మీవి తప్ప అందరివీ బోడిసలహాలే. మరలాంటప్పుడు అడగటమెందుకు?" అంది రంగనాయకమ్మ.

"నాదే బుద్ధి తక్కువ. సరే, వినండి. నేను ఈ ఇంటి యజమానిని ఇంట్లో నేను చెప్పినట్టే అందరూ నడవాలి. మీరంతా అరిచి గీపెట్టుకున్నా విఠలుణ్ణి వరదుడికి దత్తు ఇచ్చేది ఖాయం" అన్నాడు నరశింహాచార్యులు లేస్తూ.

"యజమాని సంపాదించి పోషించే బాధ్యత కూడా వుంటుంది. హక్కే కాదు. ఇంట్లో నలుగురు సంపాదిస్తున్నప్పుడు నలుగురూ యజమానులే. అమ్మ పొద్దున లేచింది మొదలు ఇంటిపనేకాక ఆ వడియాలు, అప్పడాలు పెట్టి నడుములు విరుచుకోవటంలా. ఆండాళ్ళు గుడ్డలు కుట్టి డబ్బెందుకు సంపాదించాలి. నేను చదువుకుంటూ కూడా ట్యూషన్లెందుకు చెప్పాలి? ఇంతమంది యజమానులున్న కొంపలో ఏ ఒక్క యజమానిదీ సర్వాధికారం కాదు. తండ్రిననే గౌరవం కూడా పోగొట్టుకోవాలనుకుంటే మాత్రం నీ ఇష్టమొచ్చినట్టు చెయ్యి'' అన్నాడు శేషశయనాచార్యులు.

"నాన్న తెచ్చిన ఆ బట్టలు మాకొద్దు'' అంటూ వచ్చీరాని మాటల్తో వెంకటాచార్యులు తెచ్చిన బట్టలను ఆయన ముందు పడేశాడు.

పిల్లలందరూ తమకి తండ్రి తెచ్చిన కొత్త గుడ్డలు తెచ్చి ఆయనముందు గుట్టగా పోశారు. రంగనాయకమ్మ కూడా భర్త ఇచ్చిన చీరె కూడా అతనిముందు పెట్టి వెనక్కి తిరిగింది.

"ఓర్నీయవ్వ! మీరందరూ నామీద కత్తిగట్టారా? నా మాటకు ఇంట్లో విలువలేదా? తండ్రినన్న గౌరవం కూడా ఇవ్వరా? పొండసలు మీరెవరు, నేనెవరు? హాయిగా నా ఉద్యోగం చేసుకుంటూ నా బతుకు నేను బతగ్గలను. మీకోసం నానాగడ్డి కరిచి తెచ్చిపెడ్తుంటే నేనంటే లెక్కలేకుండా వుంది. రేపటి నుండి మీకు డబ్బు పంపిస్తే నేను మా నాయన కడుపునే పుట్టలేదు. తల్లీ పిల్లలూ ఏం తిని ఛస్తారో చావండి. ఇహ మీకూ నాకూ సంబంధంలేదు. నే వెళ్ళిపోతున్నాను'' అని గుడ్డలేసుకుని వెళ్ళిపోయాడు నరశింహాచార్యులు. అతన్నాపే ప్రయత్నం ఎవరూ చెయలేదు.

అలా వెళ్ళిపోయిన రెండు నెల్లవరకు మనిషి అయిపులేదు, డబ్బూ పంపలేదు. అయితే భూతకాలాన్ని కాదని బతకటం మనిషికి చాలాకష్టం. అలా అనగలిగి బతుకు విధానాన్ని మార్చుకోగల వ్యక్తి ప్రబల శీలం కలిగినవాడై వుండాలి. అలాంటి వ్యక్తిత్వం

నరశింహాచార్యులకు లేదు. రెండు నెలల తర్వాత మళ్ళీ రాకపోకలు సాగించాడు. డబ్బు చేతిలో వున్నప్పుడు, తనకవసరాలు లేనప్పు డు ఇంటికి పంపేవాడు.

రెండు సంవత్సరాలు భారంగా గడచిపో యాయి. శేషశయనాచార్యులు ఇంటర్మీడి యెట్ పాసయ్యాడు. ఇంటర్మీడియట్ చదువు కునే రోజుల్లోనే పబ్లిక్ సర్వీస్ కమీషను పరీక్ష రాసి ఉత్తీర్ణుడయ్యాడు. హైదరాబాదు సెక్రటేరి యట్‌లో అతనికి ఉద్యోగమొచ్చింది. అతను వెళ్ళి ఉద్యోగంలో జాయినయ్యాడు. "ఇక్కడ మామయ్య వాళ్ళ ఇంటిపక్కనే ఇల్లు చూశా ను. అక్కడ కాపురం ఎత్తేసి, మీరందరూ ఇక్కడకు రావల్సింది. ఎప్పుడు మీరొస్తారో రాస్తే నేను స్టేషనుకొచ్చి మిమ్మల్ని ఇంటికి తీసుకెళ్తాను'' అని తల్లికి ఉత్తరం రాశాడు శేషశయనాచార్యులు.

రంగనాయకమ్మకేం చేయాలో తోచలేదు. సంప్రదించాలంటే భర్త లేడు. తాము హైదరా బాద్‌కు తరలివెళ్ళిపోతున్నామంటే అప్పులవా ళ్ళంతా ఇంటిమీద వచ్చి పడ్తారు. అలా ఆమె సందిగ్ధంగా వున్న సమయంలో పీరుసాయి బ్బు ఆమెకి సాయంచేశాడు. ఇంటి యజమా నితో చెప్పకుండా ఇల్లు ఖాళీచేసి వెళ్ళటం కుదరదు. అందుకని ముందుగా ఇంటియజ మానికి చెప్పాడు పీరుసాయిబ్బు. "వీళ్లు హై దరాబాదు వెళ్ళి, పిల్లగాడు నిలదొక్కుకున్నాక నీకు బాకీ వుండిన కిరాయి డబ్బు పంపిస్తారు. ఇప్పుడు నా బాకీ వసూలయితే కానీ పోనీయ నని పట్టుబట్టకు'' అని నచ్చచెప్పాడాయనకి.

ఇంటి యజమాని బాకీ తీర్చమని పట్టుబట్ట లేదు. పైగా వీళ్లు బాగుపడేరోజులొచ్చాయని సంతోషించాడు. ఆయనకు తెల్సు తన బాకీ తీరదని. అయినా ఆనందంగా రంగనాయక మ్మ ఊరొదిలిపోటానికి సహకరించాడు. రంగ నాయకమ్మ తాము ఎప్పుడు హైదరాబాదు వస్తున్నదీ కొడుక్కు ఉత్తరం రాసింది. తాము హైదరాబాద్‌లో స్థిరపడుతున్నట్లు భర్తకూ ఉత్తరం రాసింది.

తెల్లవారుఝాము బండికి, రెండుసార్లు బండిని తిప్పి సామాన్లను మనుషులను బోధన్ రైల్వేస్టేషనుకు చేరవేశాడు పీరుసాయి బ్బు. వాళ్లకున్న సామగ్రి కూడా తక్కువే. పాత్రసామాను చాలాభాగం ఎప్పుడో అమ్ముడ యిపోయింది. అవసరమైన వంటపాత్రలూ, పక్కబట్టలూ, కట్టుకునే బట్టలూ తప్ప వాళ్లకు న్న సామానేంలేదు.

ఇంకా నిజామాబాదువైపు వెళ్ళే బండి రాలేదు. పిల్లలు నిద్రమత్తులోనే జోగుతున్నా రు. స్టేషనులో రంగనాయకమ్మ బెంచీమీద కూర్చున్నది. స్టేషనులో గానుగ చెట్టు చుట్టూ వేసిన సిమెంటు చప్టామీద కూర్చున్నాడు పీరుసాయిబ్బు.

"చాలా కృతజ్ఞతలు తాతా! ఎంతో సాయం చేశావు. మా నాన్న వెళ్ళిపోయింతర్వాత ఇంత గా మమ్మల్ని ఆదుకున్నదెవరూ లేరు. మా అత్తగారు పోయింతర్వాత నాకు ఆత్మీయు లంటూ లేకపోయారు. ఆ ఇద్దరి స్నేహాన్నీ నాకిచ్చావు. ధైర్యాన్నిచ్చావు'' అంది రంగనా యకమ్మ.

"అదేందమ్మా అట్లాగంటావు. మీ మామ తరంవాడిని. మీ మామ వుంటే ఇంకేం జేసునో. నువ్వు నా బిడ్డలాంటిదానివి తల్లీ. మీరు మళ్ళీ నా కళ్లబడతారో లేదో కాని మీరైనా హాయిగా వుండండమ్మా! ఆ హైదరాబాదు పెద్దపట్నం. జాగర్తమ్మా'' అన్నాడు పీరుసా యిబ్బు.

"నిన్ను చూస్తే నాకు దిగులుగా వుంది తాతా! ఈ వయసులో ఇంకా ఎంతకాలం బండి నడుపుతావు. నిన్ను చూసేవాళ్ళెవరూ లేరు. తల్చుకున్నప్పుడల్లా నాకు బాధ కలుగు తుంది'' అంది రంగనాయకమ్మ.

"అన్నింటికీ ఆ అల్లా వున్నాడు తల్లీ! నాకేంది. ఒంటరివాణ్ణి. డబ్బు కూడబెడుతు న్నాను. ఆ హజ్‌యాత్ర చేస్తే ఒక్కసారి బతికుండగా మక్కాకు వెళ్ళగలిగితే ఈ జన్మ కింకేం కావాలి తల్లీ! ఏమో, ఆ పర్వర్‌దిగార్

హుకుం ఎట్లాగుందో పరమదయాళుడైన ఆయన నా కోర్కె తీరుస్తాడనే నా నమ్మకం తల్లీ''

అప్పుడు గుర్తుకు వచ్చింది రంగనాయకమ్మకు. తండ్రి తనకిచ్చిన బాలకృష్ణుడి విగ్రహం సంగతి. "అవును. తను ఆపనెందుకు చెయ్యకూడదు. బాగా అవసరం వున్న వాళ్ళకివ్వమన్నాడు తన తండ్రి. నిత్యావసర జీవనానికి కాపోయినా, ఆధ్యాత్మిక జీవనానికి అది అవసరమయ్యే పరిస్థితిలో తనెందుకు ఆ పని చెయ్యకూడదు. కాని తాత తన దగ్గర తీసుకుంటాడా చాలా అభిమానమున్న మనిషి. తనే బలవంతంచేసి ఇవ్వాలి. ఈ పనిచేస్తే పోయిన తన అత్తగారూ, బతికున్నాడో లేదో తెలియని తన తండ్రీ ఎంతో సంతోషిస్తారు'' అని అనుకుంది రంగనాయకమ్మ.

"తాతా! నీ బిడ్డ ఓ మాట చెప్తే వింటావా?" అంది రంగనాయకమ్మ.

"చెప్పు తల్లీ! నీకు నాతాన సందేహమెందుకూ'' అన్నాడు పీరుసాయిబ్బు.

"మా నాన్న వెళ్ళిపోయేటప్పుడు నాకో బాలకృష్ణ విగ్రహమిచ్చాడు. చిన్నదే మంచి బంగారంతో చేసింది. అది మూడు భాగాలుగా వుంది. బాగా అవసరమైనవాళ్ళకు మూడుసార్లుగా ముగ్గురికి ఆ మూడు భాగాలనూ గుప్తదానం చెయ్యమన్నాడు ఆయన. నా స్వంతానికి నేను దాన్ని వినియోగించరాదు. మొదటి భాగం నీకిప్పుడు ఇవ్వాలనుకుంటున్నాను. నువ్వది స్వీకరించు''

"అయ్యో! నీది ఎంత పెద్ద హృదయమమ్మా! అయినా నాకది ఒద్దులే తల్లీ! ఈ రెక్కలు ఆడుతున్నంతవరకు నాకు ఢోకా లేదు. తిండికిబ్బంది లేదు. అది అల్లా ఇచ్చాడు. ఇంక నేనా బంగారం తీసుకునేం చేసుకుంటాను తల్లీ''

"కాదు తాతా! నేనది నీ భౌతిక జీవన్నానికి ఉపయోగపడుతుందని ఇవ్వటంలేదు. నువ్వు మక్కాయాత్రకెళ్ళాలని ఉవ్విళ్ళూరుతున్నావు. డబ్బు కూడబెట్టుకుంటున్నావు. ఆ పుణ్యకారంలో నన్నూ ఓ చెయ్యి వెయ్యనియ్యి''

"వద్దమ్మా వద్దు. నా కష్టంతో కూడబెట్టిన ధనంతో వెళ్ళాలనుకుంటున్నాను. నేనది నీ దగ్గరనుండీ స్వీకరించలేను తల్లీ!" అన్నాడు తలతిప్పుతూ పీరుసాయిబ్బు.

"నువ్వు చెప్పే మాటలేం బాగాలేవు తాతా! నన్ను నీ బిడ్డనంటావు. నీ బిడ్డ ఇస్తే తీసుకోవా? ఊర్కే ఏం తీసుకోవద్దు. నువ్వు మక్కాయాత్ర చేస్తే ఆ వచ్చే పుణ్యంలో నా భాగం నాకిచ్చెయ్యి. నీ బిడ్డకోసం ఆమాత్రం పుణ్యమివ్వలేవా?"

పీరుసాయిబ్బు ఏం మాట్లాడలేకపోయాడు. అతని కళ్ళనుండి కన్నీళ్ళు ధారగా కారసాగాయి.

"ఏం తాతా! ఎందుకేడుస్తున్నావు'' అనడిగింది రంగనాయకమ్మ.

"ఏడుపు కాదమ్మా ఆనందం, ఆనందం! ఎటువంటి తండ్రి! ఎటువంటి బిడ్డ! నిన్ను కన్న మీ నాయన ధన్యుడమ్మా! నీవలాంటి తండ్రికి కూతురైనందుకు ధన్యురాలవమ్మా''

"మరి తీసుకుంటావా తాతా?"

"ఇవ్వు తల్లీ ఇవ్వు. నీ మాట కాదనటం నాకిష్టంలేదు. ఇంతకాలం తాతా అని పిలుస్తున్నావు. ఇంటికొచ్చినప్పుడల్లా బిడ్డలా కడుపు కనుక్కుని కమ్మని భోజనం పెడ్తున్నావు. నేను చేసుకున్న పుణ్యం ఏదయినా వుంటే దానిలో భాగం నా కూతురికివ్వవద్దూ ఇవ్వమ్మా, ఇవ్వు, అట్టాగే తీసుకుంటాను''

రంగనాయకమ్మ కళ్ళు మూసుకుని సర్వాంతర్యామియైన ఆ పరమేశ్వరుడికి నమస్కరించి, మనసులో-

"నీ పాద కమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమునునితాం
తాపార భూత దయయును
దాపసమందార నాకు దయసేయగదే''

అని చదువుకుంటూ, బట్టల మూటలో వున్న దేవతార్చనా పేటికతీసి బాలకృష్ణుని అధోభాగాన్ని సీలవిప్పి విడదీసి, మళ్ళీ దేవతార్చనా పేటికను గుడ్డల మూటలో కట్టి, బాలకృష్ణుని అధోభాగాన్ని పీరుసాయిబ్బుకిస్తూ అంది. "మీరు విగ్రహారాధకులు కాదుకదా తాతా! నువ్వది విగ్రహంగా భావించనక్కర్లా. నిజానికి మిగతా రెండు భాగాలు లేని అది విగ్రహం కూడా కాదు. దాన్ని బంగారంగా భావించు. అమ్మితే ఏదో కొంత వొస్తుందేమో తెలీదు. మూడుతులాల బంగారముంటుందన్నాడు నాన్న" అని ఓ క్షణమాగి, "మమ్మల్ని మర్చిపోకు తాతా! మరి నువ్వు కన్పిస్తావో లేదో నీకిది నా చివరి నమస్కారం" అంది రంగనాయకమ్మ, చేతులు జోడిస్తూ.

"ఆ అల్లా నిన్ను చల్లగా చూడుగాక తల్లీ!" అని ఆశీర్వదించాడు పీరుసాయిబ్బు.

అంతలో ట్రైను రావటం, పిల్లల్ని హడావుడిగా లేపి, వాళ్ళను బండిలోకెక్కించి సామాను కూడా చేరవేయటంతో పీరుసాయిబ్బుకు ఆమెతో మరేం మాట్లాడే అవకాశం దొరకలేదు.

ట్రైను కదలటంతో "వస్తాం, తాతా!" అంది రంగనాయకమ్మ.

పీరుసాయిబ్బు ఏం మాట్లాడలేకపోయాడు. ఉద్వేగంతో అతని గొంతుకు పూడుకుపోయింది, కన్నీటితో వీడ్కోలిచ్చాడామెకు. ట్రైను ఆ మసకకాంతిలో కనిపించినంత దూరం అలా చూస్తూనే వుండిపోయాడు.



బోధన్‌లో వుండగానే ఆండాళమ్మ హెచ్.ఎస్.సీ. పాసయింది. ఆమెకు పెళ్ళిచేసే ఉద్దేశంతో ఆమె చదువు మాన్పించారు తల్లీ కొడుకులు. విఠలాచార్యులను తొమ్మిదో క్లాసులోనూ, వేంకటార్యులను వీధిబడిలో ఒకటోక్లాసులోనూ చేర్పించాడు శేషశయనాచార్యులు. రంగనాధాచార్యులు అప్పటికింకా ఏడ్వర్థం పిల్లవాడే. వీళ్ళు హైదరాబాద్‌లో స్థిరపడటంలో రంగనాయకమ్మ తమ్ముడు రామానుజాచార్యులు చాలా సాయం చేశాడు.

నరశింహాచార్యులు కూడా హైదరాబాద్ వచ్చి పెద్దకొడుకు సంపాదిస్తూంటే హాయిగా కాలుమీద కాలువేసుకుని, సుష్టుగా భోజనంచేస్తూ, సిగరెట్టు తాగుతూ కాలం గడపాలని చూశాడుగానీ కొడుకు తండ్రికి నిక్కచ్చిగా చెప్పేశాడు. "ఇంత సంసారానికి నా ఒక్కడి జీతం చాలదు నాన్నా! నువ్వు కూడా డబ్బు పొదుపుగా వాడుకుంటూ వీలయినంత ఎక్కువ పంపిస్తే సంసారం గడపడం తేలికవుతుంది" అని. 'తన్ను రావద్దని మాటల్లో చెప్పకుండా డబ్బు సంపాదించి పంపమన్నాడ' ని గింజుకున్నాడుగాని నరశింహాచార్యులేం మాట్లాడలేకపోయాడు. మామా, తల్లీ పోయింతర్వాత అతని కోరలు పీకినట్లయింది. చిన్నవాళ్ళచేత మాటలనిపించుకోవటం తలవంపులని అతను పెద్దకొడుకునేమీ అనేవాడు కాదు. సంసార కథసూత్రాలు తల్లీ కొడుకులకొచ్చింతర్వాత కుటుంబం ఒక గాటిన పడినట్లయింది. దుబారా ఖర్చుల్లేకుండా పొదుపుగా వాడుకోసాగారు.

హైదరాబాదులో స్థిరపడిన రెండేళ్ళకు ఆండాళ్ళమ్మ వివాహం చేయటం సాధ్యపడింది. రామానుజాచార్యులే. వాకబుచేసి సంబంధం ఖాయంచేశాడు. కట్నం రెండువేలకు మాట్లాడాడు. నెలకు నూటయిరవై రూపాయల ఉద్యోగి అయిన శేషశయనాచార్యులకది చాలా ఎక్కువ కట్నంలాగే కన్పించింది. "నా వల్ల కాదు మామయ్యా! కట్నమే రెండువేలయితే, పెళ్ళిఖర్చులు ఆరేడొందలయినా

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పివంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

కావా! ఎక్కడనుండి తీసుకురాను ఇంత!'' అన్నాడతను.

"నీవల్ల అయినంత ఇవ్వరా! మిగతాది నేనిప్పిస్తాను'' అన్నారు రామానుజాచార్యులు.

పెళ్ళిపనులు చేయటం రంగనాయకమ్మకు కష్టమైంది. బాలెంత అవటంవల్ల ఆమె ఏ పనులూ చేయలేకపోయింది. "లక్ష్మి పుట్టిందిరా నాకు, అలివేలుమంగ పుట్టింది'' అని మురిసిపోయాడు నరశింహాచార్యులు. పెళ్ళీడుకొచ్చిన పిల్లల్నిలా పెట్టుకుని తాము పిల్లల్ని కంటున్నందుకు సిగ్గుపడిపోయింది రంగనాయకమ్మ. "ఆc మీరట్లా కంటుండండి, పెంచి పెద్ద చేయటం మావంతవుతుంది'' అన్నట్టు తల్లీతండ్రీవంక చూశాడు శేషశయనాచార్యులు.

రామానుజాచార్యులు కుదిర్చిన సంబంధం మంచి సంబంధమే. పిల్లవాడు వరంగల్ మిల్లులో అసిస్టెంట్ స్పిన్నింగ్ మాష్టరుగా పనిచేస్తున్నాడు. ఆండాళుదిసంప్రదాయమైన కుటుంబమని గోవర్ధనాచార్యుల తల్లి తండ్రులకీ సంబంధం నచ్చింది.

ఆండాళు పెళ్ళయిన నాలుగేళ్ళదాకా రంగనాయకమ్మ జీవితం హాయిగానే గడచిపోయింది. డబ్బుచాలక ఇబ్బందులు పడ్డారు తల్లీకొడుకులు. ఆండాళు పెళ్లికోసం చేసిన అప్పులు తీర్చారు. విఠలాచార్యులు కూడా ఏదో ప్రైవేటు కంపెనీలో ఉద్యోగంలో ప్రవేశించటంతో ఆండాళ్లు పెళ్లికి చేసిన అప్పులు తీర్చడం తేలికైంది వాళ్ళకు.

శేషశయనాచార్యులకూ సంబంధాలు వస్తున్నాయి. నరశింహాచార్యులూ కొడుకు పెళ్ళి చేసి కోడల్ని తెచ్చుకోవాలనే ఉబలాటంలో ఉన్నాడు. రామానుజాచార్యులే, "రెండేళ్లు ఆగు బావా! పెళ్ళి చేసినప్పటినుండీ వాళ్ళ స్వార్థాలు వాళ్ళకు తెలుస్తాయి. మళ్ళీ కొడుకులు పెట్టలేదని ఏడవటంకంటే రెండేళ్లు ఆగితే మంచిది కాదూ'' అన్నాడతను.

"ఆ వెధవలు పెట్టేదేంట్రా, నేను సంపాదించటం లేదూ'' అన్నాడు నరశింహాచార్యులు.

"ఆc, నీ సంపాదనతోనే సంసారం నడుస్తున్నది'' అనలేకపోయాడు రామానుజాచార్యులు, ఎందుకులే పెద్దవాణ్ణి అగౌరపర్చటమనే ఉద్దేశంతో.

ఆండాళ్ళు పెళ్ళైన నాలుగేళ్ళకు శేషశయనాచార్యులు పెళ్ళి అయింది. నరశింహాచార్యులు హైదరాబాద్‌లో వుండడు కనుక పెళ్ళి మాటలన్నీ రామానుజాచార్యులే మాట్లాడాడు. కట్నం ఐదువేలిచ్చారు. తండ్రి సంసారం నిప్పచ్చరం చేయటంవల్ల డబ్బు విలువ బాగా తెలుసుకున్న శేషశయనాచార్యులు పెళ్ళిఖర్చులకుగాను వెయ్యిరూపాయలకు మించి ఖర్చుపెట్టనివ్వలేదు. మిగతా నాలుగువేలు పెట్టి తన పేరున సీతాఫలమండిలో స్థలం కొనుక్కున్నాడు. ఉన్న వెయ్యి రూపాయల్లో నగలకిందా, పెళ్ళి కూతురు కాళింది చీరెలకిందా ఐదారువందలు ఖర్చవటంతో మిగతా డబ్బుతో గృహప్రవేశానికీ, సత్యన్నారాయణ వ్రతానికీ వచ్చిన బంధుమిత్రులకు భోజనాలు పెట్టటమే కష్టమైంది. బంధువులందరికీ బట్టలు పెట్టి అట్టహాసంగా పెళ్ళి చేయాలనుకున్న నరశింహాచార్యులకు కొడుకు ప్రవర్తన నచ్చలేదు. "ఒట్టి పీనాసి వెధవ. మా అమ్మ పోలిక వచ్చింది. పైసపోతే ప్రాణం పోతుందంటాడు'' అన్నాడు భార్యతో అతను.

గదాధరాచార్యులు మాత్రం కూతురిపెళ్ళి ఘనంగా జరిపించాడు. అల్లుడిలాగా పీనాసితనానికి పోలేదు. 'అంత కట్నం తీసుకుని కూడా తనకు నగలు, చీరెలు పెట్టకుండా చేసింది తన అత్తగారే' అన్న ఆలోచనతో అత్తగారింట అడుగుపెట్టింది కాళింది. కాపురానికొచ్చింతర్వాత ఆమె మొదటగా గ్రహించిన విషయం అత్తగారి మూకంతా కల్సి తన భర్త సంపాదనమీద పడితింటున్నారని. విఠలాచార్యులు సంపాదించినా అది ఆమెకు లెక్కలో వుండేదికాదు.

ఇల్లంతా సత్రంలా అన్పించేది ఆమెకి. అది తనకు సంబంధించిన కుటుంబంలాగా అన్పించేది కాదు ఆమెకు.

పెద్దగా చదువు కోకపోయినా, ఒరిజినల్ తెలివితేటలున్నాయామెకు. ఏ వ్యక్తితో వ్యవహరించాలన్నా మొదటగా ఆ వ్యక్తిని చాలా జాగ్రత్తగా పరిశీలించి చూడాలన్నది ఆమె మొదటి సూత్రం. ఆ వ్యక్తి జుట్టు మనం పట్టుకోగలం అన్న విశ్వాసం కలిగినప్పుడు ఆ వ్యక్తిని ఢీకొనటానికి ఓ చిన్న ప్రయత్నం చెయ్యాలి అన్నది రెండో సూత్రం. ఆ దెబ్బని స్వీకరించి మౌనంగా వున్నట్లయితే చివరిసారిగా గట్టిదెబ్బ కొట్టి చూడాలి. దానికే ఎదుటివ్యక్తి లొంగిపోయినట్లయితే ఇంక తనకిహ ఎదురుండదని ఆమె మూడవ సూత్రం. ఇంట్లో ప్రవేశించగానే ఈ మూడు సూత్రాలను అమలులో పెట్ట ప్రయత్నించింది కాళి. ఆమె లక్ష్యం అత్తగారు రంగనాయకమ్మ.

మొదట్లో అత్తగారు అడిగిన ప్రశ్నలకు బదులు చెప్పటం మినహా మరొక్కమాట అధికం మాట్లాడేదికాదు కాళింది. నెలల తరబడి కొత్త పెళ్లి కూతురులాగ ప్రవర్తించేది. అత్తగారు-

"అమ్మాయి! కాస్త కూరగాయలు తరిగిపెట్టు''
"బియ్యంలో మట్టిగడ్డలున్నాయి ఏరిపెట్టు''
"విఠలుడికి ఆఫీసు టైమైందమ్మా! వాడికి అన్నం వడ్డించు''
"ఎవరో బిచ్చగాడొచ్చాడు, గుప్పెడు బియ్యం తీసికెళ్లి వెయ్యి'' లాంటి చిన్నచిన్న పనులేమయినా చెప్పినా అవి చేయటానిక్కూడా ఆమెకయిష్టంగావున్నా ఎదురు చెప్పకుండా చేసేది.

నిజానికి రంగనాయకమ్మే రెండు పూట్లా వంట చేసేది. మడికట్టుకుని వంటచేయటమంటే ఈ కాలపు పిల్లలకు కష్టమైన పని అనీ, తను మైలకూడు తినలేకా రెండు పూటలా తనే వంట చేసేది. అత్తగారు మడికట్టుకుని వున్నప్పుడు భర్తకి తప్ప, మిగతావాళ్ల కోసం ఏం పని చేయమన్నా కాళిందికి కష్టంగా వుండేది.

క్రమక్రమంగా అత్తగారి మెతకతనం కాళిందికి అవగతమైపోయింది. తనింక నోరు మూసుకు కూర్చుంటే తన సంసారం గుండమైపోతుందని ఆమె తెల్సుకుంది. అయితే త్వరపడటం ఆమె లక్ష్యం కాదుగనుక ముందుగా రెండవ సూత్రం అమలులో పెట్ట నిశ్చయించింది.

మధ్యాహ్నం పూట రంగనాయకమ్మ ఇంటి పక్కలవాళ్లు, ఆమె మరదలు సుభద్ర ఆమె ఏమయినా మంచిమాటలు చెప్తుందేమోనని వచ్చేవాళ్లు. రంగనాయకమ్మ రామాయణ భారత భాగవతాది గ్రంధాలు చదివి విన్పించేది. అత్తగారు కమనీయ కంఠంతో గానం చేస్తుంటే వినాలనిపించినా, అత్తగారు కనుక తను వినకూడదు. ప్రత్యర్థిలో ఎలాంటి మంచి లక్షణాలనూ చూడటం తన సూత్రాలకు విరుద్ధం. అందువల్ల బలవంతంగా తన మనసును మరల్చుకుని అత్తగారి పురాణశ్రవణం తనకు నచ్చని విషయంగా నిర్ణయించుకుంది. క్రమంగా అది మనస్సులో కుదురుకుని, అత్తగారు పురాణ శ్రవణం మొదలెడితే అది మధ్యాహ్నంపూట తను హాయిగా కునుకు తీయకుండా వుండటానికే ఆమె చేస్తున్నదనే నిర్ధారణకొచ్చిందామె. పైగా ఇలా అందర్నీ చేర్చి ఇంటిని సత్రంలా మల్చటం ఆమెకి కష్టంగా వుండేది.

ఆరోజు మధ్యాహ్నం...

రంగనాయకమ్మ వచ్చినవాళ్లకు భక్తి తత్వాన్ని గూర్చి చెప్తోంది. మధ్యమధ్యలో అన్నమాచార్యుల కీర్తనలు పాడుతోంది రంగనాయకమ్మ.

'తందనాన అహ తందనాన పురే,
తందనాన భళా తందనాన
బ్రహ్మమొకటె పరబ్రహ్మమొకటె పర
బ్రహ్మ మొకటె పర బ్రహ్మమొకటె
కందువగు హీనాధికము లిందులేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకులమంతా నొకటే

అందరికి శ్రీహరే అంతరాత్మ
నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటు నిద్ర అదియునొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టు భూమియొకటే
చండాలుడుండేటి సరి భూమియొకటే'
అని పాడుతోంది.

అత్తగారి గోలతో నిద్రపట్టక పక్కమీద దొర్లుతున్న కాళింది అనుకుంది. 'ఆ.. ఈ మెట్టవేదాంతానికేమొచ్చెలే. అంతా ఒక టేట... ఒకప్పైతే మరీ మడీ, మైల అని తన ప్రాణం తీయటమెందుకూ? అబ్బే ఏమి సమర సత్వం! కొడుకుల్నే సమంగా చూడదు. ఇంక బయటవాళ్ల సంగతేం చెప్తాం? ఆయనొక్కడూ రెక్కలు ముక్కలు చేసుకుని సంపాదించాలి. కొంపలో అందరూ పడి తినాలి. కొడుకులంద రూ ఒకటికాదూ? ఈయనొక్కడే ఈ ఉమ్మడి సంసారాని కని ఒళ్లు విరుచుకోటమెందుకూ? నేనూ చెప్తాను పురాణాలు... చెప్పటానికేగాని ఆచరించటానికి కాదుగదా!'

ఆ పాట అయింతర్వాత, "ఇంకేమయినా పాడువదినా!" అని సుభద్ర అడగటంతో కా ళింది మనస్సు ప్రస్తుతానికొచ్చింది.

"ఏం భారతమ్మగారూ! మీ కోడలు పురిటి కెళ్లిందా'' అనడిగింది కామేశ్వరి.

"నేను వాళ్ల పుట్టింటికి పంపిద్దామనే అను కున్నాను. మొదటి పురుడు మాత్రమే పుట్టింటి వాళ్లు పోయాలట. రెండో పురుడు ఇక్కడే పోసుకుంటాను. మావాళ్లు మాత్రం చేయొ ద్దూ! ఖర్చుపెట్టి, శారీరక శ్రమపడి వాళ్లెంత చేసినా మీకు మెప్పులేదు. అందమ్మా మా కోడలు మహారాణి' అంది భారతమ్మ తన అక్కసు వెళ్లబోసుకుంటూ.

"అత్తగార్నయినా చూడకుండా అంతమాట అందీ!!" అంది వరలక్ష్మి.

"ఎంతమాటలయినా అంటారమ్మా ఈనాటి కోడళ్లు. వాళ్ల మొగుళ్లు సంపాయిస్తు న్నారు. మనం తేరగా వాళ్ల సంపాదన తింటు న్నాం. అసలడుగుతా మన కొడుకులు కా కుండానే వాళ్ల మొగుళ్లయారా? మా కోడలు మాత్రం దాని విరగబాటు, శాణాతనం ఏం చెప్పనులేమ్మా. కడుపు చించుకుంటే కాళ్లమీద పడ్తుంది'' అంది భారతమ్మ.

"నిజమేలే భారతమ్మా! ఇవెప్పుడూ వుండే వే. మనం సత్కాలక్షేపం చేద్దామని కూర్చుని ఈ సంసారిక బాధలను గూర్చి కబుర్లాడుకోవ టమెందుకూ'' అంది రంగనాయకమ్మ.

"అంతేలే వదినా... ఇవాల్టికింకా అన్నమా చార్యుల కీర్తనల్ని విన్పించు''

'ఎప్పుడూ వుండేవిట... తనేం బాధలు పెడ్తోంది ఈవిణ్ణి. ఈవిడేం చెప్పుకుంటుందో వీళ్లకు తను వినకుండా. లేకపోతే వాళ్లంతా ఈవిడకెందుకు విన్పిస్తారు తమ సొద తమ కోడళ్ల సొదా?' అనుకుంది కాళింది.

"శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావాలనే పంచవిధ భక్తి రూపాలున్నాయి. అన్నమాచార్యులు అన్ని రకాల భక్తిప్రపత్తుల తోను ఆ వేంకటేశ్వరుణ్ణి, ఏడుకొండలవాడిని కొల్చాడు. పరాభక్తి యొక్క ప్రప్రథమ రూప మే శాంత భక్తి అంటారు. ఆత్మలోనే భగ వంతుడిని దర్శించాడు అన్నమయ్య.
'నిత్యాత్ముడైయుండి నిత్యమై వెలుగొందు
సత్యాత్ముడైయుండి సత్యమైతానుండు'
అంటూ శాంత భక్తినీ
'నేనైతే ఈడేరుదు, నీకు లీలా మాత్రమింతే
మానక నన్నేలు కొమ్ము మాధవ గోవిందా
ఇందరిపై సూర్యుండు ఎండల గాసించేను
అందుకొన్ని కిరణాలు అణగిపోయెనా'
అని దాస్యభక్తినీ సూచించాడు అన్నమయ్య. ఆ పరమాత్ముడే యజమానిగా తాను బంటు గా భావించి ఆ దేవుణ్ణి కొలవటమే దాస్యభ క్తి..."

అలా రంగనాయకమ్మ భక్తిని గూర్చి మిత్ర బృందానికి చెప్తూండగానే భారతమ్మ లేచి "చినుకులు పడుతున్నయ్యక్కయ్యా! గుడ్డలు బయట ఎండవేశాను. వర్షం పెద్దదయితే తడిసిపోతాయేమో'' అంది.

"కూర్చోవమ్మా! నీ కోడలు చేస్తుందిలే. నువ్వీ కాస్తపనికి హడావుడి పడ్తూ ఇంటికెళ్లాలా'' అంది కామేశ్వరి.

"ఆఁ ఆవిడ తీసీ, నేను చూసీ... నీకు తెలీదులే కామేశ్వరీ నా కోడలు సంగతి. దానికేవీ పట్టదు'' అంది భారతమ్మ హడావుడి పడి వెళ్తూ.

అప్పుడు రంగనాయకమ్మకు గుర్తుకొచ్చింది. తను దొడ్లో బట్ట మీద వడియాలు పెట్టిన సంగతి "అవును, నేనూ మర్చిపోయాను. ఎండిపోయి వుంటాయి. తీయకపోతే తడిసి పోతాయి'' అంటూ "అమ్మాయి కాళిందీ... కాళిందీ!" అని పిల్చింది రంగనాయకమ్మ.

కాళింది మెళకువగానే వుందిగానీ పలకలేదు.

మరో రెండుసార్లు, "కాళిందీ, కాళిందీ..." అని అత్తగారు పట్టువదలకుండా పిలవటంతో వళ్లుమండిపోయింది కాళిందికి.

"ఆఁ ఏంటీ?" అంది మరి తప్పక గదిలో నుండే.

"దొడ్లో వడియాలబట్ట తీయమ్మా! వానవచ్చింది. తడిసిపోతాయేమో'' అంది రంగనాయకమ్మ.

కాళిందికి మండిపోయింది. 'తనిప్పుడు పనిబడాలేచి ఆ వడియాలబట్ట తీయాలి కాబోలు. తనింత కష్టపడితే తింటానికి తయారు అత్తా, అత్త సంతానం' అనుకుని పక్కమీద నుండి లేవలేదు ఆమె.

"అమ్మా! హాయిగావుంది. ఈ వానతో కాస్తంత వాతావరణం చల్లబడింది. భగవంతుడి వాత్సల్య వృష్టిలావుంది ఈ వాన" అంటూ

'జో అచ్యుతానంద జోజో ముకుందా
రావె పరమానంద రామ గోవిందా'

అని పాడసాగింది రంగనాయకమ్మ.

"లాలి పాట పాడుతున్నావేం వదినా'' అనడిగింది సుభద్ర.

"లాలిపాటే, ఇదీ అన్నమయ్య కీర్తనే. ఈ పాటలో ఆయన వాత్సల్యభక్తిని కురిపించాడు. భగవంతుని పుత్ర భావంతో ప్రేమిస్తూ తానే యశోదగా, తన బిడ్డ దైవంగా ఊహించుకుంటూ ఆ చిన్ని కృష్ణుని కొలవటమే వాత్సల్యభక్తి, ఇలాంటి వాత్సల్య భక్తిని ప్రకటించే పాటే 'ముద్దుగారే యశోద ముంగిట ముత్యము వీడూ
దిద్దరానీ మహిమల దేవకీ సుతుడు' అన్న కీర్తన కూడా''

అలా సాయంత్రం సుమారు నాలుగు గంటలవేళకు ఈ పురాణ కాలక్షేపమ్మై, మరదల్నీ, పొరుగువాళ్లనూ పంపించి తను దొడ్లోకెళ్లేటప్పటికి కనిపించిన దృశ్యం చూసి నిర్ఘాంతపోయింది రంగనాయకమ్మ. ఏ మూలో పొడసూపిన కోపాన్ని అణిచేసుకుందామె. నేలమీద వడియాలబట్ట బురదనీళ్లలో తేలుతోంది.

అప్పుడే వంటింట్లోకి రాబోతున్న కోడల్ని చూసి అడిగింది వద్దనుకుంటూనే రంగనాయకమ్మ, "వడియాలబట్ట తీయలేదుటమ్మా! చూశావుగా, అన్నీ వానకి తడిసి పనికిరాకుండా పోయాయి'' అంది.

"తీద్దామనే అనుకున్నాను. అంతలోనే నిద్ర పట్టింది'' అంది కాళింది.

"అదేం... పగటిపూట అంత నిద్రేమిటమ్మా!"

"నిద్ర రాకేం చేస్తుంది, మీరు జోలపాటలూ, లాలిపాటలూ పాడుతుంటే''

ఆ రోజు రాత్రి భర్తకు చెప్పింది కాళింది, అత్తగారి నిర్వాకం.

"అమ్మో! మీ అమ్మగారి భక్తండీ చెప్పుకోవాల్సింది. అదెప్పుడో పాత సినిమా 'చక్రధారి' సినిమా చూశాను. అందులో కుమ్మరి ఐన భక్తుడు మట్టిని కాళ్లతో మర్దిస్తూ భక్తి పారవశ్యంలో దగ్గరికొచ్చిన పసిపాపడైన కొడుకుని కూడా చూసుకోకుండా మట్టిలో కలిపి తొక్కేసి చంపేస్తాడు. మీ అమ్మ గారిదీ అంత భక్తి!!" అంది కాళింది.

"ఏం ఏమయింది?"

"ఏవుంది, కావటానికి. పొద్దుననగా లేచి ఆపసోపాలు పడ్తూ రెండుశేర్ల మినపప్పు రుబ్బి వడియాలు పెట్టిందా. అవి దొడ్లో ఎండకెండుతున్నాయ్యి, ఇక్కడ మధ్యాహ్నం వరండాలో ఈవిడ పురాణం సంతపెట్టింది. వానొచ్చింది. ఉరుములు మెరుస్తున్నాయి, పిడుగులు పడ్తున్నాయిగానీ, ఈవిడ వడియాలు చూసుకునే తీరిక లేని భక్తి పారవశ్యంలో వుంది. అన్నీ వానలో తడిసి మట్టిగొట్టుకుపోయాయి. అంతా చుట్టచుట్టి పెంటదిబ్బలో పారేసింది. పదార్థం దండగ, డబ్బు దండగ, శ్రమ దండగయ్యాయి''

"ఆవిడకీ పిచ్చి కొత్తదికాదులే. మహానుభావుడు మాతాతయ్యే అంటించిపోయాడు. సరే, ఇంతకీ నువ్వేం చేస్తున్నావు. నువ్వు తీయెచ్చుగా'' అన్నాడు శేషశయనాచార్యులు.

"బాగుంది. ఆ వడియాలకు నేనెక్కడ కాపలా కూర్చోను. నిద్రపోయాను. మెళకువేరాలేదు''

"ఏం అంత మొద్దునిద్ర"

"ఎప్పుడో కుదరక కుదరకోరోజు పడ్తుంది. ఆవాళే ఇలాంటి అవాంతరాలన్నీ ముంచుకొస్తాయి. పగలావిడ గోల, రాత్రి మీ గోల నిద్రంటే మొహం వాచాను''

అలా రెండో సూత్రం సఫలం కాగానే, మూడో సూత్రం అమలుపెట్ట నిర్ణయించుకుంది కాళింది. అందుకు మొదటి భూమికగా గృహ యాజమాన్యాన్ని తనచేతిలోకి తీసుకోవటం సరైన పని అనుకుందామె. సంసారాన్ని అదుపులో పెట్టాలంటే రెండు చిట్కాలున్నాయి. వంటిల్లును హస్తగతం చేసుకోవటం, రెండోది డబ్బు ఖర్చుపెట్టటం. మొదటిది గౌణమైంది. రెండోది ప్రధానమైంది. పైగా మొదటి దాంట్లో కొంత అసౌకర్యం కూడా కన్పించింది కాళిందికి. అత్త గుంపుకి వండి వడ్డించి, సాపాట్లు మేపటం ఆమెకంత బాగనిపించలేదు. ఇంట్లో ఏ పనీ లేకుండా వున్నావిడ అత్తగారు ఆ పని చేస్తుంది గనుక, ఉమ్మడి కుటుంబంలో వున్నంత వరకూ వంటింటికి విడాకులివ్వాలనే ఆలోచన చేసింది ఆమె. అయితే వంట ఇంటినీ, మొత్తం కుటుంబ ఆదాయవ్యయాన్ని తన గుప్పిటలో పెట్టుకుంటే యాజమాన్యం తనకొచ్చేసినట్టే అని భావించింది కాళింది. "ఇహ మీదట జీతం తెచ్చి నా కివ్వండి. నేను అవసరాలకి ఖర్చు చేస్తాను, మరీ కొంపలో దుబారా అయిపోతోంది. మీ నాన్న వచ్చాడంటే చాలు ఇంటికి! మీ అమ్మకిహ వళ్లు తెలియదు. ఆయనున్నన్ని రోజులు పిండివంటలూ, ఆర్భాటం, హడావుడి. మర్నాటి నుండి కూటిలోకి చారునీళ్లు తప్పగతుండదు'' అంది భర్తతో కాళింది.

శేషశయనాచార్యులకు ఆమె మాటలు నచ్చాయి. తల్లికీ, తమ్ముడికీ కూడా చెప్పేశాడు, తండ్రి పంపే డబ్బూ, తమ్ముడి జీతమూ కూడా తన భార్యకివ్వమని.

ఇంటి యాజమాన్యం ఆమె చేతికి వచ్చినప్పటినుండీ ఇంటికి సరుకులు తేవటం సగానికి సగం తగ్గించిపారేసింది కాళింది. మామగారు వచ్చినప్పుడు కూడా చారు నీళ్లకంటే మేలైన పదార్థం అత్తగారు చేయనీయకుండా చేసింది. రంగనాయకమ్మకది కష్టమనిపించింది. పాపం, నరశింహాచార్యులు నెలల తరబడి హొటళ్లలో తిని, జిహ్వ చచ్చిపోయి, భార్యపెడ్తే తిందామని వస్తే ఇక్కడా ఆ సాంబారు, చారుకూడే గతి అయింది. ఓ రోజు ఆయనొచ్చినప్పుడు...

"ఏవిటే నీ బొందకూడు! తింటానికేమీ చేసి చావలా'' అని మృదువుగా అడిగాడు నరశింహాచార్యులు భార్యని, భోజనం చేస్తూ.

రంగనాయకమ్మేం మాట్లాడలేదు. ఉలికి ఉలికి చూసింది కాళింది భర్తవంక.

"ఇంతకంటే ఏం వస్తయ్యి నాన్నా! నువ్వు పంపేడబ్బుకి'' అన్నాడు శేషశయనాచార్యులు.

"ఏడ్చావులేవోయ్! ఇవాళ చెప్తున్నావు. నే

నేం పెట్టకపోతేనే ఇంతవాళ్లయ్యారా మీరు? తల్లికీ, తండ్రికీ పెట్టటానికి ఏడ్చే వెధవల్ని మిమ్మల్నే చూశాను'' అన్నాడాయన కోపంగా.

శేషశయనాచార్యులేదో బదులు చెప్పబోతే రంగనాయకమ్మ అంది. "నువ్వు మాట్లాడ కురా శేషూ! రాకరాక వచ్చిన మనిషితో మాట్లాడే తీరిదేనా?'' అని.

"తనంతైన కొడుకుల్తో మాట్లాడే తీరదే కాబోలు. తన కాలి చెప్పులు కొడుక్కు సరిపో యాక కొడుకుని స్నేహితుడిలాగా చూడాలని మా నాన్న చెప్తూంటాడు'' అంది కాళింది వంట గదిలో గుమ్మం పక్కన నిలబడి, సన్నాయి నొక్కులు నొక్కుతూ.

"ఛా! ఆడపెత్తనం, తంబళదొరతనమని



ఊర్కే అనలేదు. ఈ ఇంటికి ఆడపెత్తనం వచ్చేసింది. ఇంక కుండ పగలటానికెక్కువ రోజులు పట్టదు. ఓరే పెళ్లాంచాటు వెధవా! వాజమ్మా! మన వంశానికప్రదిష్ట తెస్తున్నావు కదరా! మీ తాతపోలిక వచ్చి ఏడ్చిందేమిట్రా? ఇదుగో విను, నేనిక్కడున్నన్ని రోజులు కోడలి మాటలు నాకు వినపట్టానికి వీల్లేదు. ఏవన్నా చెప్పదల్చుకుంటే నువ్వు చెప్పుగానీ, ఇలా గోడచాటు మాటలు విన్పించకు'' అన్నాడు నరశింహాచార్యులు.



శేషశయనాచార్యులకు కోపం వచ్చింది. తినే కంచంలో చెయ్యి కడుక్కుని లేచి వెళ్లిపోయాడు. ఆ రోజు రాత్రల్లా భార్య హితబోధ చేసింది శేషశయనాచార్యులకు. మర్నాడు తండ్రి ఊరికి వెళ్లిపోగానే మేనమామను పిల్చి పంచాయితీ పెట్టాడు.

"ఇహ నేనీ కొంపలో వుండలేను మామయ్యా! ఆయనంతయ్యాం మేమూ. ఎంత మాట పడ్తే అంత మాట అంటాడా. అన్ని కూతలు కూస్తుంటే అమ్మ కూడా కిమ్మనకుండా కూర్చుంది. ఆడపెత్తనమంట. అంటే ఆయన ఉద్దేశం అదేగా! తనింట్లో వుండగా అది మాట్లాడకూడదట. ఈ శాసనాలన్నీ ఎవడు పాటిస్తాడు నేనెళ్లిపోతాను. ఈ మాత్రం సుఖంగా వుండకపోను'' అన్నాడు శేషశయనాచార్యులు.

"నేననకపోవటమేంట్రా? అంతలేసి మాటలు ఎక్కొచ్చిన కొడుకుల ననొచ్చా అని అంటేనేకదా మీ నాయన రెండు రోజులుంటానికొచ్చినవాడు పొద్దున్నే లేచిపోయింది కోపంతో'' అంది రంగనాయకమ్మ.

"ఏం కోపమమ్మా ఇహ నా వల్లకాదు ఈ సంసారం ఈదటం" అన్నాడతను.

"పెద్ద ఘనకార్యం చేస్తున్నావు లేవోయ్ మహా! ఇంక మాట్లాడకు, ఎవడయినా వింటే నవ్విపోతాడు. మీ నాయన కాపురం ఎట్టా చేశాడో నీకు తెల్సు. నువ్వు సంపాదించటం మొదలెట్టింతర్వాతేగా మీ కుటుంబం కొంతకు దుటపడింది. ఇవాళ నీ స్వార్థం నువ్వు చూసుకు వెళ్లిపోతే మళ్లీ సంసారం మొదటికొస్తుంది. మీరసలు మీ అమ్మను సుఖంగా బతకనివ్వరుట్రా! చంపెయ్యి ఫీడాబోతుంది. ఆయన నిర్వాకం అంత చేసినా, రేపు కొడుకు ఎక్కొచ్చి తన్నేమో ఉద్ధారిస్తాడని వాళ్లకాళ్లూ, వీళ్లకాళ్లూ పట్టుకుని నీకు నాలుగు ముక్కలు చెప్పిస్తే నీకివాళ అమ్మా, తమ్ముళ్లూ ఎక్కసమైపోయారు. ఆనాడు బోధన్‌లో కోమటికొట్లో గుమాస్తా అయితే నీపని మహా బాగా వుండేది. మీ నాన్న సరే తిక్కముండాకొడుకే. జిహ్వ చవి చచ్చి కొంపకొచ్చినప్పుడు రుచిగా నాలుగు పదార్థాలు చేసుకుంటే నీ సొమ్మేంపోయిందిరా. అంత అంటకాచి వాతపెట్టటమెందుకూ? పొదుపంటే దుబారా ఖర్చులు పెట్టుకోకూడదనిగాని, అవసరమైన ఖర్చులు పెట్టుకోగూడదనికాదు. సరే, ఐపోయిందేమో అయిపోయిందిగానీ, ఇంక వేరు కాపురం పెడ్తానని మాత్రం అనకు'' అని మేనమామ ముక్క చీవాట్లు పెట్టేటప్పటికి భార్య ఉపదేశంవల్ల వచ్చిన ఆవేశమంతా నీరుకారిపోయింది శేషశయనాచార్యులకు.

అందుకనే ఆ రోజు రాత్రి కాళింది, "ఎందుకూ పనికిరారండీ మీరు!" అన్నా కిమ్మనకుండా వుండిపోయాడు శేషశయనాచార్యులు. మొద్దుబారిన కత్తికి పదును పెట్టగల సామర్థ్యం వున్న ఆడది కాళింది. తన ప్రయత్నం విడనాడలేదు.

అంతగోలయినా కాళింది ఇంటి ఖర్చు మీద విధించిన పగ్గాలకు సళ్లివ్వలేదు.

ఓ నెల...

విఠలాచార్యులు జీతం యాభై రూపాయలే తెచ్చిచ్చాడు.

"అదేం విఠలూ! పాతిక రూపాయలు తగ్గిందేం నీ జీతం" అనడిగింది కాళింది.

"నైటు కాలేజీలో సీటు వచ్చింది వదినా! ఆ పాతిక రూపాయలూ ఫీజు కడ్దామని వుంచుకున్నాను'' అన్నాడు సంజాయిషీ చెప్తూ విఠలాచార్యులు.

"అవును బాగానేవుంది. మీరు బియ్యేలు, ఎమ్మేలు చదువుతూ వుండండి. మీ అన్నగారు వళ్లు విరుచుకుని అరవచాకిరీ చేసి సంసారాన్ని గడుపుతారు. ఆయన పైకి చదువుకోలేకనా మానేసింది. మామగారేమో అట్టా, మీరేమో ఇట్టా! అంటే నా నోరు బయటపడ్తుందిగానీ, నెలకోసారి వచ్చి వారం రోజులు తిష్టవేస్తాడు కదా మీనాన్నగారు! సంసారం మనదికదా, దీన్ని లాక్కురావాల్సిన బాధ్యత

మందికదా అన్న ఇంగితమేమయినా వుందీ ఆయనకు! పోనీ వచ్చేటప్పుడయినా ఓ రెండు మూడొందలు తెచ్చి కొడుక్కిద్దామన్న గ్ర హింపుందీ ఆయనకు? ఇహ మీరు చూస్తే ఇట్టా. ఇంకా ఆ వెంకయ్యగారు వున్నారు. ఆయన ఎన్నాళ్లికీ ఆ ఎస్సెస్సీ గట్టెక్కేదిలేదు. ఆయన ఉద్యోగం చేసి సంపాదించేదిలేదు. నువ్వు మాత్రం చదువుకోవాలి. రంగనాధం చదువుకోవాలి. ఆడపిల్ల అలివేలుమంగా చదు వుకోవాలి. మేం మాత్రం మట్టి కొట్టుకుపోతాం. నావల్ల కాదు బాబూ ఈ డబ్బు యాజమా న్యం. మీరే చూసుకోండి. ఏమన్నా అంటే వదిన ఇలా అందని అందరూ అనుకుంటా రు'' అంది కాళింది మరిదిని జాడిస్తూ.

మూడో సూత్రం పొరపాటున మామగారి మీద ప్రయోగించి, మిస్ ఫైరయి తన మీదే బాంబు పడటంతో, డైరెక్ట్‌గా అత్తగారి మీద అవి ప్రయోగించ శంకించి, ముందుగా చిన్న జీవమైన మరిదిని తన వేటకు లక్ష్యంగా ఎంచుకుంది కాళింది. అత్తగారి రియాక్షన్ పట్టి తరవాతి పథకం వేసుకుందామని అనుకుంది కాళింది.

"ఇంతకీ ఏమంటావమ్మా?" అన్నాడు విఠ లాచార్యులు.

"నేననేదేముంది. ఇంటికి పెద్ద మీ అమ్మగా రు వున్నారుగా. ఆమెనడుగు''

"పోన్లే చదువుకుంటానన్నవాడిని ఆపట మెందుకూ, చదువుకోనీరాదటమ్మా'' అంది రంగనాయకమ్మ.

"చదుకోనివ్వండి, మధ్య నాదేంపోయింది. అందరూ చదువుల సరస్వతులే ఈ ఇంట్లో. మొద్దుమొహాన్ని నేనే. ఎందుకూ పనికిరానిదా న్ని పొట్టకోస్తే అక్షరం ముక్కరానిదన్నీ''

"నిన్ను చదువుకొనలేదని ఎవరన్నారమ్మా ఇప్పుడు'' అంది రంగనాయకమ్మ విస్తుపో తూ

"ఎందుకనలేదు. పెళ్లిచూపులకొచ్చినప్పు డు ఏం చదివావమ్మా అని మీరడిగితే నేను ఎనిమిదో క్లాసుదాకా చదివానంటే మీరేమన్నా రూ! 'అయ్యో ఎచ్చెస్సీ కూడా పాసవలేదా? అనలా? అంటే అర్థం నా చదువు మీకు పనికి రాలేదనేగా. నేనూ బాగా చదూకుంటే ఎచ్చె స్సీ పాసయి గుమాస్తా నౌకరీ చేసుకునే ఆయ న్ని చేసుకునే గతి నాకెందుకు పట్టేదీ. నా ఖర్మకాలి ఈ ఇంట్లో పడ్డాను. అక్కడికీ మీకు మహాపేరు మహా పండితురాలని. ఎంత పాండిత్యం వుంటే మాత్రం ఏం లాభం, సంసారం చేసుకునే తెలివితేటలు లేకపో యాక"

ఈ మాటలతో రంగనాయకమ్మకు మన సులో కష్టమేసింది. ఇవాళ కోడలొచ్చి తన అప్రయోజకత్వాన్ని ఎత్తి చూపటంతో మనసు ఛిన్నాభిన్నమైనట్లయింది ఆమెకు. "పోన్లే నా యనా! ఇప్పుడా చదువు చదవకపోతేనేం మానెయ్యి. ఇప్పుడేదో ఉద్యోగం చేస్తూనే వున్నావుగా'' అంది రంగనాయకమ్మ.

విఠలాచార్యులు జేబులోనుండి ఆ పాతిక రూపాయలు తీసి వదిన గారిదగ్గరకు విసిరేసి ఇంట్లోనుండి వెళ్లిపోయాడు.

"చూశారుగా ఆ పొగరు, అహంకారం! అన్నం పెడ్తూంటే తింటున్నవాడు, వదినకదా వయసులో కాకపోయినా హోదాలో పెద్దది అనే గౌరవమేమయినా వుందీ. డబ్బును లక్ష్మీ దేవిని అలా విసిరేసిపోతాడా! అంత అలక్ష్యం కనుకనే కొంపలో డబ్బు నిలవకుండా వుంది. మా నాన్న అంటూవుంటాడు 'డబ్బు శ్రీలక్ష్మి అమ్మా! అదంటే భక్తుంటేనే, కాపాడుతుంటే నే అది మన దగ్గరుంటుంది. లేకపోతే పారిపో తుంది. డబ్బు విషయంలో మాత్రం జాగ్రత్తగా వుండాలమ్మా' అని. చూశానుగా ఈ ఇంట్లో డబ్బంటే ఎవరికీ లక్ష్యంలేదు. ఎందుకొచ్చిన చదువుల్ల, ఊళ్లేలనా, ఉద్ధరించాలనా? వచ్చిన సంపాదనతో నెలకింతని వెనకేసుకుంటూ గు ట్టుగా కాపురం చేసుకోవాల్సిందిపోయి, చదు వులూ చట్టుబండలూ అని డబ్బు తగలేసుకోట మెందుకు? ఈయన బియ్యేలు, ఎమ్మేలు చదివి మమ్మల్ని ఉద్ధరిస్తాడు కాబోలు. పెద్దవా

ళ్లకయినా బుద్ధుండాలి. ఒకరికి ఊళ్లకొలువు, మరొకళ్లకి భక్తి పారవశ్యం. ఎవరికి పట్టిన కొంపిది'' అంటూ జాడించేసింది కాళింది అంతూపొంతూ లేకుండా, రంగనాయకమ్మ తననేం అనదన్న జ్ఞానోదయం కలగగానే.

అలా అన్నం మెతుకు పట్టుకు చూశాక, అత్తగారు ఉడికిపోతుంది అని తెల్సిన తరువాత ఆమె ధాటికి అదుపు లేకుండాపోయింది.

ఆరోజు మళ్లీ రంగనాయకమ్మ మనసు కృష్ణ విగ్రహంపై పోయింది. చదువుకుంటానన్న వాడికి చదువు చెప్పించలేని తన అశక్తతపట్ల ఆమె మనస్సు ప్రిదిలిపోయింది. కోడలు అన్ని మాటలు అన్నతర్వాత ఆ విగ్రహంలో రెండో భాగం అమ్మిదామన్నంత ఆవేశమొచ్చింది ఆమెకు.

పొద్దున్నే తమ్ముడొచ్చి తనకావార్త చెప్పిందాకా ఆమె మనసు కుదుటపడలేదు.

"వితలుడికి పొద్దునపూట అకౌంట్లు రాసే పని చూశాను. వాళ్లో పాతిక ముప్పయి రూపాయలిస్తారు. మరి కష్టపడాలి. పొద్దుటి నుండి సాయంత్రంవరకూ. ఏరా చెయ్యగలవా అన్నాను. చేస్తానన్నాడు. వాడు చదూకోటానికి ఇబ్బంది అవుతుందని నువ్వు బాధపడకు'' అన్నాడతను.

ఆమె ఆ బాలకృష్ణుడికి మొక్కింది. తను స్వార్థాన్ని గురించి ఆలోచించినప్పుడల్లా ఆయనే తన్ను కాపాడుతున్నాడు.

'వయమేవ విశ్వసిమః కరుణాకరమూర్తి
కిం వదన్త్యంగే
అపిచ విభో తవ లలితే, చపలతరా మతి
రియం బాల్యేః
కృష్ణా! కరుణాకరమూర్తివనే నీ కీర్తి శరీరముపట్ల నాకు నమ్మకం వుందికాని, నీ లలితమైన బాల్య శరీరమందే నాకు మక్కువ' అని గొణుక్కుంది రంగనాయకమ్మ.

సంవత్సరానికో నగ చేయించుకునేది కాళింది. పుట్టింటి నుండి వచ్చి అత్తగారికి చెప్పేది "మా అమ్మావాళ్లు చేయించారు'' అని.

"ఆహాc" అనేది రంగనాయకమ్మ, మరేం తర్కించకుండా.

మరోసారి...

ఆండాళ్లుకు రెండో పురిటికి తీసుకు రావాల్సిన సమస్యవచ్చింది. అక్కడ ఆమె అత్తగారికి వంట్లో బాగుండటంలేదట. ఆమె చెయ్యలేదట. డబ్బు మేం పెట్టుకుంటాం, పురుడు పొయ్యగలరా' అని రాసింది ఆండాళ్లమ్మ. తల్లి తనకావిషయం చెప్పగానే భార్యని పిల్చి, "అమ్మ ఆండాళ్లును పురిటికి తీసుకు రావాలనుకుంటోంది. ఆసుపత్రి ఖర్చు వాళ్లే పెట్టుకుంటారట. మరి నువ్వేమంటావు'' అనడిగాడు శేషశయనాచార్యులు.

"అయ్యో నేననేదేముంది, తల్లీ కొడుకులు సంప్రదించుకున్నారుగా, తెచ్చుకోండి. మామగారికో ఉత్తరం ముక్క రాయండి పురిటి ఖర్చులకు ఓ రెండొందలు పంపమని. ఆసుపత్రి ఖర్చులు పెట్టుకుంటే అయిపోయెనా, ఇంకా పైనెంత ఖర్చుంటుందనీ'' అంది కాళింది.

శేషశయనాచార్యుల ఆఫీసులో నల్గురైదుగురు కలిసి నగర పరిసరాల్లో ఎకరాలుగా స్థలాలు కొని ప్లాట్లు వేసి అమ్మే ఆలోచన చేస్తే వాళ్ళతో తనూ భాగస్వామిగా చేరాడు అతను. కావాల్సిన పెట్టుబడి, కొంత జీతంలో లోను తీసీ, మామగారిదగ్గర అప్పుచేసీ పెట్టాడు. తను ప్రభుత్వోద్యోగి కనుక వ్యాపారం భార్య పేరున నిర్వహించసాగాడు. వచ్చే లాభాన్ని బాంకులో దాచుకుంటోంది కాళింది. భార్యాభర్తలిద్దరూ ఆ విషయం గోప్యంగా వుంచుకున్నా రంగనాయకమ్మ దృష్టికి రాకుండా పోలేదు. ఆండాళ్ళును పురిటికి తీసుకురావటానికి దంపతులు డబ్బువంక చెప్తున్నారని అనుకున్న రంగనాయకమ్మ అంది, "అదేదో స్థలాల వ్యాపారం చేస్తున్నావటకదరా! చెల్లెలు పురుడు పోయటం కూడా కష్టమేనా?'' అని.

ఆ మాటతో పిచ్చెక్కిపోయింది కాళిందికి,

"మనం పెట్టనూపెట్టం అడుక్కుతిననివ్వ మూ అన్నట్టుంది మీ అమ్మగారు చెప్పేది. మా నాన్న అప్పిస్తే మదుపుపెట్టి వ్యాపారం చేస్తున్నారుకాని, ఎవరి దిష్టితగిలిందో ఆ ప్లాట్లు అమ్ముడుపోవటమేలేదు. అవి అమ్ముడుపో యేదెప్పుడు వాటిమీద లాభాలొచ్చేదెప్పుడు. వ్యాపారం చేస్తున్నారటకదా అని ప్రతివాళ్ళూ అడిగేవాళ్ళే. మొన్నమీరన్నా, మీ మామయ్య కూడా అడిగాడని. వార్తలు ఎట్టా వ్యాపిస్తయ్యో అర్థంకాదు. దానికోసం ఎంత కష్టపడ్డదీ, ఎవరి దగ్గర ఎంత అప్పుచేసిందీ ఎవరికి తెల్సు. లాభాలో... లాభాలో అని జనఘోష పడిపో యింది. తెచ్చుకోండి మీ అమ్మాయిని. ఇప్ప టికెంతో నష్టపడ్డాం, కష్టపడ్డాం. అదీ అయిందని పిస్తాం" అని నోరు పారేసుకుంటూ లోపలికె ళ్ళిపోయింది కాళింది.

భార్య అంత గోల పెట్టినా, తల్లి అంత బాధపడుతున్నా పట్టనట్టు ఉండిపోయాడు శేష శయనాచార్యులు.

"మరేమంటావురా శేషూ'' అనడిగింది రంగనాయకమ్మ ఏం తోచక.

"అది చెప్పిందిగా పిలిపించు. ఒరే వెంక న్నా! వరంగల్లు వెళ్ళి అక్కయ్యను తీసుకురా. సాయంత్రం డబ్బిస్తాను'' అన్నాడు శేషశయనా చార్యులు లేవబోతూ.

"వద్దులే నాయనా, నీకంత కష్టంగా వుంటే. మావల్ల కాదు, పురుడు మీ అత్తగా రింట్లోనే పోసుకోమని రాస్తానులే' అంది రంగ నాయకమ్మ.

"ఎందుకమ్మా పిలిపిస్తానంటినిగా''

"నా గోల పడలేక పిలిపిస్తానంటున్నావు గాని, చెల్లెలిమీద నీకేం మమకారం లేదుగా. నువ్వు బాగా మారిపొయ్యావురా శేషూ'' అంది రంగనాయకమ్మ నిష్టూరంగా.

"నేనేం మారిపోయానమ్మా! నేను నీ ఎప్పటి శేషూనే. ఇదివరకు ఎట్టాంటి చొక్కా పాంటూ వేసుకుంటున్నానో, ఇప్పుడూ అలాంటివే వేసుకుంటున్నాను. నేనెప్పటికీ రంగనాయకమ్మ కొడుకునే. వ్యాపారం, ఐశ్వ ర్యం అంటావా, అది దాంది. అదొచ్చినప్పటి నుండే నాకు కొంత వెసులుబాటయింది. ఇదు గో ఈ వ్యాపారం మొదలెట్టాను. సీతాఫల్ మండీలో స్థలముందికదా! దాంట్లో రెండు గదులు పెట్టి, ఇల్లు వేస్తున్నాను. మళ్ళీ నువ్వు చెప్పలేదంటావు కనుక చెప్తున్నాను. అది పూర్త వ్వగానే ఐదారు నెలల్లో మేమక్కడికి వెళ్ళిపో తాం. విఠలు ఎలాగో సంపాయిస్తున్నాడుకదా! నాన్న పంపే డబ్బుతోఎలాగో గడుపుకోండి. నేను పూర్తిగా బయటకెళ్ళిపోతున్నాననుకోకు. పైనుండి చూస్తూనే వుంటాను. ఏదో చెయ్యగ లిగింది చేశాను. నా సంగతి నేను చూసుకోవా లికదా! దానికిప్పుడు నాలుగోనెల. ఆడపిల్ల పుడ్తే ఎంత కట్నమివ్వాలో, పెళ్ళేలా చె య్యాలో అని ఇప్పటినుండే దిగులు పడ్తోంది. అంతేకదమ్మా మరి. నిరాధారంగా వచ్చినవా ళ్ళం, ఏదో ఆధారం ఏర్పరచుకోపోతే ఎలా?" అంటూ మెత్తగా తను చెప్పదల్చుకున్న మాట లన్నీ చెప్పేశాడు శేషశయనాచార్యులు.

నిర్ఘాంతపోయి వింటూ కూర్చుంది రంగనా యకమ్మ.



శేషశయనాచార్యులు ఉమ్మడి కుటుంబంలో నుండి విడిపోయే సమయానికి విఠలాచార్యు లుకు ఇరవైమూడేళ్ళు. దీక్షగా పనిచేసి నైటుకా లేజీలో బి.ఎ. అయిందనిపించాడు. అతనిది ప్రైవేటు ఉద్యోగం అవటంవల్ల జీతం తక్కువ వటంవల్లా మళ్ళీ రంగనాయకమ్మ సంసారం

మామూలుకొచ్చింది. అయినా అతనిలో అంత స్వార్థం లేకపోవటంవల్లా, డబ్బుకు ఇబ్బంది పడ్డా, ఓరకమైన మనశ్శాంతిని అనుభవించింది రంగనాయకమ్మ. వెంకటాచార్యులు ఎస్సెస్సి పాసవటం గగనమైపోయింది. పరీక్షకు కూర్చుని కూర్చుని అతనికి విసుగొచ్చింది. చివరకు ఆర్మీలో రిక్రూట్‌మెంట్ జరుగుతుందని తెల్సి అక్కడ పరీక్షకు హాజరయితే సెలక్ట్ అయ్యాడు. అతన్ని మొదటగా రాజస్థాన్‌లో పోస్ట్‌చేశారు. వెంకటాచార్యులు ఆర్మీలో జాయినయిన తర్వాత అప్పుడప్పుడూ డబ్బు పంపుతూవుండేవాడు. "నెలకింతని పంపరా'' అని రంగనాయకమ్మ ఉత్తరం రాసినా అతను జవాబు రాసేవాడు కాదు.

'నరశింహాచార్యులకు అనారోగ్యంగా వుంది. ఆసుపత్రిలో చేర్పించాలి' అని కంపెనీ వాళ్ళదగ్గరనుండి టెలిగ్రాం వస్తే పెద్దకొడుకులిద్దరూ కామారెడ్డి వెళ్ళారు. విపరీతమైన బ్లడ్‌షుగరూ, బ్లడ్‌ప్రజర్‌తో స్పృహతప్పిపోతే, కంపెనీవాళ్ళే నరశింహాచార్యులను కామారెడ్డి ఆసుపత్రిలో చేర్పించారు. కొడుకులిద్దరూ వెళ్ళేటప్పటికే చాలావరకు కోలుకున్నాడు ఆయన.

"ఈయన్ని జాగ్రత్తగా చూసుకోండి. మళ్ళీ ఇంత బ్లడ్‌ప్రెజరొస్తే అది బ్రైనుకు కూడా ఎఫెక్టు ఇవ్వవచ్చు. బ్లడ్‌షుగర్ కూడా కంట్రోల్‌లో వుండాలి. మందులు జాగ్రత్తగా వాడాలి'' అని డాక్టర్లు జాగ్రత్తలు చెప్పి నరశింహాచార్యులను డిశ్చార్జి చేశారు.

నరశింహాచార్యులు ఇంటికొచ్చిన నెలరోజుల్లో తిరిగి ఆరోగ్యాన్ని పుంజుకున్నాడు. మళ్ళీ ఉద్యోగంలో జాయినవుదామన్న ఆలోచన రానివ్వలేదాయన. సుష్టుగా తిని తిరగటం సాగించాడు. రంగనాయకమ్మ ఉద్యోగ ప్రస్తావన తెచ్చినా ఆమె మాట ఖాతరుచేయలేదాయన. విఠలాచార్యులు సాత్వికుడు కావటంతో తండ్రినేమీ అనలేకపోయాడు. అతనికీ మధ్యనే ప్రమోషనిచ్చి సేల్సు ఎక్జిక్యూటివ్ చేశారు. అందువల్ల అధికంగా కాంపుల్లో వుండటంవల్ల తల్లికి డబ్బివ్వటం తప్ప అతను మరేవిషయం పట్టించుకునేవాడు కాదు.

ఒకనాడు నరశింహాచార్యులకు చిన్ననాటి మిత్రుడు రామాచార్యులు వీధిలో కలిశాడు. నరశింహాచార్యులు బలవంతంచేసి అతన్ని ఇంటికి తీసుకువచ్చాడు. మాటల్లో గొప్పగా తన సంసారాన్ని గూర్చి చెప్పాడు, "నాకీమధ్యే ఒంట్లో బావుండక వచ్చానురా. ఓ నాలుగు నెల్లు రెస్ట్ తీసుకునిమళ్ళీ ఉద్యోగంలో జాయినవుతాను. పెద్దవాడు బాగానే సంపాదిస్తున్నాడు. నేనే వేరుకాపురం పెట్టించా. మళ్ళీ అనవసరపు మనస్పర్థలొచ్చి వేరవటంకంటే సఖ్యంమీదే విడిగా వుండటం మంచిదనిపించింది. విఠలుది ప్రైవేటు కంపెనీ అయితే నేం... మంచి జీతం. నాన్నా నువ్వు ఉద్యోగం చేయాల్సిన పనిలేదు. ఇంటిపట్టునే ఉండు. అని అంటాడు వాడు. కాని తోచి చావదే. పెద్దమ్మాయి ఆండాళమ్మకు పెళ్ళిచేశాం. దానికిద్దరు పిల్లలు. మూడోవాడు ఆర్మీలో వున్నాడు. నెలనెలా ఠంచనుగా డబ్బు పంపిస్తాడు. రొష్టులేకుండా వుందిరా జీవితం. ఇంకా నీకెన్నేళ్ళుందేం సర్వీసు?'' అని తమ జీవితాన్ని గూర్చి అందంగా చిత్రించి మిత్రుడి యోగక్షేమాలు విచారించసాగాడు నరశింహాచార్యులు.

"ఇంకెంతరా ఎనిమిదేళ్ళుందేమో! నాకూ ఒక్కటే పిల్ల. దాని పెళ్ళయిపోతే నాకు నిశ్చింత. అవునూ మీరెండోవాడికెన్నేళ్ళు?'' అనడిగాడు రామాచార్యులు.

విఠలాచార్యులు స్ఫురద్రూపి. రంగనాయకమ్మ కొడుకుల్లో చక్కనివాడు. అతన్ని చూడగానే మోహంలో పడిపోయాడు రామాచార్యులు.

"ఎంతా... పాతికేళ్ళుంటాయేమో! సంబంధాలొస్తున్నాయి. బాగా కట్నమిస్తామనీ వస్తున్నారు. నేనే ఇంకా ఏదీ నిర్ణయించుకోలా'' అన్నాడు నరశింహాచార్యులు.

"మరి మా అమ్మాయిని నీ రెండోకొడుక్కి చేసుకోరాదూ! తెల్సినవాడివి, స్నేహితుడివి.

దాన్ని నీ ఇంట్లో పడేస్తే నా ప్రాణం హాయిగా వుంటుంది'' అన్నాడు రామాచార్యులు.

"నీ కూతుర్ని చేసుకోటానికి నాకభ్యంతర మేముంటుందిరా! అట్లాగే, పెళ్ళిచూపులకేర్పా టు చెయ్యి''

అయితే రంగనాయకమ్మకు రెండోకొడుక్కి పెళ్ళిచేయటం ఇష్టంలేదు. భర్తకు చెప్పింది "నికరంగా వచ్చే ఆదాయం వాడి జీతమే. వాడికిప్పుడే పెళ్ళిచేస్తే మనం ఇబ్బందిలోపడి పోతాం" అని.

"నీ బొంద, నీకేం ఆలోచన లేదు. ఇది మంచి సంబంధం. ఒక్కతే కూతురు. వాడు బాగానే సంపాదించి నిలువచేశాడు. పదివేల యినా కట్నమివ్వకపోడు. ఎవరున్నారు వాడి కిమాత్రం పెట్టటానికి కూతురూ, అల్లుడేగా. కనుక, నువ్వేం మాట్లాడక'' అన్నారాయన.

వారంరోజుల్లో పెళ్ళిచూపులయ్యాయి. పిల్ల వాడికి పిల్లా, పిల్లకు పిల్లవాడూ నచ్చటం జరిగింది. పెళ్ళి ఆర్నెల్లలో జరిగిపోయింది. నరశింహాచార్యులు కట్నం బాగా వస్తుందని ఆశించాడుకాని, రామాచార్యులేం తక్కువవా డు కాదు. అడిగినంత కట్నం పదివేలూ ఇచ్చి, నగలూ, చీరెలూ అని దాంట్లో సగం రాబట్టా డు. కోడలు సంయుక్త పేరుకు కాపురానికి వచ్చిందికాని, ఎక్కువభాగం పుట్టింట్లోనే వుండేది. విఠలాచార్యులూ అత్తగారింటికి వె ళ్ళి వస్తూవుండేవాడు.

పెళ్ళయిన ఆర్నెల్లలోనే సంయుక్త తల్లి సౌభాగ్యలక్ష్మి అల్లుడి కుటుంబాన్ని గూర్చి అంచనావేసేసింది. "ఇంక మనం కళ్ళు తెరవ కపోతే మనల్లుడికి మిగిలేది చిప్పా, దొప్పానే గతి'' అని భర్తకు చెప్పేసింది. వాళ్ళిద్దరూ కలిసి అల్లుడికి నచ్చచెప్పి అతనిచేత చిట్లు కట్టించటం మొదలుపెట్టించారు. జీతంలో సగభాగం చిట్లకి పోను, మిగతాదే విఠలాచా ర్యులు తల్లిచేతుల్లో పెట్టటంవల్ల రంగనాయక మ్మ కుటుంబం మళ్ళీ మామూలుకు వచ్చింది. సంయుక్త మంచిపిల్లేకాని, తల్లి పోరిపోరి "నీకా ఇంట్లో చికాగ్గా వుండదూ. అంతమంది జనం, రావంధాలి కొంప. అక్కడ నువ్వెట్లా వుంటావోనని మాకు బెంగ గా వుంటుందే'' అని చెప్పగా చెప్పగా ఆమెకు తల్లిమాటే నిజమనిపించింది. అంతలో ఆమె గర్భం ధరించటం, నాలుగోనెల్లోనే ఆమె పుట్టింటికి వెళ్ళిపోవటం జరిగాయి.

విఠలుడికి చెప్పిచూశారు తల్లిదండ్రులు, "ఇప్పట్నుంచీ చిట్లు కట్టకపోతే ఏంరా! ముందు సంసారం నడిచే సంగతి చూసుకోవా లికదా'' అని.

"వచ్చిందంతా కడుక్కుతింటే మనం ఎప్పటికీ బాగుపడలేమమ్మా. రేపు అలివేలు పెళ్ళి చేయాలంటే మనదగ్గరేముంది. అందు కనే చీట్లు కడుతున్నాను'' అన్నాడు విఠలాచా ర్యులు.

పెద్దకొడుకు శేషశయనాచార్యులును పిల్చి అడిగాడు నరశింహాచార్యులు నెలనెలా ఇంతని డబ్బు ఇవ్వమని.

"ఇప్పటికే చాలా పెట్టాను. నావల్ల కాదు నాన్నా! వెంకడికి ఉత్తరం రాయండి. వాడికేం బాదరబందీ వుంది. ప్రతినెలా డబ్బు పంపా చ్చుగా'' అన్నాడు శేషశయనాచార్యులు.

"వాడికి ఉత్తరాలు రాయటమేకాని ప్రయో జనం లేదు. తిరుగు జవాబు కూడా రాయ టంలేదు'' అంది రంగనాయకమ్మ.

"మరి నేనేం చేయగలనమ్మా'' అన్నాడు కొడుకు.

"చేసేదేమిటోయ్. మిమ్మల్ని, ఇంత పెద్ద సంసారాన్ని నెట్టుకురావటానికి కాదూ, నాకు న్న ఆస్తంతా హారతికర్పూరమైంది. ఇవాళ నాకేం పట్టనట్టూరుకుంటే ఎట్లా'' అన్నాడు నరశింహాచార్యులు.

"ఆс... అంత ఆస్తీ మాకింద ఖర్చుపెట్టిన ట్లయితే మేం వాళ్ళా వీళ్ళా దయాదాక్షిణ్యాల మీద పడి చదువుకోవాల్సి వచ్చేది కాదు. నిజానికీ సంసారాన్ని ఈ పరిస్థితికి తెచ్చింది నువ్వే''

"వెధవ! అంట్లవెధవ! తండ్రిని పట్టుకు అంతమాటలంటావా? చిన్నాపెద్దా తారతమ్యం అక్కర్లేదా!"

"ఆం, అది నీదగ్గరే నేర్చుకోవాలి. అయినా ఇప్పుడు పాతవిషయాలు తవ్వుకోవాల్సిన అవసరంలేదు. నేను చెయ్యగలిగింది చేశాను. ఇంక నావల్లకాదు. అట్లా అని నా బాధ్యత నుండి పూర్తిగా తప్పుకుంటున్నాననీ చెప్పటంలేదు. అలివేలు పెళ్ళికి నా చేతనయినది చేస్తాను"

"ఆం... చేస్తావు. ఇప్పుడింత చేశావు. అప్పుడింక ఉద్ధరిస్తావు...!!"

"నేనేం చేయకపోయినట్లయితే మనింట్లో వాళ్ళంతా బోధన్‌లో అగచాట్లు పడ్తూ, అడుక్కుతింటూ వుండేవాళ్ళు. ఈ ఊరొచ్చేటప్పటికి రంగడికెన్నేళ్ళు. పసివెధవకదూ! అప్పటికింకా విఠలు హెచ్చెస్సీకూడా పాసవలేదే, వెంకడిని స్కూల్లో వేసింది ఇక్కడేగా. ఆండాళుకు పెళ్ళెవరు చేశారు? ఇంతా చేయించుకుని ఇప్పుడేం చేయలేదనటం కృతఘ్నత"

"అంటే వెధవన్నర వెధవ! నువ్వే మమ్మల్ని ఉద్ధరించావన్నమాట. నేను ప్రతినెలా డబ్బు పంపలా! బోడి, విఠలుకిమాత్రం ఏం చదువు చెప్పిచ్చావోయ్. ఆ హెచ్చెస్సీ చెప్పిచ్చేటప్పటికే గగనమైంది"

"పంపావు... ఏం పంపావు? నీ ఖర్చులన్నీ అయి మిగిలితే పదీ పరకా పంపావు. నువ్వెప్పుడూ బాధ్యతాయుతంగా సంసారాన్ని నడిపింది లేదు. నీకు అహంకారం, పొగరు. 'నాఅంతటివాడు ఎవడూ లేడు' అన్న మిధ్యాగర్వం. ఇవాల్టికి కూడా చెట్టంత కొడుకునెదుట బెట్టుకుని బోడి, వెధవ అని తిట్టే మనిషికి మర్యాద, మన్ననలేంతెలుస్తాయి. అందుకే నాకు నీతో మాట్లాడటమంటే అసహ్యం"

"ఏంకూశావురా గాడిదకొడకా! నన్ను చూస్తే నీకసహ్యమా... చంపుతా నా కొడకా!" అని లేచి ఆవేశంతో కొడుకును కొట్టబోయాడు ఉగ్ర నరశింహాచార్యులు.

"ఏవిటండీ ఇదీ! మీరనవసరంగా ఆవేశపడకండి. ఒరే విఠలూ, రంగా ఎక్కడున్నా్రా..." అనరిచింది రంగనాయకమ్మ.

అప్పుడే లోపలకు వెడుతున్న రామానుజాచార్యులు "ఏవిటే అక్కయ్యా! ఏమైంది?" అంటూ ప్రశ్నించాడు రంగనాయకమ్మను.

"చూడ్రా నాయనా! తండ్రీ, కొడుకులిద్దరూ కొట్టుకుచస్తున్నారు" అంది రంగనాయకమ్మ ఏడుస్తూ.

రంగనాయకమ్మా, రామానుజాచార్యులు పట్టుకు ఆపినా ఆగక ఆవేశంతో ఊగిపోయాడు నరశింహాచార్యులు.

తండ్రి గొంతు దగ్గర పట్టుకున్న చొక్కా సరిచేసుకుంటూ, "ఇంత ఆవేశం, కోపమే మనజీవితాలనీస్థితికి తీసుకువచ్చింది. జీవితంలో ఆవేశం తప్ప ఆలోచనతో నువ్వొక్క నిర్ణయం చెయ్యలేదు. ఇవాళ దానికి నన్ను తప్పుపట్టి ప్రయోజనం లేదు" అని మరొక్క మాట మాట్లాడకుండా వెళ్ళిపోయాడు శేషశయనాచార్యులు.

కొడుకు వెళ్ళిపోగానే కుప్పకూలిపోయాడు నరశింహాచార్యులు.

"వాడేదో పిల్లవాడన్నాడు. నువ్వు పెద్దవాడివి అర్థంచేసుకోక అంత ఇదైపోతే ఎలా?" అని బావమరిది నచ్చచెప్పినా నరశింహాచార్యులు మారుపలకలేదు.

కొడుకు నిర్మోహమాటంగా వున్నదున్నట్టు మాట్లాడటంతో ఆయనకు షాక్ తగిలినట్లయింది. మానసిక స్థితికి తగినట్లు ఆయన శారీరక పరిస్థితీ దిగజారిపోయింది. సుష్టుగా భోజనం చేసేమనిషి ఉప్పులేని చప్పిడికూడు తినలేకపోయాడు. జబ్బుపడిన ఏ నెలరోజుల్లో మాత్రమే పత్యం చేశాడు. ఆ తరువాత ఎవరు చెప్పినా పట్టించుకోలేదు. బ్లడ్‌ప్రజరు పెరుగుతూనేవుంది. కొడుకుతో ఘర్షణపడిన మరునాడు అపస్మారకం వచ్చి పడిపోయాడు నరశింహాచార్యులు.

కొడుకులు తండ్రిని ఉస్మానియా ఆస్పత్రిలో చేర్పించారు. విఠలాచార్యులుకు క్యాంపు లుంటాయి కనుక అతను రోజూ ఆస్పత్రికి రావటం కుదిరేది కాదు. శేషశయనాచార్యులు వచ్చినా అంటీముట్టనట్టుండేవాడు, రంగనాయకమ్మే భర్తదగ్గర ఆస్పత్రిలో వుంది. తల్లి ఆస్పత్రిలో వుంటుంది కనుక ఇంటిపనికోసం సంయుక్తను తమ ఇంటికి తీసుకొచ్చాడు విఠలాచార్యులు.

నరశింహాచార్యులు రెండురోజులు అపస్మారకంలోనే వున్నాడు. పక్షవాతం వచ్చింది ఆయనకు. "ఏమో, ఏం చెప్పలేం" అన్నారు డాక్టర్లు. ఆస్పత్రిలో ఉచితవైద్యమయినా, ఆసుపత్రిలో దొరకని మందులు బయట కొనాల్సి వస్తున్నది. డబ్బుకు చాలా ఇబ్బంది అయింది.

విఠలాచార్యులు క్యాంపులో వుండటంవల్ల మరో గత్యంతరం లేక ఆరోజు సాయంత్రం తండ్రిని చూట్టానికొచ్చిన శేషశయనాచార్యులుతో మొరపెట్టుకుంది తల్లి, "మందుల్లేకుండా చంపుతార్రా మీ నాయన్ని" అని.

శేషశయనాచార్యులేం మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. డాక్టరు వస్తే తన పరిస్థితి చెప్పుకుని ఏడ్చింది రంగనాయకమ్మ. "సరే, ఇవాల్టికేవో మాదగ్గరున్న మందులిస్తాం. రోజూ అంత ఖరీదుగల మందులివ్వాలంటే కష్టం. రేపటికయినా ఆ మందులు తెప్పించండి" అని చీటీ రాసిచ్చి వెళ్ళిపోయాడు డాక్టరు.

రంగనాయకమ్మకేం పాలుపోలేదు. ఐదారొందలవుతాయట ఆ మందులు. ఎక్కడ దొరుకుతుంది అంత డబ్బు నెలమధ్యలో. తమ్ముణ్ణడుగుదామనుకుంది కాని, ఆమెకే ఆ ఆలోచన సిగ్గు కలిగించింది. సంపాదించే కొడుకుల్ని పెట్టుకుని తమ్ముణ్ణడగటం అన్యాయమనిపించిందామెకు.

రాత్రి ఎనిమిది గంటలవుతుందేమో! నీరసంగా పరుచుకునుంది ఆస్పత్రి దీపాల పచ్చ కాంతి. నరశింహాచార్యులు అపస్మారకంలో వున్నాడు. రంగనాయకమ్మ భర్త బెడ్‌మీద తల వాల్చి స్టూలుమీద కూర్చుంది. డబ్బు అవసరం మళ్ళీ ఆమెను బాలకృష్ణుని విగ్రహంవైపు ఆకర్షించింది. 'అందుట్లో మధ్యభాగమమ్మేస్తే... ప్రస్తుతానికి తను గట్టున పడుతుంది. మూడుతులాల బంగారానికి పదిహేనువందలైనా రాదా!' అని ఆలోచన చేస్తున్న రంగనాయకమ్మకు తండ్రి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి, "చివరగా నీ తండ్రి నీగురించి ఆలోచించి, మధనపడి నీకోసమై పరానికింత మిగుల్చుకుంటావని ఇచ్చిన కానుక ఇది... జీవితంలో ఎప్పటికీ నీకోసం, నీవాళ్ళకోసం దీన్ని వినియోగించుకోవద్దు" ఏమి ఆంక్ష ఇది... దాహం వేస్తోంది. ఎదురుగా కుండలో నీళ్ళున్నాయి. అవి నువ్వు తాగటానికి కాదు, ఇతరుల దాహం తీర్చటానికి. మరి తాను దాహంతో చచ్చిపోతే, ఆ కుండలో నీళ్ళు ఎవరికీ వినియోగపడకుండా వుండిపోతాయే... కానీ ఈ దాహం ఇప్పటిది కాదే. ఎన్నేళ్ళనుండో తనకీ దాహమవుతోంది. తనే కుండలో నీళ్ళతో దాహం తీర్చుకుందామని ప్రయత్నించినట్లయితే ఆ కుండలో నీళ్ళు ఎన్నిరోజులొచ్చివుండేవి. ఒకరోజులో అయిపోయి వుండేవికావా? ఆ నీళ్ళకుండకి తను ధర్మకర్తేకాని, యజమానురాలు కాదు. పరిమిత పరిధిలోనే అయినా ఇతరుల దాహం తీర్చమని ఇచ్చిన పావన గంగాజల కుంభమది!'

"ఎట్టా వుందమ్మా అయ్యకు" అని పక్కబెడ్‌లోని రోగి తల్లి అడగటంతో తల తిప్పి చూసింది రంగనాయకమ్మ.

పల్చగా పరుచుకున్న క్షీణకాంతిలో మ్లానంగా వున్న ఆమె వదనం, సంస్కరించని జుట్టు, మాసిపోయిన ముతకచీరె కట్టుకున్న ఆమెని చూసినప్పుడు, 'దాహం, దాహం' అని పరితపిస్తున్న మూర్తి కన్పించి ఉలిక్కిపడ్డట్టయింది రంగనాయకమ్మ.

పక్కబెడ్‌లో వున్న పిల్లవాడికి ఏడెనిమిదేళ్ళుంటాయేమో! ఆ పిల్లవాడికి మూత్ర

పిండాల జబ్బు. అది బతికే జబ్బు కాదని తల్లికీ తెల్సు. ఆమె పేదరాలని తమకొచ్చిన శాంపిలు మందులిస్తున్నారు డాక్టర్లు. అయినా కొన్ని ఖరీదయిన మందులు రాయక తప్ప టంలేదు. ఆసుపత్రిలో మిగతా పేషెంట్లూ ఆమెమీద జాలి తల్చి తృణమో ఫణమో ముట్టచెప్తుంటారు.

"అట్టాగే వుంది'' అంది నిట్టూరుస్తూ రంగ నాయకమ్మ. మళ్ళీ "అన్నం తిన్నావా?" అన డిగింది.

ఆమె తిన్నానంటూ తల ఊపింది కానీ, రంగనాయకమ్మకు ఆమె కళ్ళల్లో ఆకలి కన్పి స్తూనేవుంది. "పిల్లగాడికిచ్చిన రొట్టె కుసింత ముక్క మిగిలితే తింటినమ్మా'' అంది.

"ఏం... ఇవాళ అన్నం వండుకోలేదా?" అనడిగింది రంగనాయకమ్మ.

"నాతాన ఏవుందమ్మా వండేతానికి. మా వోడు వూరెల్లినోడు వస్తాననుండె, పైసలు తెస్తాననుండె. పత్తాలేడు మడిసి'' అంది ఆమె.

ఆమెను ప్రశ్నలు వేసి రంగనాయకమ్మ తెల్సుకున్న కథ ఇది.

ఇబ్రహీంపట్నం ఆ దంపతులది. కూలినాలి చేసుకుని రోజు వెళ్ళమార్చుకునే బతుకది. రెక్కాడితేగాని డొక్కాడదు. ఇద్దరూ కొడుకు నంటిపెట్టుకు కూర్చుంటే పస్తులుండాలి తప్ప వాళ్ళకి తిండిపెట్టేవాళ్ళెవరూ లేరు. ఆమె భర్త వారానికోసారి వస్తాడు. కూలిపని చేసి కడుపు కట్టుకుని కూడబెట్టుకునొచ్చిన డబ్బు భార్యచే తికిచ్చి కొడుకుని చూసి వెళ్ళిపోతాడు. డబ్బు న్నరోజు ఆసుపత్రి బయట వేపచెట్టుకింద ఇంత కూడు వుడకేసుకు తింటుందామె.

డబ్బులేన్నాడు కొడుకు తినగా మిగిల్చిన బ్రెడ్‌ముక్కో, పక్కబెడ్ల రోగులు దయదల్చి ఇచ్చిన ఆహారపదార్థాలో తిని ఆకలి అణి గించుకుంటుందామె. ఇక్కడున్న ఆమె భర్త అక్కడ ఎట్లా వున్నాడో అని బాధపడుతుంది.



అతనికీ కొడుకునలాంటి పరిస్థితిలో వదిలిపె ట్టి వెళ్ళిపోవటానికి మనసొప్పేది కాదు. అయి తే అక్కడ వుండగలిగే పరిస్థితి కాదు అతనిది. భర్త తనకిచ్చిన డబ్బులు ఖర్చుచేయకుండా, కడుపు కూడా కాల్చుకుని, ఇతరుల దగ్గర బిచ్చమెత్తి డాక్టర్లు విధిలేక రాసిచ్చిన మందు లు కొని తెచ్చేది. ఎన్నాళ్ళిలా సాగాలో ఆ తల్లికి తెలియదు. పిల్లవాడు బతకడని డాక్టర్లకి తెలుసు, తల్లిదండ్రులకీ చెప్పారు వాళ్ళు. అయినా ప్రాణం వున్నంతవరకు వైద్యం చే యటం డాక్టర్ల ధర్మం, శక్తిలేకపోయినా కొడు కుకు చికిత్స చేయించటం కన్నధర్మం.

ఆమె సొద వింటూన్న రంగనాయకమ్మకు నీరశించిపోయి, కళ్ళల్లో ప్రాణం పెట్టుకుని వున్న ఆ పిల్లవాడి దీనముఖం ఆమెకు జ్ఞప్తికొ చ్చింది. "అయ్యో! బాలకృష్ణుడెంత చిక్కిపో యాడు. ఎంత దీనత్వం, నిర్లిప్తత ఆ కళ్ళ ల్లో!!" ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆమె హృదయం ప్రిదిలిపోయింది.

"ఈడ బందికాన అయినాదమ్మా! ఎన్నిది నాలుండాలీడ? పోయినోడయినా కాడీడు. సచ్చిపోటమనాదికాయమేగాని, మమ్మల్ని సంపి సత్తున్నాడు తల్లీ'' అంది ఆమె తన కథను ముగిస్తూ.

"వద్దు వద్దు తల్లివైవుండీ ఆ మాటనకు. ఆ పైవాడే వున్నాడు'' అంది రంగనాయకమ్మ.

అన్నమయ్య కీర్తనొకటి ఆమె మదిలో మెదిలింది-

'ఆపద వచ్చినవేళ నారబడినవేళ
పాపపువేళల భయపడినవేళ
వోపినంత హరినామ మొక్కటేగతికాక
మూపుదాకా బొరలిన మరిలేదు తెరుగు'

రంగనాయకమ్మ పొద్దున రంగనాథం తండ్రిని చూసుకోటానికి ఆసుపత్రికి రాంగానే తను ఇంటికి బయల్దేరింది. పొద్దున ఇంటికెళ్ళ గానే అడిగింది సంయుక్త "మామగారికెట్లా వుంది'' అని.

"అట్లాగే వుంది'' అంది రంగనాయకమ్మ.

ఇంట్లో వున్నంతసేపూ అన్యమనస్కంగానే

గడిపింది రంగనాయకమ్మ. వంటచేసి, దేవుడి కి నైవేద్యం పెట్టింది. దేవుడికి సాష్టాంగప్ర మాణం చేసి బాలకృష్ణుడి శిరసునతికిన సీల తీసి మధ్యభాగం కొంగున కట్టుకుంది. భోజనం చేసి పదకొండు గంటలకల్లా మళ్ళీ ఆసుపత్రికెళ్ళటానికి బస్సుస్టాపుకొచ్చింది. బస్సులు వస్తున్నాయి, పోతున్నాయి కాని ఎటువెళ్ళాలో ఆమె నిర్ణయించుకోలేకపో యింది. బంగారం షాపులో బాలకృష్ణుడి మొండాన్నమ్మేసి డబ్బు తీసుకెళ్దామని ఆలో చించింది. కానీ మళ్ళీ పస్తాయించింది ఆమె. ఆసుపత్రి బెడ్‌లో వున్న బాలకృష్ణుడు ఆమె మనస్సులో మెదిలాడు. 'కాదు ఆయనకు మందులెట్టా! మరి తనెప్పుడూ బంగారం షాపుల మొహం చూసింది లేదు. ఎక్కడ ఎట్లా అమ్మాలో తెలియదు. ఈ విషయం ఇంకోరికి తెలియటానికి వీల్లేదు. ఎట్లా' అనీ అనుకుందామె. ఆ ఆలోచన వచ్చి మళ్ళీ కంపరం కలిగింది. ఆసుపత్రిలో పిల్లవాడి తల్లి దాహపు చూపులు ఆమె హృదయాన్ని తాకి గాయపర్చాయి. ఎటూ తోచని పరిస్థితిలో ఆమె బాలకృష్ణునికి నమస్కరిస్తూ అనుకు న్నది-

'శరణాగత వజ్రపంజరే,
శరణే శార్ఙధరస్వవైభవే
కృపయా ధృతగోపవిగ్రహే,
కియదన్యన్మృగయా మహేవయం!'

'శరణుజొచ్చినవారికి వజ్రపంజరమై, దయా ళువై గోపకుని శరీరం ధరించి, విష్ణువైభవంతో వెలిగే కృష్ణా! నువ్వు రక్షకుడుగా వుండగా నేనింక ఇతరమైనదాన్ని దేన్ని వెతకాలి?' అని.

ఆమె శరణాగతికి సమాధానమన్నట్టుగా బస్సుస్టాపుకొచ్చి పల్కరించాడు శేషశయనాచా ర్యులు తల్లిని.

"ఇప్పుడే ఇంటికొచ్చానమ్మా! నువ్వాసుప త్రికి వెళ్ళిపోయావని సంయుక్త చెప్పింది. ఇవిగో ఐదొందల రూపాయలు. రంగడికిచ్చి ఆ మందులు తెప్పించు. నేను సాయంత్రం కలు స్తాను. ఆఫీసుకు టైమైంది'' అని తల్లికా డబ్బిచ్చి స్కూటర్‌మీద వెళ్ళిపోయాడు శేషశ యనాచార్యులు.

వెళ్తున్న కొడుకువంక చూస్తూ 'పరాత్పరా! ఇప్పటికి నన్ను కరుణించావు. త్వయి ప్రపన్నే మమకిం గుణేన త్వయ్యప్రపన్నే మమకింగు ణేన'. 'నువ్వు నాపట్ల ప్రసన్నుడివైతే నాకే గుణములు మాత్రం ఎందుకు? నువ్వు ప్రస న్నుడవు కానప్పుడు నాకే గుణములుండీ ప్రయోజనమేమిటి? నాకే గుణాలూ లేవు తండ్రీ, నీ శరణ్యం తప్ప నాకు గత్యంతరం లేదు' అనుకుంది ఆమె.

ఆసుపత్రిలో నరశింహాచార్యులు పరిస్థితి అలాగే వుంది. డబ్బిచ్చి రంగనాథంచేత మందులు తెప్పించింది. "ఇంటికెళ్ళి సాపాటు చేసి బడికెళ్ళు'' అని పంపేసింది కొడుకును.

ఆ తరువాత ఇంక ఆలస్యం చేయలేదు రంగనాయకమ్మ. పక్కబెడ్ పిల్లవాడి తల్లిని ఆసుపత్రి కారిడార్‌లోకి తీసుకెళ్ళి, "చూడుత ల్లీ! నీపేరేమిటో నాకు తెలియదు. పిల్లవాడిని కాపాడటానికి ఆ పరాత్పరుడే వున్నాడు. మనం చెయ్యగలిగిందేంలేదు. నావల్ల అయ్యే సాయం ఒకటి నీకు చేద్దామనుకుంటున్నాను'' అంటూ కొంగుముడి విప్పి బాలకృష్ణుడి రెండో భాగాన్ని ఆమె చేతిలోబెడ్తూ అంది, "ఇది మంచి బంగారంతో చేసింది. బాలకృష్ణుడి విగ్రహంలో మధ్యభాగం. దీన్ని నీ మొగుడికి చ్చి అమ్మించు. మూడుతులాలు వుంది. కనీసం పదిహేను వందలైనా వస్తాయను కుంటాను. కొన్నాళ్ళయినా మీకు గడచిపో తుంది. పిల్లవాడికి మందులూ కొనచ్చు'' అని.

ఆమె రంగనాయకమ్మ కాళ్ళు పట్టుకుంది, "అయ్యో! ఎంత దయతలిస్తివి తల్లీ! తిరిగి నేనేంజేయ తల్లీ నీకు'' అంటూ.

"లే, లే తప్పుకాదూ! నాకాళ్ళెందుకు పట్టు కుంటావు. మనమందరం ఆ పరాత్పరుడి కాళ్ళు పట్టుకోవాలి. వాడే మన్ని తరింపచే

సేది. ఇందులో నేను చేసిందేమీలేదు, నువ్వు వెయ్యాల్సిందీ లేదు'' అంది రంగనాయకమ్మ ఆమె చెయ్యిపట్టుకు లేపుతూ.

నీళ్ళతో నిండిన కళ్ళతో తనవంక చూస్తున్న ఆమెతో అంది రంగనాయకమ్మ మళ్ళీ, "జీవితంలో తిండికే లేకపోవటం ఎంత విషాదమమ్మా'' అని. రంగనాయకమ్మ భాష, భావం అర్థంచేసుకునే పరిజ్ఞానం ఆమెకు లేకపోవచ్చుకానీ ఆమె హృదయం రంగనాయకమ్మ హృదయస్పందనను అర్థంచేసుకుంది.

నరశింహాచార్యులుకు మర్నాటికి కొంత తెలివి వచ్చిందికానీ, శరీరపు కుడిభాగమంతా పడిపోవటంతో నోటమాట రాలేదు. దీనంగా, నీళ్ళునిండిన కళ్ళతో భార్యవంక చూడటంకంటే మరేం చేయలేకపోయాడు. ఆయన పరిస్థితికి రంగనాయకమ్మ హృదయం పరితపించింది, 'ఈ మనిషి గర్వం, అహంకారం ఏమయిపోయాయి. అయ్యో! ఎంత దీనాతిదీనంగా వడివున్నాడు'' అని రోదించింది.

అయితే స్పృహరావటం కొద్దిసేపే అయింది. మళ్ళీ స్పృహతప్పిపోయాడు. అలాగే నిర్జీవంగా వారంరోజులు బెడ్‌మీద పడివున్నాడు. డాక్టర్లు శాయశక్తులా కృషిచేశారు. కాని, తప్పించరాని ఆ ఘడియనెవరు తప్పించగలరు? ఆ ఘడియ వచ్చింది. మెదడుకు కూడా రోగం వ్యాపించటంతో నరశింహాచార్యులు చనిపోయాడు.

భర్తపట్ల ప్రేమలేకపోలేదామెకు. తన విద్యుక్తధర్మం తాను నిర్వర్తించింది. 'సదా ప్రహృష్టయా భార్యం, గృహకార్యేషు దక్షయా, సునంస్కృతోవస్కరయా, వ్యయేచాముక్తహస్తయా' అన్నట్లుగా, 'సదాస్మితవదనయై, గృహకార్యాల్లో నేర్పరియై, వస్తువులు పరిశుభ్రంగా వుంచుతూ, మితంగా ఖర్చుచేసేదై' తన ధర్మాన్ని నిర్వర్తించింది. అతడే తనకేమీ కర్తవ్యంలేనట్టు ప్రవర్తించాడు. అయినా అన్ని ఏళ్ళ రాగబంధం తెగిపోయినప్పుడు కలిగే బాధకేమీ ఆమె అతీత కాలేకపోయింది.

టెలిగ్రాం అందగానే వేంకటాచార్యులు, ఆండాళమ్మా వచ్చారు. కొడుకులందరూ కల్సి డబ్బు వేసుకుని తండ్రి దినవారాలు చేశారు.

రంగనాధాచార్యులు ఎస్సెస్సీ పాసయ్యాడు. ఇంకా వయస్సు పదహారే కనుక గవర్నమెంటు ఉద్యోగాలు రావు కనుక విఠలాచార్యులు కుదిర్చిన చిన్న ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చెయ్యసాగాడు.

తండ్రి పోయింతర్వాత, తల్లి వంటరిగా వుంటుందని భార్యను పుట్టింటికి పంపకుండా తనదగ్గరే ఉంచుకున్నాడు విఠలాచార్యులు.

"అమ్మ దిగులుగా వుండొచ్చు. ఏ పని చేయాలన్నా చికాకుగా వుండొచ్చు. నువ్వు సాయంగా వుంటే బావుంటుంది'' అని భర్త అనగానే సంయుక్తకు కూడా అతనన్న మాట నిజమే అన్పించింది. అత్తగారితో మడికట్టుకుని తనే వంటచేస్తానని అన్నదికాని, రంగనాయకమ్మ ఆమె మాట వినలేదు. పెళ్ళయి ఏడాది కూడ్గా వెళ్ళలేదు. ఆపైన వట్టి మనిషి కూడా కాదు. ఆ పిల్లచేత ఇంటిచాకిరీ అంతా చేయించడం రంగనాయకమ్మకు ఇష్టంలేదు.

అయితే కాళిందికీ, సౌభాగ్యలక్ష్మికీ ఈ తీరు నచ్చలేదు.

ఓసారి అత్తగారు ఎలావుందో చూసిపోవచ్చింది కాళింది. పొద్దున వచ్చింది. సాయంత్రందాకా వుంది. రంగనాయకమ్మ అడిగింది "ఏవిటే అమ్మాయి! శేషు కన్పించటమేలేదు'' అని.

"ఆయనకెక్కడ తీరిక! రావటం కుదరకే నన్ను పంపించారు. మా అమ్మ ఎలావుందో చూసిరమ్మన్నారు'' అంది కాళింది.

నిజానికి అత్తగారు మామగారు పోయిన దిగులుతో మంచమెక్కి, చేసేవాళ్ళు లేక తమ కొంపచేర్తుందేమో, కనుక పరిస్థితిని అంచనా వేసి, ఆపైన తీసుకోవాల్సిన చర్య గురించి ఆలోచించాలని మరిది ఇంటికి వచ్చింది. ఇక్కడకొచ్చిన ఆమెకు పరిస్థితి మామూలుగా

వుండటం, సంయుక్త వట్టిమనిషి కాదని ఎత్తెత్తుకు చూడటం నచ్చలేదు. మనిషి ఎలాంటివాడయినా భర్తకదా. మరి అత్తగారు ఏం జరగనట్టు వుందేం అని ఆమెకు కొంత ఆశ్చర్యమూ కలిగింది. మరి తను కడుపుతో వున్నప్పుడు అత్తగారు తన్నింత గారాబం చెయ్యలేదే అన్న కోపం ఆమె మనసులోవుంది. నిజానికి రంగనాయకమ్మ కాళిందికి చెయ్యనిదేంలేదు. కానీ అత్తగారేంచేసినా కంటగింపుగానే వుండేది కాళిందికి.

అక్కడ ముందువసారాలో మధ్యాహ్నపు పురాణశ్రవణం కొనసాగుతూంటే, దొడ్లో వంటింటి గడపమీద కూర్చుని తోడికోడళ్ళు కుశలప్రశ్నలు వేసుకున్నారు.

"సాయంత్రంపూట నువ్వే వంటచేస్తున్నావా?" అని ఆరాలు తీయటం మొదలుపెట్టింది కాళింది.

"నేను చేస్తానన్నాను కానీ అత్తయ్యే వద్దంది'' అని జవాబిచ్చింది సంయుక్త.

"అవునులే, మడి కట్టుకుని వంట చేయాలంటే ఎవరికైనా కష్టమే. పైగా వట్టిమనిషివి కూడా కాదయ్యె. ఆమెనే చెయ్యనీ, పనిధ్యాసలోపడి మామగారు పోయారన్న దిగులు మర్చిపోతుంది''

"పాపం ఆమె పెద్దదైందికదా! చెయ్యాలన్నా ఓపిక వుండవద్దూ! అయినా నన్ను చెయ్యనివ్వటంలేదు''

"పోన్లే నీమీదయినా అంత ప్రేమ చూపిస్తున్నది. అంతకంటే కావల్సిందేముంది?"

"అదేం, నీమీదమాత్రం ప్రేమ ఉండదా అక్కా ఆవిడకు? పైగా పెద్దకోడలివయితివి''

"సడేలే, ఆ సౌభాగ్యమూ చూశాను. మాటల్లోనే ఆ ప్రేమంతా ఒలకబోయటం. నేను కాపురానికి వచ్చినప్పుడే 'సాయంత్రంపూట వంట నీవంతమ్మా!' అని వంటగది చూపించింది. అప్పటినుండి ఈ గుంపుకంతా వండి వార్చలేక చచ్చిపోయాను. ఆ వెంకయ్యకు ఏమీ నచ్చేది కాదు, సయించేది కాదు. రంగనాథమంటే అత్తగారికి గారాబం. అతనికన్నీ స్పెషల్‌గా చెయ్యాలి. ఏమాటకామాటే చెప్పుకోవాలి. వితలే ఏం పెట్టినా మారుమాటాడకుండా తినెళ్ళేవారు. ఆయన నా బాధ చూడలేక పట్టుబట్టి వేరుపెట్టించబట్టిగానీ, లేకపోతే నా పురమారిపోయేది. మామగారు ఊళ్ళుబట్టి తిరుగుతున్నాడన్న పేరేగానీ, నెలకు వారం రోజులు కొంపలోనే తిష్టవేసేవాడు. ఆయనకి ఊళ్ళో వున్నన్ని రోజులు ఆయన రాజభోగాలు జరగాలి. సాపాటులోకి రెండు కూరలు, మళ్ళీ మధ్యాహ్నానికి పిండివంట చెయ్యాల్సిందే. పొద్దున వంట ఆమె చేసినా, పిండివంట మనకు తప్పదుకదా పైగా ఏం మనిషో ఆయన పెట్టింది సుష్టుగా తిని 'ఉప్పు తక్కువైంది, కారం ఎక్కువైంది' అని వంకలుపెట్టేవాడు. సంసారం ఈతీరు చేసింది ఆ మనిషేగా, అందుకే తీసుకుతీసుకు చచ్చాడు. పెద్దవాణ్ణి అనకూడదుగానీ, సత్యం చెప్పటానికి నేను వెరవను'' అంది కాళింది.

"అవునట. ఖర్చు తగ్గించుకోవాలని, ఈయన్ని పెంపకం ఇవ్వాలని కూడా ప్రయత్నం చేశార్ట. ఆయన చెప్పారు'' అంది సంయుక్త

"ఇదుగో సంయుక్తా! నువ్వు నా చెల్లెలి లాంటిదానివి గనుక నీ హితంకోరి ఓ మాట చెప్తాను విను. ఎంతకాలం ఉమ్మడికుటుంబంలో వుండి నష్టపోతారు మీరు. ఇప్పుడు వితలు సంపాదన మీదే ఇంతమంది బతకాలా? ఆ వెంకయ్యకు ఎప్పుడూ బాధ్యత లేదు! టింగురంగామనుకుంటూ వచ్చిన డబ్బు జల్సాచేసుకుంటూ, నానా తిళ్ళూ తింటూ, నానా తాగుళ్ళూ తాగుతూ మూడుపువ్వులు ఆరుకాయలుగా జీవితం గడుపుతున్నాడా! అతన్ని డబ్బు పంపమని ఎవరూ అడగరు. గారాబం! దూరంగా వుంటున్నాడు ఏంతింటున్నాడో, ఎలా వున్నాడోనని ఈవిడ దిగులుపడ్తూ వుంటుంది. వాడికేం మాయరోగం, హాయిగా జల్సాచేస్తున్నాడు. నువ్వు గమనించావో లేదో, ఎప్పుడయినా ఇంటికొస్తా

డా, కంపు... మనిషిదగ్గరకొచ్చాడంటే చచ్చిపోతాం''

"తాగుతాడంటావా?"

"తాగుడేమిటి? నానా తిళ్ళూ తింటాడు. మరి ఏ చిన్నిల్లు పెట్టాడో మరి మనకు తెలీదు. ఏమీ లేకపోతే డబ్బు పంపకపోవటానికేం మాయరోగం. ఒక్క మనిషి. పైగా ఆ మిలటరీలో ఉచితంగా తిండిపెడ్తారు. మరి ఖర్చేంవుంది. ఈ అలవాట్లన్నీ వుండబట్టే పైస ఇంటికి రాదు''

"నిజమే, లేకపోతే జీతమంతా ఏంచేస్తాడు మరీ'' అంది సంయుక్త

"చూశావుగా, నీ మొగుడి జీతంమీద ఇంత మంది బతకాలి. మీరిద్దరూ, రంగనాథం, అలివేలు, అత్తగారు - ఐదుగురు మనుషులంటే సామాన్యమా! మేం బయటకెళ్ళాంకదా అని మమ్మల్ని వదులుతుందనుకున్నావా. కన్నతల్లికదా అని ఎప్పుడయినా వుండబట్టలేక ఆయన చూసిపోదామని వస్తేచాలు 'డబ్బేమయినా వుంటే ఇచ్చిపోరా' అని ఈవిడ అడుగుతుంది. చూస్తూచూస్తూ తల్లికి లేదు అని చెప్పలేరాయన. అందుకు భయపడి ఈవిణ్ణి చూట్టానికి కూడా రావటం మానుకున్నారాయన. పోనీ తల్లి అడిగిందికదా అని ఆయన డబ్బిస్తే ఇంటికింద వాడుతుందా, వాడదు. ఆ అలివేలు చిన్నపిల్లే అయినా ఎంత మిడిసిపాటు? దానికి పూలు, రిబ్బన్లూ, ఓణీలూ, జాకెట్లూ అని ఖర్చుపెడుతుంది. కూతుళ్ళంటే విపరీతమైన మమకారం. ఆండాళ్ళుకు రెండు నెల్లకైనా చీర కొనుక్కోమని డబ్బు పంపాల్సిందేకదా! వీరలు అమాయకుడు. జీతం తెచ్చి ఆవిడ చేతికిస్తారుకదా! ఆవిడ ఇంటికింద ఎంత ఖర్చు చేస్తోందో, కూతుళ్ళకెంత దోచిపెడ్తోందో నీకేమయినా తెల్సునా? అహఁ. ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే మా కొంప ఎలాగో గుండమైంది. ఉమ్మడికుటుంబంకోసం చేసిన అప్పులు ఇంకా తీరుస్తూనే వున్నాం. నువ్వయినా జాగ్రత్తపడ్తావని చెప్తున్నాను''

"నిజమేనక్కా! ఆయన ఎప్పుడూ డబ్బుకు ఇబ్బందిపడ్తూనే వుంటారు. ఆయన జీతం అంతా ఇంట్లో వాడితే మా ఐదుగురికీ సలక్షణంగా సరిపోతుంది. మొన్నటికి మొన్న 'పెద్దాడబడుచును శ్రావణమాసం నోములకు తీసుకురమ్మ'ని ఆయన్తో అంది. ఆయన 'నాదగ్గర డబ్బులు లేవమ్మా' అన్నారు. 'అదేంటిరా, రంగడు కూడా సంపాయిస్తూవున్నాడుగా. సంపాయిస్తూన్న తమ్ముళ్ళు ఇద్దరు ఉండికూడా నోములకు తీసుకురాకపోతే బావుండదు' అంది ఆవిడ. 'ఏమోనమ్మా! నావల్ల కాదు. నా జీతమంతా నీకే ఇస్తున్నాగా' అన్నారాయన. 'ఇస్తున్నావులే నాయనా! నీ చీటీలూ, మీ ఖర్చులూ పోనేగా నువ్విస్తున్నది' అందావిడ నిష్ఠూరంగా. అంటే మేం చీట్లేం కట్టుకోగూడదు, ఖర్చులు పెట్టుకోకూడదనేగా ఆవిడ ఉద్దేశం. మామగారు పోయిన దుఃఖంలో కూడా ఆమె కూతుర్ని నోములకు తీసుకురావాలన్న తాపత్రయం చూశావా మరి!"

"అదేంటీ, పెద్దదికదా ఆవిడకు తెలియదా! ఏడాదిలోపల ఏ శుభకార్యాలు చేయగూడదని. తెలియకేంలే తెలుసు. మమకారం. సరే, నువ్వు గమనించావో లేదో, రోజూ పురాణమని కొంపలో జనాన్ని పోగుచేస్తుందికదా! అక్కడ నాలుగు మంచి కబుర్లు చెప్పుకోవచ్చుగా. అక్కడ వాళ్ళపని నన్ను ఆడిపోసుకోవటమే. ఈవిడ చెప్తూవుంటుంది, మా పెద్దకోడలిట్లా, మా చిన్నకోడలిట్లా అని. అక్కడకేదో మనం ఆవిడని రాచిరంపాన పెడ్తూన్నట్టు. ఇహ వాళ్ళు సలహాలిస్తూవుంటారు, కోడళ్లనెట్లా అదుపు చెయ్యాలో. మన కొంపలో వంద విషయాలుంటాయి. అవన్నీ బయటవాళ్ళకెందుకు చెప్పుకోవాలి? మనల్నెందుకు వాళ్ళ ముందు చులకన చెయ్యాలి. చెప్తే వాళ్ళేం ఆర్చేవాళ్ళా, తీర్చేవాళ్ళా? నువ్వేమయినా అనుకో అమ్మాయి! నువ్వు జాగ్రత్తపడకపోతే నీ మొగుడితో సంసారం కూడా చేయనీయదీ

విడ" అంది కాళింది.

"అదేమక్కా..." అంది భయపడిపోతూ సంయుక్త

గొంతు తగ్గించి మెల్లగా తగ్గుస్వరంతో చెప్పింది కాళింది, "నువ్వు గమనించావో లేదో, రాత్రిళ్ళు ఆవిడ మన గదుల్లోకి తొంగి చూస్తూ వుంటుంది. అంత వయస్సొచ్చిన మనిషికి అదేంబుద్ధో నాకర్థంకాదు. మన తల్లి స్థానంలో వున్న మనిషిని గూర్చి నేనెందుకు అబద్ధాలు చెప్తాను? ఆమె ఎట్లాంటి మనిషయితే నాకెందుకుగాక! ఆ సమయంలో బెడ్ రూంలో మనమేస్థితిలో వుంటామో ఏంటో, ఇంకోళ్ళెవరో మనని గమనిస్తున్నారన్న ఆలోచన వచ్చినప్పుడు నా వళ్ళు జలదరించిపోతుందనుకో! ఇక్కడున్నన్నినాళ్ళూ ఆయన్ని దగ్గరకు రానిచ్చేదాన్ని కాదు. ఈవిడ మన్ని చూస్తూవుంటే మనం కాపురమేంచేస్తాం. ఆ బాధ పడలేకే ఆయన వేరుకాపురం పెట్టారు''

"ఛీ పాడు. అదేంబుద్ధి ఆవిడకు. రాత్రి నుండి కిటికీ రెక్కలు కూడా వేసేస్తాను. ఆ మాట వింటేనే కంపరంగా వుంది నాకు'' అంది సంయుక్త వికారంగా ముఖంపెట్టి.

"మనం మొగుళ్ళతో హాయిగా కాపురం చేసుకోవటం ఆవిడకిష్టముండదు. తన కూతురు అత్తింటికెళ్ళినట్టేగా మనమూ కాపురానికొచ్చింది. ఆ ఇంగితజ్ఞానం ఆవిడకు లేదు. ఈ చేసే తప్పుడుపనులు కప్పిపుచ్చుకోటానికే ఈ పురాణాలు, పాండిత్యాలు, పాటలూ, పద్యాలూను. వీటిని చూసి నువ్వు మోసపోకు''

"ఇలాంటి కొంపలో వుండాలంటే నాకు భయమేస్తోంది అక్కా! మా పుట్టింటికి వెళ్ళిపోతాను'' అంది సంయుక్త

"అంత భయపడాల్సినపనేం లేదు. మనం పారిపోతే అది అలుసుగా తీసుకుని నీ మొగుడికి మనసు విరిచేస్తుందావిడ. చివరకు నష్టం జరిగేది నీకేగా. పీడా పోయిందని కొడుక్కింకో పెళ్ళిచేస్తుంది.

"అమ్మో... అమ్మో... మహా దుర్మార్గురాలులాగుందే ఈవిడ"

"నువ్వు చెయ్యాల్సినపనల్లా డబ్బు నీ గుప్పెట్లో పెట్టుకోవటం. అంటకాలుస్తుంటే కమ్మిచ్చున తీసినట్టుంటుంది. విఠలుకు చెప్పు జీతం తెచ్చి నీకియ్యమని. నువ్వే ఇంటిఖర్చులకు వాడు. నీ మొగుడు సంపాదించటం, అత్తమూకంతా పడి తినడం నీకేమోగాని నాకుమాత్రం నచ్చలేదు. మావారికీ తెల్సు తల్లి సంగతి. అయితే తల్లిని నోరెత్తి ఏమంటారు? ఏం మాట్లాడలేకే మేం వెళ్ళిపోయాం"

ఇలా గీతాబోధ ముందువసారాలో పురాణ కాలక్షేపమ్మైందాకా కొనసాగింది. ఇంక వెళ్ళి తన సామ్రాజ్యాన్ని ఏలుకోవాలి కనుక, పర హితచింతనా కార్యక్రమాన్ని ముగించి వెళ్ళిపోయింది కాళింది.

ఆరోజు రాత్రి అత్తగారు ఏంచేస్తున్నారా అని రెండుమూడుసార్లు కిటికీలోనుండి తొంగిచూసింది సంయుక్త మంచంమీద కూర్చుని జపమాల తిప్పుతున్న అత్తగార్ని చూడంగానే తనేం పొరపాటు పడలేదుకదా అని సంశయించింది. ఒకోసారి జపమాల పక్కనే పెట్టి, తలెత్తి ఎటో చూస్తున్న ఆమె తమ కిటికీవంకే చూస్తున్నట్లనిపించింది సంయుక్తకు. కిటికీ రెక్కలు భళ్ళున వేసి వచ్చి పడుకుందిగాని ఆమెకు నిద్రపట్టలేదు. కాసేపుండి మళ్ళీ కిటికీ రెక్క తెరవగానే కిటికీపక్కనుండి బాత్ రూంవైపు నడచి వెళ్తున్న రంగనాయకమ్మ కన్పించిందామెకు. సంయుక్త సంశయంలోపడిపోయింది. తను కిటికీ రెక్క తెరవటం చూసి బాత్‌రూంవైపు వెళ్ళిందా, లేక అంతకు ముందుదాకా రెక్కల సందులోనుండి తమను గమనిస్తున్నదా అన్నది తేల్చుకోలేకపోయింది.

సంయుక్త నిద్రపోక కిటికీరెక్కలు తెరవటం, మళ్ళీ భళ్ళున మూయటంతో విఠలాచార్యులకు మెళకువ వచ్చింది.

"ఏమిటీ కిటికీదగ్గరేంచేస్తున్నావు, వచ్చి పడుకో' అన్నాడతను.

"ఈ కిటికీలోంచి మన్నెవరైనా చూడొచ్చు"' అంది రెక్క మూసి భర్తపక్కన పడుకుంటూ సంయుక్త

"ఎవరు చూస్తారు ఇంతరాత్రప్పుడు" అన్నాడతను.

"మీ అమ్మ..."

"ఛట్, నోర్ముయ్. ఆవిడకేంపని మన్ని చూట్టానికి"

"నేను కిటికీ రెక్క తీసేటప్పటికి ఆమె బాత్‌రూంకెళ్ళటం కన్పించింది"

"వెళ్తే... లోపలికి తొంగిచూసినట్టేనా? నోర్మూసుకుని పడుకో"

భర్తకు సరైన సమాధానమేమీ సంయుక్త చెప్పలేకపోయిందిగానీ, సంయుక్తకుమాత్రం నిద్రపట్టలేదు ఆ రాత్రి.

మర్నాడు పొద్దున కిటికీకి రెండుపక్కలా మేకులు కొట్టి దళసరి దుప్పటిని కర్టెన్‌లాగా వేసింది, కిటికీలోనుండి చూసేవాళ్ళకు ఏం కన్పించకుండా. అయినా ఆ రాత్రి కూడా ఆమెకు తమనెవరో గమనిస్తున్నట్టే, కర్టెన్‌లో నుండి చూస్తున్నట్టే అన్పించింది.

మర్నాడంది సంయుక్త అత్తగారితో-

"ఎందుకూ రాత్రిపూట అలా అలంగం తిరుగుతారు? నిక్షేపంగా నిద్రపోక" అని.



"నిద్ర పట్టదే అమ్మాయి! తోచక తిరుగుతుంటాను'' అంది రంగనాయకమ్మ.

అయితే మా గదిలోకి తొంగిచూడవద్దు అని అత్తగారితో ఎలా చెప్పాలో తెలియక కొట్టుమిట్టాడింది సంయుక్త.

ఇలా రోజూ అత్తగార్ని పర్యవేక్షించే కార్యం చేపట్టిన సంయుక్తకు అత్తలో చెడులక్షణాలే కన్పించసాగాయి. కాళింది అప్పుడప్పుడు ఇతోధికంగా ఆజ్యం పోయసాగింది.

ఓసారి-

"ఒరే అబ్బాయి! అలివేలు స్కూల్లోపిల్లలంతా అదేదో ఎక్సకర్షన్‌కి వెళ్తార్ట. వంద రూపాయలుంటే ఇమ్మంది'' అని కొడుకుతో చెప్పింది రంగనాయకమ్మ.

భర్త ఏం సమాధానం ఇస్తాడోనని ముందుగానే సంయుక్త అంది, "ప్రతినెలా మాసికపు ఖర్చులకే చాలా అవుతోంది. ఆపైన నా డాక్టరు ఖర్చులు. ఆయన డబ్బుకు ఇబ్బంది పడిపోతున్నారు'' అని.

రంగనాయకమ్మేం మాట్లాడలేదు. విఠలాచార్యులు భార్యవంక చిత్రంగా చూశాడు.

"అయినా ఆడపిల్లలకు ఎక్స్‌కర్షన్లెందుకు? ఎటుపోయి ఏం వస్తుందో ఎవరికి తెలుసు. స్కూలుకెళ్ళి చదువుకుంటోందిగా అది చాలు'' అంది సంయుక్త తానే.

మరోసారి-

రంగనాథం కాకరకాయ కూర తినడని ఆలుగడ్డ వేపుడు చేసింది రంగనాయకమ్మ. "ఇలా మనిషికోరకం చేస్తుంటే కొంప గుండమైపోతుంది. ఎంతకని ఆయన కష్టపడతారు. సంసారం ఒద్దికగా గడుపుకోవాలని అందరికీ వుంటే బావుంటుంది'' అని అంది సంయుక్త.

అయితే, అత్తగారిబారినుండి సంయుక్తకు త్వరలోనే విముక్తి లభించింది.

అసలు సౌభాగ్యలక్ష్మికీ, రామాచార్యులకీ సంయుక్తను అత్తింట్లో వుంచటం ఇష్టంలేదు. అదృష్టవశాత్తూ కూతురు గర్భం ధరించటంతో నాల్గోనెల్లోనే తమదగ్గరకు తెచ్చుకున్నారుకాని మరుసటి నెలలోనే నరశింహాచార్యులు చనిపోవడం, అల్లుడు 'మా అమ్మ వంటరిగా వుంద'ని వంక చెప్పినప్పుడు, కూతుర్ని అత్తింటికి పంపక తప్పలేదు వాళ్ళకు. ఆ మరుసటినెల్లో పక్కింటివాళ్ళతోపాటూ భార్యాభర్త తీర్థయాత్రలకెళ్ళిరావటంతో కూతుర్ని అత్తింట్లోనే వుంచాల్సివచ్చింది వాళ్ళకు. తీర్థయాత్రలనుండి రాంగానే సౌభాగ్యలక్ష్మి వచ్చి, రంగనాయకమ్మకు, విఠలాచార్యులకూ చెప్పి సంయుక్తను ఏడోనెల్లో పుట్టింటికి తీసుకువెళ్ళింది.

విధిలేక అత్తింట్లో వదలివెళ్ళిన కాలంలో కూతురు ఏమన్నా చెడిపోయిందేమోనని ఇంటికి తీసుకురాగానే సౌభాగ్యలక్ష్మి కూతురికి జ్ఞానబోధ చేయసాగింది. అక్కగారి తర్ఫీదులో ఆమె కొంతవరకు శిక్షణపొందిన విషయం పాపం ఆమెకు తెలీదు. అయితే సంయుక్త చాలా సరళస్వభావురాలు. హితోపదేశపు వేడి చల్లారిపోతే మళ్ళీ వెనకటి సంయుక్త అయిపోతుంది. అందువల్ల అలా చల్లారిపోనివ్వకుండా కూతురి బుద్ధి పదునుగా వుండే కార్యక్రమాన్ని సౌభాగ్యలక్ష్మి స్వీకరించింది.

అసలు అల్లుణ్ణి ఇల్లరికం తెచ్చుకోవాలనే ఉద్దేశంతో వున్న సౌభాగ్యలక్ష్మికి కూతురి కాపురంలో వుండే అదనపు పక్షులన్నీ అత్త ఆడబిడ్డ, మరిదీ ఆమెకు ఎక్కసంగా కనిపించే వాళ్ళు. వాళ్ళు తమ అల్లుడి సంపాదన భక్షించే గాదెకింది పందికొక్కుల్లా కన్పించేవాళ్ళు ఆమెకు. తమ కూతురి కష్టాన్ని దోచుకునే వ్యర్థమైన పెట్టుబడిదారుల్లా కన్పించేవాళ్ళు.

"అమ్మాయి! నిన్ను చూసి నా గుండె తరుక్కుపోతోందే. పిల్లాడి అందంచూసీ, జాతకం తెలిసినవాడనీ మోహంలో పడిపోయి మీ నాయన నీ గొంతు కోశాడే! అక్కడికీ నేను చెప్తూనేవున్నా! ఇల్లరికానికి ఇష్టపడేవారిని అల్లుడిగా తెచ్చుకుందామని. నా మాట వింటేగా మీ నాయన. ఇంత సంసారానికి మీ

ఆయనొక్కడూ ఏం సంపాదించి పెట్టగలడు, నువ్వేం చాకిరీ చేయగలవు? మీరేం ఏర్పాటు చేసుకోపోతే మాకు గుండెలమీద కుంపటి అయిపోతుందే నీ కాపురం సంగతి. అవునూ, మీ అత్త ఎప్పుడూ పురాణకాలక్షేపం చేయట మేనా, ఇంట్లో పని చేయటమేమయినా వుందా?" అనడిగింది సౌభాగ్యలక్ష్మి.

సంయుక్తకు అబద్ధాలు చెప్పటం రాదు. "లేదమ్మా! పనంతా ఆవిడే చేస్తారు. నేను పెద్దగా కష్టపడుతున్నదేంలేదు''

"మీ ఆడబిడ్డ అలివేలు స్కూలుకెళ్ళి చదువుకోవటమేనా? ఇంట్లో అటుపుల్ల ఇటు పెట్టినట్టు కనపడదు!"

"ఇంకా చిన్నపిల్లేగా. ఒక్కతే చెల్లెలని ఆయనకు ఆ పిల్లంటే గారాబం"

"అట్లా మురిసిపోకే నా తల్లీ! నువ్వసలే అమాయకురాలివి. మనుషుల స్వభావం నువ్వంచనా వేయలేవు. మనుషులు పైకట్టాగానే కనపడ్తారు.. అవునూ, ఆ పిల్లకు చదువెందుకూ, పెళ్ళిచేసి పంపించెయ్యొచ్చుగా''

"ఇంకా చిన్నపిల్లేగా, అప్పుడే. ఏం పెళ్ళి?"

"నీ ముఖం నీకేంతెల్సు. మా కాలంలో ఈ వయసుకు ఇద్దరు పిల్లల తల్లులయ్యేవాళ్ళం. అదిసరే, రంగనాథం జీతమంతా తెచ్చి మీ ఆయనకిస్తాడా! లేక సంసారం సంగతి అన్న చూసుకుంటాడులే అని డబ్బు వెనకేసుకుంటున్నాడేమో నువ్వేమయినా గమనించావా?"

కానీ సంయుక్తకు ఇవన్నీ పట్టనివిషయాలయ్యాయి. కాళింది ప్రబోధించిన విషయాల్లో 'అత్తగారు గదుల్లోకి తొంగిచూస్తున్నద'న్న విషయం తప్ప మిగతా విషయాల్లో ఆమెకెలాంటి ఆసక్తీ జనించలేదు. తల్లికావిషయం చెబ్దామని పస్తాయించింది. అందుకే "ఏమోనమ్మా! డబ్బు సంగతి నాకేంతెలియదు. మా అత్తగారూ, ఆయనే చూసుకుంటారు'' అని అంది.

ఇంత అమాయకురాలైన కూతుర్ని చూసి నిర్విణ్ణ అయింది సౌభాగ్యలక్ష్మి.

"అట్టా అనకే పిచ్చిమొద్దూ! ఇంటి యజమానురాలైందానికి ఏమీ పట్టనట్టుంటే కొంప కొల్లేరయిపోతుంది. మీ అత్తగారు పెద్దకూతురికి దోచిపెడ్తోంది. మీ మరిది సంపాదనంతా బాంకులో వేసుకుని మీకు మొండిచెయ్యి చూపెడ్తారు. మన జాగ్రత్తలో మనముండకపోతే నష్టపోయేది మనమేకానీ, వాళ్ళకేం వాళ్ళు హాయిగా వుంటారు. అవునూ, మొన్న మీ బావగారి కొడుకు పుట్టినరోజని చెప్పి మనవడికి ఉంగరం చేయించిందటకదే మీ అత్తగారు. అంత డబ్బెక్కడనుంచి తీసుకువచ్చిందీ. ఆ విషయం నీకు తెలుసా?"

"మా మరిది వెంకటాచార్యులనుంచి ఇలా అని చెప్పి డబ్బు తెప్పించింది. ఆయనకు చెప్పే చేయించింది'' అంది సంయుక్త.

"చూశావా! మీ మావ పోయాడని వంకచెప్పి నీకు సీమంతం చెయ్యకుండా ఎగ్గొట్టింది. మనవడికి ఉంగరం చేయించటానికిమాత్రం ఏటిసూతకం అడ్డురాలేదు. ఇలా కొనసాగితే మీ పని తిరుమంగళమేనమ్మాయి! నువ్వు నాదానుపిల్లవి. నేనే ఏదయినా చెయ్యాలి'' అంది సౌభాగ్యలక్ష్మి నొచ్చుకుంటూ.

సంయుక్తకూ అప్పుడు తల్లి నొచ్చుకోటంలోగల యదార్థత గోచరించింది. నిజమే తనకోసం అత్తగారేంచేసింది కనుక! అని ఆమెకూ అన్పించింది.

అలా పురుటికి, పుట్టింటికి వెళ్ళిన సంయుక్త మళ్ళీ అత్తింటిముఖం చూడలేదు. ఆమెకు ఆడపిల్ల పుట్టింది. రమ అని పేరుపెట్టారు. బాలింతగా వుండగానే చూలింత అయింది సంయుక్త. గారాబంగా చూసుకునే తల్లిదండ్రులు కూతుర్ని మళ్ళీ ఆ ఆరళ్ళకొంప అత్తింటికి పంప నిరాకరించారు. ఆమె తల్లిదండ్రులు అల్లుణ్ణి ఇల్లరికం తెచ్చుకునే ప్రయత్నంచేశారు.

ఆ ప్రయత్నంలోనే-

"చూడు నాయనా విఠలా! నేనిట్లా చెప్పానని నీవేం అనుకోవద్దు. చెప్పాల్సిన ధర్మం నాది కనుక చెప్పాల్సివస్తోంది. మీ తమ్ముడు రంగనాధానికి ఉద్యోగమొచ్చింది. అతడు సంపాదిస్తున్నాడు. ఆ వచ్చే డబ్బు ఆ ముగ్గురికీ సరిపోతుంది. ఇక్కడ మేమిద్దరం ముసలివాళ్ళమైపోయాం. నాకేమో బ్లడ్‌ప్రెజర్. నేనేపనీ చేసుకోలేకుండావున్నాను. మీ మావగారి సంగతి తెల్సుకదా! ఆయన మాత్రం ఈ వయసులో ఏం చేయగలరు! కనుక మీరు వచ్చి మా ఇంట్లో వుంటే మాకెంతో ఆసరాగా వుంటుంది. మాకు ఇది ఒక్కతే. లేకలేక కలిగిన బిడ్డ. దాన్ని మా కళ్లెదుట చూస్తుంటే మాకూ ముచ్చటగా వుంటుంది. మరేమంటావో చెప్పు?" అంది అతని అత్తగారు సౌభాగ్యలక్ష్మి తమ పథకానికి నాందిపల్కుతూ.

"మరి మా అమ్మ ఏవంటుందో, ఇంకా చెల్లెలి పెళ్ళి కూడా కాలేదు'' అన్నాడు విఠలాచార్యులు.

విఠలాచార్యులకీ, తల్లికీ మనసు కలుస్తుంది. ఆమెకి ఇష్టంలేని పనిచేయటం సామాన్యంగా అతనికిష్టముండదు. చిట్ల వలయంలో చిక్కుకున్న అతనికి చిట్లవల్ల డబ్బు రావటం, అది బ్యాంకులో జమపడటం బాగానే వుంది. సగం జీతం వాటికిపోతోంటే మిగిలినసగం తల్లికిచ్చి అతను ఇబ్బంది పడిపోతున్నాడు. అత్తగారింటికొచ్చినందువల్ల అతనికి ఒకింత వెసులుబాటు కలుగుతుంది. ఇంటి అద్దె వుండదు. వాళ్ళది సొంతిల్లే. నెలకింతని వాళ్ళకిస్తే వాళ్లే గృహకార్యనిర్వహణ చేస్తారు. ఆలోచనయితే బాగానే వుందిగాని చెల్లెలి పెళ్ళి అయింతర్వాత వేరుపడితే మర్యాదగా వుంటుందన్న ఆలోచన అతనికుంది.

అల్లుడు సందేహించటం చూసి సౌభాగ్యలక్ష్మి కూతురితో అంది. "పోనీ అమ్మా! మీ ఆయనకిక్కడకి రావడం ఇష్టం లేనట్టుంది. మా చావు మేం చస్తాంలే' అని.

"అదేంమాట. ఆయనకెందుకిష్టముండదూ. మిమ్మల్నిలా వదలి నేను మాత్రం ఎలా పోతాను. ఏవండీ ఏసంటారు?" అంది సంయుక్త

విఠలాచార్యులేం మాట్లాడలేదు.

"తల్లికూచే అమ్మా ఆయన. తల్లినొదిలి రావటం ఆయనవల్ల కాదు'' అంది సంయుక్త

"అట్లా కాదు. మా అమ్మతో సంప్రదించకుండా ఎట్లా అని ఆలోచిస్తున్నాను'' అన్నాడు విఠలాచార్యులు.

"అయ్యో! నా మతిమండా. మీ అమ్మగారితో సంప్రదించకుండా ఎట్లా చేస్తాం. ఆవిడ మహాఉత్తమురాలు. ఆమెకు మాత్రం తెలియదా మా బాధ. పోనీ నాయనా! నీకంత సంకోచంగా వుంటే నేనూ, మీ మామగారూ వెళ్ళి మీ అమ్మగారితో మాట్లాడతాంలే' అంది సౌభాగ్యలక్ష్మి.

"చూద్దాంలెండి, తొందరేం" అనన్నాడు విఠలాచార్యులు.

అయితే వాళ్ళకి తొందరగానే వుంది. ఓరోజు సౌభాగ్యలక్ష్మి, రామాచార్యులూ వెళ్ళి రంగనాయకమ్మతో ఆమాట చెప్పారు. ఆమెకు ఆ ప్రస్తావన వాళ్లు తీసుకురావటం కష్టమనిపించింది. అదే కొడుకు చెప్పొచ్చుగా అనుకుందామె. పైకి, "సరే, మీకందరికీ ఎలా వుంటే అలా చేయండమ్మా! నేనేం చెప్పగలను. పిల్లలకు రెక్కలొచ్చి ఎగిరిపోవటం సహజం" అంది ఆమె.

తల్లి "సరే"నన్న తరువాత వారంరోజులు కూడా విఠలాచార్యులు తల్లి దగ్గర వుండలేదు.

మళ్లీ సంసారం మామూలే అయింది. రంగనాధాచార్యుల సంపాదన తక్కువ. వేంకటాచార్యులు డబ్బు పంపుతే పంపుతాడు, లేకపోతే లేదు. రంగనాధాచార్యుల కొచ్చే సంపాదనతో ముగ్గురు బతకటం కష్టమే అయింది. అయితే ఆమె ఆ బాధ ఎక్కువ కాలం పడాల్సినపని లేకపోయింది. రెండేళ్లలో రంగనాధాచార్యులు బ్యాంక్ పరీక్షలు రాసి

పాసయి బ్యాంకు ఉద్యోగం సంపాదించటంతో ఆమె ఆర్థికంగా గట్టునపడింది.

భర్త పోయిన మూడో సంవత్సరం రంగనాయకమ్మ మూడో కొడుక్కూ, రెండో కూతురికీ వివాహం చేసింది. అలివేలుకి అప్పటికింకా పదహారేళ్ళే. పెద్ద కొడుకుగా శేషశయనాచార్యులు అలివేలుకు సంబంధం చూసి తన బాధ్యత నిర్వర్తించుకున్నాడు. వెంకటాచార్యులకు సంబంధం తేలిగ్గానే కుదిరింది. వేంకటాచార్యుల కొచ్చిన కట్నం డబ్బు అలివేలుకిచ్చి పెళ్ళిచేశారు. పెళ్ళిఖర్చులు పెద్దవాళ్లు ముగ్గురూ తలా ఇంత అని వేసుకుని కార్యాల్ని గట్టెక్కించారు. మాధవస్వామిని కన్న తర్వాత మళ్లీ ఎనిమిదేళ్లకు గర్భవతైంది కాళింది. సంయుక్తకిద్దరు పిల్లలు. మళ్ళీ గర్భవతి ఆమె. అందువల్ల కోడళ్లు పెళ్లిపనుల్లో అత్తగారికేం సాయం చెయ్యలేకపోయారు. పెళ్ళి వారంరోజులుండనగా ఆండాళమ్మ వచ్చి తల్లికి సాయం చేసింది పెళ్ళిపనుల్లో.



ఆ తరావాత మరి మూడేళ్ళకు రంగనాథాచార్యుల వివాహం చేసింది రంగనాయకమ్మ. కమల అతనితోపాటే బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తుంది. ఇద్దరికీ ఇష్టమైంది. వాళ్లూ శ్రీవైష్ణవులే అవటంతో రంగనాయకమ్మ అభ్యంతరమేమీ పెట్టలేదు. కాబోయే భార్యాభర్తలిద్దరూ సంప్రదించుకుని చాలా సింపుల్‌గా వివాహం చేసుకున్నారు.

రంగనాథాచార్యుల పెళ్ళి అని తెలియగానే కాళిందికి ఇహ అత్తగారి విషయం తేల్చుకోవాల్సిన సమయం ఆసన్నమయిందని అర్థమైంది. ఆమె తన బాధ్యత ఏమర్చే మనిషికాదు. సంయుక్తతోనూ సంప్రదించింది. సంయుక్తకెప్పుడూ అక్కగారు చెప్పే మాటలు సమంజసంగా కన్పడతాయి.

"ఇంక రంగనాధం పెళ్ళయిపోతే ఆమె అన్నిళ్లూ నావే అనే ప్రమాదముంది. ఇన్నాళ్ళూ ఉమ్మడి కుటుంబంకింద ఆయనా, విరలూనే దోచిపెట్టారు. ఇహ ఆవిణ్ణి చూడాల్సిన బాధ్యత వెంకయ్యదీ, రంగనాధందే. వెంకయ్య, రుక్మిణీ రంగనాధం పెళ్ళికి వస్తారుగా. మనం ఏవిషయం తేల్చుకోవాల్సిందే. లేకపోతే 'పెద్దాడా, విరలూ' అంటూ మన ఇళ్ళకే తయారవుతుందామె. వీళ్ళేమో తల్లిమాట కాదనలేరు. నువ్వేమంటావు సంయుక్తా!" అంది కాళింది.

"నిజమేనక్కా! వెళ్ళారంటే వాళ్ళు మళ్ళీ పత్తావుండదు. పెళ్ళిళ్ళకీ చావులకేగా వచ్చేది. మా అమ్మ అంటూనే వుంది 'రంగనాథం పెళ్ళయితే, మీ అత్తభారం నీకు తప్పదే అమ్మాయి! నీ మొగుడో మెతకమనిషా, తల్లిని తన దగ్గరకు తెచ్చుకుంటాడు. చూస్తూండు. నేను చెప్పిన మాట నిజమవుతుందో లేదో అని. ఈసారి రుక్మిణి వచ్చినప్పుడు తేల్చుకోవల్సిందే" అంది సంయుక్త.

రుక్మిణీ, వేంకటాచార్యులూ రంగనాథాచార్యుల పెళ్ళికి రానేవచ్చారు. పెళ్ళయింది. నూతన దంపతుల గృహప్రవేశమూ అయింది. నూతనదంపతులు సాయంత్రం చెట్టాపట్టా లేసుకుని అటు ఆరుతరాలు ఇటు ఆరుతరాల కథలు చెప్పుకోటానికి బయటకు వెళ్ళినప్పుడు కాళింది ఆదేశం ప్రకారం విషయం కదిపాడు శేషశయనాచార్యులు.

"ఒరే వెంకన్నా, ఇంక అమ్మ సంగతి మీరిద్దరూ కూడా పట్టించుకోవాలి. ప్రస్తుతం అమ్మ రంగడిదగ్గరుందనుకో. ఇంతవరకూ

అమ్మ నీ దగ్గరెప్పుడూ వుండలేదు. ఈసారి మీరెళ్ళేటప్పుడు అమ్మను మీతో తీసుకెళ్ళండి'' అన్నాడు శేషశయనాచార్యులు.

"అమ్మకు అక్కడ కష్టంగా వుంటుందన్నయ్యా! మనదేశంకాదు, మన భాష కాదు. అమ్మకేం తోచదు. అందుకే తీసుకెళ్దామని మనసులో వున్నా కుదర్టంలేదు'' అన్నాడు వేంకటాచార్యులు.

"అలా అని తప్పించుకుంటే కుదర్దయ్యా! మీ అమ్మ బాధ్యత నీకు మాత్రం లేదూ. నువ్వు మాట్లాడవేం విఠలూ! చెప్పి ఆయనొక్కడే పెద్దవారు కావాలా?" అంది కాళింది.

"అదేం లేదు వదినా! పెద్దవాడు అన్నయ్య మాట్లాడుతున్నాడు కదా అనే నేనేం మాట్లాడలేదు. ఏమంటావురా మరి, అన్నయ్య చెప్పింది కూడా నిజమే'' అన్నాడు విఠలాచార్యులు.

"అక్కడకు వెళ్ళింతర్వాత పిలిపిస్తాను. ఉన్నపళంగా అంటే కుదర్దు''

"అట్టా అంటే కాదు. ఎందుకు కుదర్దో సహేతుకంగా చెప్పు'' అన్నాడు శేషశయన్రాచార్యులు.

"రేపు చెప్తా''

"ఓహో మీ ఆవిణ్ణి సంప్రదించాలి కాబోలు'' అంది కాళింది.

ఆ మాటతో కోపం వచ్చింది వేంకటాచార్యులకు. "నేను అందర్లా భార్య సలహామీద నడిచేవాడిని కాదు'' అన్నాడు.

"తప్పుడు కూతలు కూయకు. ఎవడ్రా భార్య సలహామీద నడిచేది? నువ్వు బోధన్ నుండి హైదరాబాదు వచ్చే సమయానికి నీ వయసెంత? నా స్వార్థం నేను చూసుకుంటే మీరంతా పైకి వచ్చేవాళ్ళా?" అన్నాడు శేషశయనాచార్యులు.

"నాన్న ఆస్తి తిన్నవాళ్ళు పెట్టారు. అదో ఘనకార్యంకాదు''

"ఛీ, వెధవన్నర వెధవ! తప్పుడు కూతలు కూయకు. ఆయన ఆస్తి ఎప్పుడో కూకింది. ఆస్తి హరించుకుపోయినందుకు బాధ పడ్డది మేం కానీ నువ్వు కాదు. నా చెమటోడ్చి మిమ్మల్నందర్నీ పెంచిపోషించాను. కనీసం కృతజ్ఞతలేదు నీకు! ఛా''

"ఒరే వెంకన్నా! నోరు ఆచి మాట్లాడు. మన చిన్నప్పుడే నాన్న ఆస్తి అంతా మంగళం పాడించారు. మేం తినిపోవటానికి ఆయన ఆస్తినేం మిగల్చలేదు'' అన్నాడు విఠలాచార్యులు.

"అంటే మేం మీరెక్కల కష్టంమీదే బతికి బట్టకట్టామన్నమాట. నాన్న చచ్చేవరకూ సంపాదించాడే. మరి ఆయన సంపాదనంతా ఏమయింది? అక్కడకు మీరేదో మమ్మల్ని పూర్తిగా పెంచి పోషించినట్లు మాట్లాడుతున్నారు'' అన్నాడు వేంకటాచార్యులు.

"ఇంక వాగావంటే నేను మనిషిని కాదు, జాగ్రర్త!" అని తమ్ముణ్ణి కొట్టటానికన్నట్టుగా లేచాడు శేషశయనాచార్యులు.

"ఊర్కోవయ్యా పెద్ద! పెట్టావో లేదో కానీ నీకింద బతికిన బతుకుసంగతి మాకు తెల్సు. నువ్వు పెద్దగా అరిస్తే నేనూ అంతకంటే పెద్దగా అరవాల్సివస్తుంది''

"ఏంట్రా ఏం కూశావ్...!" అని శేషశయనాచార్యులు తమ్ముణ్ణి కొట్టటానికి పోయాడు. కాని మేనమామ రామానుజాచార్యులొచ్చి ఆపేశాడు.

"ఒరే వెంకటాచార్యులూ చిన్నంతరం, పెద్దంతరం లేకుండా ఏమిటిరా ఆ మాటలు నువ్వు నోర్ముయ్యి. అయినా పెద్దవాడివి శేషూ! నీకేం వచ్చిందిరా! వాడు ఆవేశపడ్తే నువ్వూ ఆవేశపడటమేనా. పద నువ్వు బయటికి పద" అని ఇద్దర్నీ కూకలేసి పెద్దమేనల్లుణ్ణి బయటకు తీసుకెళ్ళాడు రామానుజాచార్యులు. విఠలాచార్యులకూ ఆ వాతావరణం నచ్చక బయటికి వెళ్ళిపోయాడు.

భర్త మరిదీ అస్త్రసన్యాసం చేసి వెళ్ళిపోవటంతో కాళింది ఇహ నడుంకట్టక తప్పలేదు. చెంపలు పటపటా వాయించుకుంటూ, "బుద్ధో

చ్చింది నాయనా! బుద్ధొచ్చింది. ఇంక నీతో మాట్లాడితే ఒట్టు. ఇప్పుడు మేం కన్పించేటట్టు న్నామా నీకు. అన్ననే కొట్టటానికి లేచినవా డివి. ఇంక వదినకు గౌరవాలేంవుంటాయి. ఎస్సెస్సీ ఎన్నేళ్ళు తప్పితేనేం. నీ బుద్ధి మాత్రం మహా పదునుతేలింది'' అంది కా ళింది.

"అది కాదు వదినా! నా ఉద్దేశం" అని వేంకటాచార్యులు ఏదో చెప్పబోయారు. కాని ఇహ తను నడుం బిగించకపోతే తన ప్రాణేశ్వ రుడు అసమపోరాటంలో ఓడిపోవటం ఖాయ మని తల్చిన రుక్మిణి రంగప్రవేశం చేసింది.

"ఎందుకట్లా నీళ్ళు నములుత్తారు? ఉన్న సత్యం చెప్పటానికి వెరపెందుకండీ. ఏడేళ్ళ నుండి నెలనెలా మీ అమ్మగారికి ఉమ్మడి ఖర్చుకింద డబ్బు పంపిస్తున్న విషయం ప్రస్తా వించరేం. ఏమన్నా చేసివుంటే దాన్ని అణాపై సలుతోసహా లెక్కగట్టి తీర్చేశామని చె ప్పండి''

"ఏం పంపించాడమ్మా మీ ఆయన? అంత డబ్బు పంపిస్తే మామగారు జబ్బు పడినప్పుడు అంత డబ్బుకు ఇబ్బంది పడా ల్సివచ్చేదా? ఆయన దినవారాలకుగాని, అలి వేలు పెళ్ళికిగాని మీరేం సాయం చేశారో చెప్పు. చేశాం చేశాం అంటే కాదు. ఏం చేశారో గుండెమీద చెయ్యేసుకు చెప్పాలి'' అంది కాళింది రోజుతూ, రొప్పుతూ.

"నా పెళ్ళి కాకముందు నాలుగేళ్లూ ఆయన జీతమంతా అత్తగారికే పంపారట. ఆయన కప్పుడసలు ఖర్చులే వుండేవికావు. ఎటొచ్చీ మా పెళ్ళయిన మూడేళ్ళనుండి మాత్రమే అంతగా పంపలేకపోయాం. గుండెమీద చె య్యేసుకుని చెప్పటానికి నాకేం భయంలేదు. అబద్ధాలు ఆడాల్సిన అవసరమూ లేదు'' అంది రుక్మిణి తొణక్కుండా బెణక్కుండా.

"అవును. నీకేం భయం. నువ్వు గుండెలు తీసిన బంటువు కదూ. నీ పెళ్ళవకముందు నీ మొగుడేం డబ్బు పంపాడో నాకు తెల్సు. తెలీని విషయాలని తెల్సినట్టు చెప్పొద్దు. వాళ్ళని ఇంతింత చిన్నపిల్లలుగా వుండినప్పటి నుండి సాకిన నాకు తెల్సు'' అంది కాళింది. రుక్మిణి ఎంత జగజ్జెట్టీనో తెల్సుకోకుండా అడుగేసినందుకూ, తన శతృసాధనా సూత్రాల నమలుపర్చనందుకూ పశ్చాత్తాపం కనప డింది ఆమె మాటల్లో.

"ఏం అత్తగారు చచ్చిపోయిందా. నువ్వు సాకటానికి. పెద్దవాళ్లయినందుకు పెద్ద బుద్ధు లుండాలి కాని, ఇలా కొంచెం బుద్ధులుండరా దు. ఉమ్మడి ఆదాయంలో నగలు చేయించు కుని మేమేంపుట్టింటివారు చేయించారని చె ప్పుకోలా. ఎవర్లాగా మేమేం మొగుణ్ణి ఇల్ల రికం వుంచుకోలా'' అంది రుక్మిణి.

"మేం ఏం ఏడ్చినా, అత్తగార్ని చంపలేదే పాపిష్టి మొహందానా! ఆపని నీ దగ్గరకు వస్తేనే జరిగేది'' అంది కాళింది అరుస్తూ. ఓడిపోయిన దీనత్వం వుంది ఆమె ఆక్రో శంలో.

"ఆయన ఇష్టమైవున్నారు. మా పుట్టింటివా ళ్ళకు తాహతువుంది కనుక వుంచుకున్నారు. మధ్య నీదేం పోయిందే గయ్యాళిమొహందా నా! తాహతులేకే చవగ్గా దొరికారుకదా అని మిలటరీ వాడికి కట్టబెట్టారు నిన్ను నీ పుట్టింటి వాళ్ళు. సిగ్గులేకపోతేసరి మాట్లాడటానికి'' అంది సంయుక్త

"ఇదుగో పెద్దొదినా! చిన్నొదినా! కాస్తంత మర్యాదగా మాట్లాడటం నేర్చుకోండి. ఇక్కడ ఎవరూ ఎవరి సిగ్గుశరాలూ ఎంచనక్కరలే దు'' అన్నాడు వేంకటాచార్యులు.

"ఓరి పెళ్ళాం గులామా! మర్యాద నీ దగ్గరే నేర్చుకోవాలి తండ్రీ! అన్నని కొట్టటానికి చెయ్యెత్తినప్పుడే నీ సంస్కారమేమిటో తెల్సి పోయింది. అక్క కుటుంబంలో అత్తగారి తర్వాత అత్తగారంతదికదా! నీ పెళ్ళాం ఆమె ను నానా కూతలూ కూస్తూవుంటే నీకు చీమ కుట్టినట్టు లేదు. పెళ్లాన్ని అనేటప్పటికి పొడు చుకువచ్చింది కాబోలు. వదిన్ననే ముందు నీ



పెళ్ళాం నోటికింత గడ్డిపెట్టు" అంది సంయుక్త కొమ్ముకాస్తూ. అక్క పడిపోవటం ఆమెకు తెలియవచ్చి, ఇహ తను దీటుగా పోరాడకపోతే ప్రమాదమని గుర్తించిందామె. తను నమ్మిన వాళ్ళనెవరైనా ఏమైనా అంటే సహించలేదు సంయుక్త.

"ఎవరు పెళ్ళానికి గులామో నువ్వు చెప్పనక్కరలేదులే. గులాములు కాకపోతే ఎవరు అత్తగారిని వుంచుకుంటున్నారో అది ముందు చెప్పండి. ఆ తర్వాత గడ్డెవరికి పెట్టాలో నిర్ణయించుదాం" అంది రుక్మిణి.





" కొంతకాలం కాకపోతే కొంతకాలమయినా ఆమె మా దగ్గరవుంది. తమరి దగ్గర ఎంత కాలముందో అందరికీ గడ్డి పెట్టగలిగే తీర్పరురాలుగారు చెప్పగలిగితే సంతోషిస్తాం" అంది సంయుక్త.

"డబ్బు పంపిస్తున్నాం, మేం వుంచుకోవాల్సిన అవసరంలేదు'' అంది రుక్మిణి.

"నువ్వు డబ్బు పంపిస్తే ఇక్కడ చెయ్యటానికి నీ సేవకులున్నారా?" అంది సంయుక్త.

"అసలు నువ్వు డబ్బు పంపింది ఎక్కడే?" అంది కాళింది.

"ఆవిడకు కాళ్ళూ, చేతులూ ఏం పడిపోలే దు మీరు సేవచెయ్యటానికి. ఆవిడచేతే పన్లు చేయించుకుంటున్నారు. ఒకవేళ మేం ఒకనె లలో డబ్బు పంపలేకపోయినప్పటికీ ఆమె పన్లు చేసిందానికీ, మీరు పెట్టిన తిండికీ సరికి సరి. అయినా మీరావిడకి పెట్టింది ఇక్ష్వాకుల బాలసారెనాటి సంగతి. రంగనాధానికి ఉద్యోగ మొచ్చినప్పటినుండీ అతనగ్గరే వుంటోంది కదా ఆవిడ. కనుక మీరు మాకు చెప్పా ల్సిందేంలేదు. ఏమయినా చెప్పదల్చుకుంటే ముందు మీరు ఆచరించి ఆ తరువాత చె ప్పండి'' అంది రుక్మిణి.

"అంటే మా అమ్మని పనిమనిషి స్థాయికి దించావన్నమాట రుక్మిణీ!" అంది ఆండాళ్ళు.

"పనిమనిషేం కర్మ, పాకీ మనిషయింది అమ్మ'' అంది అలివేలు.

"ఇదుగో అలివేలూ! చిన్నదానివి, తెలియ నిదానివి తెలియనట్టుండు. నువ్వు నీ అత్తను పాకీ మనిషిస్థాయికి తెచ్చావేమోకాని, మే మంత సంస్కారం లేని మనుషులం కాదు'' అంది సంయుక్త.

"ఆఁ మాబాగా కన్పిస్తున్నదిలే, ఒక్క అమ్మనుంచుకోవటానికి చేసిన రభసలో"

"అవును, పెంచి, పోషించి, పెళ్ళిచేసి సు ఖంగా కాపురం చేసుకోవే తల్లీ అని అత్తవా రింటికి పంపిన మాకు సంస్కారమే ముంటుందీ. అదంతా మీ సాలూరు ఆడబ ద్చులనుండి మేం నేర్చుకోవల్సిందే'' అంది కాళింది, పుంజుకుంటూ.

"అంతా నీ చేతిమీదుగానే మమ్మల్ని వెళ్ళ దీసినట్టు మాట్లాడకు వదినా! బాగుండదు'' అంది ఆండాళ్ళు.

"అవునమ్మా! చేయించుకున్నవన్నీ చే యించుకుని అవసరాలు తీరాక ఏదో అన్నట్లు ప్రవర్తించటం మాకేం తెల్సు. ఎప్పటికప్పుడు పరగడుపే. మేం చేసిందిలేదు పెట్టింది లేదు అంతా మీ ప్రతాపమే'' అంది కాళింది.

"ఏంటమ్మా! పెట్టాను, పెట్టాను అంటావు. ఏం నీ పుట్టింటినుండి దోచి తీసుకొచ్చిపెట్టా వా? మా తోడబుట్టినవాళ్ళు ఏమన్నా పె ట్టారేమో. అదేం ఘనకార్యం కాదు. ఊరికి ఉపకారం కాదు. ఈ మాత్రం అందరూ చేస్తున్నారులే? నీ కొడుకు బాలసారెప్పుడు పెట్టావే చీరె, మా పనిమనిషి కూడా కట్టుకోదు. చాల్చాల్లే మా చెప్పొచ్చావు'' అంది ఆండాళ్ళ మ్మ.

"ఇంక ఆపండి మీగోల. రంగనాధమూ, కమలా వస్తున్నారు. ఆ కొత్తపిల్లకు కూడా తెలియాలా మీరిలా కొట్టుకుచావటం" అని రామానుజార్యులు వచ్చి అందర్నీ అదిలించ టంతో ఎవరికి వారు లేచి వెళ్ళిపోయారు.

ఇంత జరుగుతున్నా తనకేం పట్టనట్టు రంగనాయకమ్మ దొడ్లో తులసి గట్టుమీద కూర్చుని జపంచేసుకుంటున్నది.

పెళ్ళయిన కొద్దికాలంలోనే సూక్ష్మగ్రాహి అయిన కమల పరిస్థితులనర్థంచేసుకోసా గింది.

వాళ్ళ పెళ్లైన తర్వాత రెండేళ్లు మాత్రం వుండగలిగిందేమో రంగనాయకమ్మ రంగనాధాచార్యుల దగ్గర. ఆ తర్వాత తల్లిని వుంచుకోవటానికి వంతులు మొదలయ్యాయి.

★ ★ ★

రంగనాయకమ్మ ఒంటరిదైపోయింది. ఆమె బతుక్కి ఎక్కడా స్థిరం లేకుండాపోయింది. అస్తమానం తమ దగ్గరే వుంటున్నదని చిన్నకో డలుకు కష్టంగా వుంటే ఆమె పెద్దకోడలు దగ్గరకు పోయేది. అక్కడా ఆమె పరిస్థితి అంతే. ఇంటింటి భాగోతం వేరువేరుగా వుండేది.

నలుగురు కొడుకుల దగ్గరా నాలుగు మూ ళ్లు ఒక్కొక్కరి దగ్గరా మూడు నెలలు వుండా లని ఆమె చిన్న కొడుకు అభిప్రాయం. "అ మ్మకు పెట్టాల్సిందంతా మేం నాయన వున్న ప్పుడూ, ఆయన పోయిన తర్వాతా చాలా పెట్టాం. ఇహ అమ్మను చూడాల్సిన బాధ్యత

చిన్నవాళ్లదే'' అని పెద్దకొడుకులిద్దరి అభిప్రాయం. అయితే కొడుకులెవరూ నోరుతెరచి ఇలా అనలేదు. కోడళ్ళే తమ భర్తల అభిప్రాయాలు వెల్లడించేవాళ్లు.

ఒక్కో ఇంట్లో ఒకోరకమైన పరిస్థితి. పెద్ద కొడుకు శేషశయనాచార్యులు అందరి ఎదుటా గొప్పగా చెప్తుంటాడు. "మా అమ్మని నా దగ్గరే వుండమంటే వుండదు. ఆమెకీ మిగతాపిల్లల్ని చూసుకోవాలని వుంటుంది. తల్లిప్రాణం కదా! ఇక్కడుంటే ఆమె జీవితం వెళ్ళమారిపోదా తల్లికి పెట్టననే కొడుకు ఎవడైనా వుంటాడటండీ. అందుకే ఆమె ఇష్టం వచ్చినచోట వుండమంటాను'' అని.

అయితే, కాళింది మాత్రం ఇంత లౌక్యం ప్రదర్శించదు. "ఏ అవాంతరమొచ్చినా ఆవిడకు మేమే కనబడ్తాం. మా పెద్దాడబడుచుకు పెళ్లిచేసి రెండు పురుళ్లు మేమే పోశాం. చిన్నావిడకి కట్నమిచ్చి ఘనంగా పెళ్లి చేశామా... ఇంకా ఏమొచ్చినా మేమే ముందుకురావాలి. మా మరుదులేం పట్టనట్టు వుంటారు'' అని చేసినవీ, చెయ్యనివీ అన్నీ తమే చేసినట్టు చెప్తుంది ఆమె.

తమ ఇంట్లో వుండాల్సిన మూడునెలల కాలం పూర్తికాకుండానే అత్తగారిపట్ల కాళికావతారం దాలుస్తుంటుందామె. సౌఖ్యంగా మాట్లాడితే ఎక్కడ ఆమె తమ ఇంట్లో తిష్ట వేసుకుకూర్చుంటుందేమోనని ఆమె భావన. ఏదో గిల్లికజ్జాలేసుకునేది.

ఓసారి-

కాళింది తమ్ముడు మోహను కూడా అక్కడే వుండి చదువుకునేవాడు. వంటచేయటం మాత్రమే అత్తగారిపని, వడ్డించటం తనే చూసుకునేది కాళింది. ఆమెకు వీలుకాక ఓసారి తమ్ముడికి అన్నం పెట్టమని అత్తగార్ని ఆదేశించింది కాళింది. రంగనాయకమ్మ ఆ ఇంట్లో వుండనప్పుడు అందరూ పెరుగుతోనే భోజనం ముగించేవారు. అత్తగారు వచ్చినప్పటినుండీ పెద్దవాళ్ళందరికీ మజ్జిగ, పిల్లలకు మాత్రమే పెరుగు వేయాలని కట్టడి చేసింది కాళింది. మోహను కూడా పెద్ద పిల్లాడే అనే దృష్టితో రంగనాయకమ్మ అతనికీ మజ్జిగేపోసింది. నిజానికామె సందిగ్ధంలో పడిపోయింది. ఏం వడ్డించాలో ఆమె కర్థం కాలేదు. కోడల్ని అడుగుదామంటే ఏం విపరీతార్థాలు తీస్తుందో అన్న భయంతో, తనలోతానే సమాధానపడి అతనికి మజ్జిగ పోసింది. పనిమీద వంటింట్లోకి వచ్చిన కాళింది, తమ్ముడి కంచంలో మజ్జిగ చూసి అంతెత్తున ఎగిరిపడింది.

"వాడికి పెరుగెయ్యలేదూ?'' అనడిగింది ఆమె. వచ్చిన కోపాన్ని అదుపులో పెట్టుకుంటూ.

"పిల్లలకే పెరుగన్నావు కదమ్మా!" అంది రంగనాయకమ్మ.

"అంటే వాడు పిల్లవాడు కాదా? మీ కళ్ళకెలా కనపడుతున్నాడు వాడు! అసలు వాణ్ణి చూసి మీరు కళ్ళల్లో నిప్పులు పోసుకుంటున్నారు. ఆ మజ్జిగనీళ్లు తాగి వాడు కాలేజీలో అన్ని గంటలెలా కూర్చుండగలడనుకుంటున్నారు? వేడిచేసి జబ్బుల పాలయితే మీ కళ్లు చల్లబడతాయి. మా వాళ్ళపొడే గిట్టదు మీకు. మీ గుంపంతా వచ్చి కొంపమీదపడి తినొచ్చుగానీ, మా తరుపు బంధువులెవరైనా వస్తే మీ కళ్లు కుడ్తాయి. మొన్నమటుకు మొన్న మా మేనత్త మనవడొస్తే వాణ్ణి గుర్తించనట్టే మాట్లాడారట. కాస్తంత కూర్చోబెట్టి కాఫీ కాచి ఇస్తే మీ సొమ్మేం పోయేది? నేను బజారునుండి వచ్చి, వాడికిన్ని కాఫీనీళ్లు కాచిపోసిందాకా గతేలేదు. పోయేటప్పుడు అననే అన్నాడు వాడు, 'పిన్నీ మీ అత్తగారికి అసలు మర్యాదే తెలియదు' అని. నాకెంత చిన్నతనమనిపించిందీ!!"

అలా చిలవలు పలవలుగా, ఒక దాంట్లోనుండి మరొకటితీసి మాట్లాడే ప్రావీణ్యం పెద్ద కోడలు పుట్టింటినుండి తెచ్చుకున్న ఆస్తి అని తెల్సినా వుండబట్టలేక అంది రంగనాయకమ్మ, "అలా చెప్పాడా నీకు! 'కాఫీ ఇస్తాన

య్యా' అన్నాను. 'మా పిన్ని వచ్చి ఇస్తుంది. లేండి. మీకు శ్రమెందుకు' అని అన్నాడే నాతో"

"మరింకేం అంటాడు? కాఫీనీళ్ళకు కూడా గతిలేక మీ ఇంటికొచ్చాను, కాఫీ పోయండి అంటాడా? అసలు మీ వంశంలోనే ఎవరికీ మర్యాద తెలియదు. ఎవరికెలా పెట్టాలోనన్న ఇంగితమూ లేదు. మొన్న మీ పెద్దకూతురు కూతురి పెళ్లి చేసిందిగా. నాకు పెట్టిన చీరె చూశారూ! ఆ రంగూ, ఆ బట్టా మా ఇంట్లో ఇల్లు తుడుచుకునే గుడ్డకంటే కూడా కనాకష్టంగా వుంది. పండగలనీ, పబ్బాలనీ అన్నయ్య ఇంటికొచ్చి దొబ్బి తినిపోవటానికయితే తయారు! పెద్ద వదినకదా, పురుళ్లు పుణ్యాలు పోసింది, ఏ అక్కరొచ్చినా మనం అన్నయ్య ఇంటికే వస్తామే అన్న జ్ఞానం వుందీ ఆండాళ్లుకు?"

రంగనాయకమ్మేం మాట్లాడలేదు. 'ఉన్నంతలో నీకూ బాగానే చూశారు. వాళ్ళదీ అంతంత మాత్రపు కుటుంబమే' అని అందామనుకుంది. కాని కోడలు ఏం మాట్లాడితే ఏం అర్థాలు తీస్తుందో అనే ఉద్దేశంతో మాట్లాడకూరుకుంది రంగనాయకమ్మ.

"లేవరా, లే... ఇంకా కూర్చున్నావేం? మన కొంపలో మనం హాయిగా కావల్సింది వడ్డించుకుని తినేరోజులు పోయాయి. ఎవరేమంటారోనని అస్తమానం భయపడ్తూ ఇతర్ల ఒద్దికలో బతకాల్సిన ఖర్మ కాలింది మన మొహాన" అంది కాళింది తమ్ముడితో.

ఇంక అక్కడ కూర్చుంటే కోడలు ఎక్కడెక్కడి పురాణాలు చదువుతుందోనని లేచి దొడ్లో తులసి గట్టుమీద కూర్చుని, జపం చేసుకోవటానికి తులసిమాల చేతిలోకి తీసుకుంది రంగనాయకమ్మ.

అయితే కోడలు జాడింపు అంతటితో ఆపలేదు. "ఏళ్ళు రాంగానే సరా? రామాయణాలు, భాగవతాలూ చదివితే సరా? జపాలు, తపాలు అని ముక్కు మూసుకుని కొంగజపం చేస్తే చేసిన పాపాలు ఎక్కడకు పోతాయి? ఇంత కుళ్ళు మనసులో పెట్టుకుని జపాలు చేస్తే ఆ భగవంతుడు మెచ్చేనా? అయినా ఏమయింది? ఇంతకింత అనుభవించి మరీ పోవాలి. మా అమ్మ అనేది 'మనిషి మంచితనం మనిషి పోయినప్పుడు తెలుస్తుందే' అని. మా నాన్న ఎలా పోయాడు! ఓ రోగం రొష్టూ లేదు. నిద్రపోయినవాడు మళ్ళీ లేవలేదు. పోయిన తర్వాత కూడా ఆ మొహంలో ఏంకళ, ఏం ప్రశాంతత! చూసిన వాళ్ళంతా అన్నారు. 'పుణ్యాత్ముడు ఎంత అనాయాస మరణం పొందాడు' అని. అందరిలా పక్షవాతంతో తీసుకుపోలా! పాపిష్టివాళ్లు అట్టాపోతారు..."

రంగనాయకమ్మ మనసు జపంమీద నిలవలా. కోడలి మాటలు ములుకుల్లా గుచ్చుకుని ఆమెని బాధ పెట్టాయి. సంధిబంధాలు ప్రిదిలినట్లయింది. ఆమె మనసు రోదించింది.

'యావన్నమే నరదశా దశమీ దృశోపి
రంధ్రాదుదేతి తిమిరీకృత సర్వభావా
లావణ్యవే భావనం తవ తావదేతు
లక్ష్మ్యాః సము త్క్వణిత వేణుముఖేందు
బింబం'

ఈమధ్య కోడళ్లలా పరుషంగా మాట్లాడినప్పుడల్లా ఆమెకు ముదుసలితనం ముంచుకొచ్చినట్లనిపించేది. 'అయ్యో తండ్రీ! అంధత్వంలో సర్వమూ తిమిరీకృతమై కనపడని ముదిమి పైకొనకముందే, వేణువు నూదుతూ కాంతిరోజిస్సుల చిమ్మే నీ ముఖబింబాన్ని నాకు దృశింపచేయుమా!' అని ఆమె ప్రార్థించింది.

రంగనాయకమ్మ పెద్ద కొడుకు ఇంట్లో వుండాల్సిన మూడు నెలలు పూర్తయ్యాయి. మూడు నెలల లెక్క ఏమిటో ఆమె కర్థంకాని విషయం. ఆర్మీలో వున్న వేంకటాచార్యులు పాటియాలాలో వున్నాడు. అతన్ని పట్టున రెండేళ్లు కూడా ఒకచోట ఉంచరు, బదిలీ చేస్తూవుంటారు. దూరాభారం. తనంతదూరం వెళ్ళి ఏం వుండగలదు. ఊళ్లో వున్న కొడుకుల

దగ్గర వుండాలని ఆమె కోరిక. కాని ఎవరికీ ఆమె ఇష్టాయిష్టాలు పట్టవు. సంవత్సరంలో మిగతా మూడు నెలలూ అక్కడే వుండాలి. పోనీ ఏ కొడుకయినా ఆమెనక్కడ దింపివస్తాడా అంటే అదీలేదు. ఎవడికివాడు పట్టనట్టుంటాడు. ఆమే వెళ్ళాలి. టిక్కెట్టుకు డబ్బు కూడా ఎవరూ ఇవ్వరు. అది మూడోవాడి బాధ్యత అని వాళ్ళ ఉద్దేశం. అతని దగ్గరనుండి ఉత్తరాలే వుండవు, డబ్బూ పంపడు. తల్లి బతికివుందన్న సంగతే అతనికి గుర్తుండదు.

ఇహ అత్తగారు కదిలేట్టు లేదని, తనే ఆ విషయం తేల్చాలనే నిర్ణయానికొచ్చింది కాళి.

"మా దగ్గర మూణ్ణెల్లు అయిందిగా. ఇక్కడ నుండి ఎక్కడకు వెళ్తారు?" అనడిగింది.

"చిన్నవాడు రంగనాధం దగ్గర కెళ్దామనుకుంటున్నాను'' అంది రంగనాయకమ్మ జపం చేసే ప్రయత్నంలో తలమీద వేసుకున్న ముసుగును తొలగిస్తూ.

"ఏం విరలు దగ్గరకెందుకెళ్లరూ?"

"ఏమోనమ్మా! వాడు అత్తగారివాళ్ళతో కలిసివుంటున్నాడు. నాకక్కడ బావుండదు''

"ఎందుకు బావుండదు. మీరు అక్కడికే వెళ్ళాలి. అతనికి తల్లిని పోషించాల్సిన బాధ్యత లేదా?"

"ఎందుకు లేదమ్మా? వుంది. అయినా ఈ కట్టుడి నాకెందుకు. నా కిష్టమున్నచోటికి వెళ్తాను'' అని నోరుజారింది. అంతే కాళికి కోపమొచ్చింది.

"ఏం అతను వాళ్లత్తగారు వాళ్ళతో కలసివుంటే మీ ముల్లేం పోయింది? నేను కాపరానికి వచ్చినప్పుడు మీరు, మామగారు, మరుదులు, ఆడబిడ్డ లేరా? అప్పుడు మీ తమ్ముడు వాళ్లు కూడా మన పక్కింట్లోనే వుండేవాళ్లే. నేను నెట్టుకురాలా? సర్దుకుపోయే మనస్తత్వముంటే ఎవరికైనా కుదుర్తుంది. పెడకట్టెలా వుంటే జీవితం వెళ్ళమారి పోయేదెలా? ఎంత కాలం మేంపెట్టాలి? ఉమ్మడికోసం చేయాల్సిందంతా మేం ఎప్పుడో చేసేశాం. ఇహ మీ బాధ్యత ఆ ముగ్గురిదే. మళ్ళీ మా ఇంటి గడప తొక్కకండి. పేడకళాపి చల్లుతాను'' అని లేచి వెళ్ళిపోయింది విసవిసా కాళి.

కాళింది అంత మాత్రపుదే! నిజంగానే పేడ కళాపి చల్లగలదు. అందుకని రంగనాయకమ్మ తన గుడ్డలూ, పూజాసామాగ్రీ మూట కట్టుకుని రంగనాధం ఇంటికొచ్చింది ఆరోజు సాయంత్రం.

ఇల్లు తాళంవేసి వుంది. అప్పటికింకా కొడుకూ, కోడలూ బ్యాంక్‌నుండి వచ్చినట్టులేరు. వాళ్లు ఎప్పుడు వస్తారా అని ఎదురు చూస్తూ గుమ్మం బయట కూర్చుంది రంగనాయకమ్మ.

ఆరుగంటలవుతుండగా వచ్చింది కమల. గుమ్మంముందు కూర్చున్న అత్తగార్ని చూసేటప్పటికి ఆమె నవనాడులూ కుంగిపోయాయి.

"ఎప్పుడొచ్చారు? చిన్న బావగారింట్లో వున్నారనుకున్నానే'' అంది ముఖం ముడుచుకునే తలుపు తాళం తీస్తూ.

"పెద్దాడింటినుంచేనమ్మాయి. నిన్నూ, రంగణ్ణీ చూసి చాలా కాలమయింది. మిమ్మల్ని చూసినట్టూ వుంటుంది, ఇక్కడా నాలుగురోజులున్నట్టూ వుంటుంది. అని వచ్చానే అమ్మాయి'' అంది రంగనాయకమ్మ కోడలి వెంట ఇంట్లోకి వెళ్తూ.

"నేనాయనకు చెప్తూనే వున్నా, 'మీ అమ్మగార్ని చూసిరండీ, ముసలావిడ ఆవిడ పడ్తూ లేస్తూ ఏంవస్తారు' అని. వట్టి నిర్లక్ష్యం మనిషి. కొంపముంచుకొచ్చిందాకా ఏ పనీ చేయరు'' అంది కమల.

కొంప ముంచుకురావటమంటే ఏమిటో రంగనాయకమ్మకర్ధమైనా తానేం మాట్లాడలేదు. తనకు ఏ ఇంట్లోనయినా అంతే. తానే ఇంట్లో అడుగుపెడ్తే ఆ కొంపముంచుకుపోతుంది!

"కూర్చోండి కాఫీ కలుపుకొస్తాను'' అని

ఉస్సూరంటూ లోపలకు పోయింది కమల. అసలే ఆఫీసునుండి అలసిపోయివచ్చింది. అత్తగార్ని చూడంగానే మరింత నీరసమొచ్చి నట్లయింది ఆమెకు.

కమల ఇంట్లో పెద్దపనేమీ వుండదు రంగనాయకమ్మకు. ఆమె అత్తగార్ని ఏ పనీ ముట్టనిచ్చేది కాదు. కొడుకు పుట్టి అత్తగారు తమ ఇంట్లో స్థిరనివాసం ఏర్పరచుకునేంతవరకూ అత్తగారు దుబారామనిషి అనే ఆమె అభిప్రాయం. ఆ తరవాతయినా ఆ అభిప్రాయం మారలేదుకానీ. మరి గత్యంతరం లేకపోయింది. ఉన్న రెండు నెలల్లో కొంప గుండం చేస్తుందని ఆమె బాధపడేది. అంట్లు తోమటం. గుడ్డలుతకటం. ఇల్లు చిమ్మటంలాంటి ప్రమాదంలేని పనులే ఆమె చేయాలి. వంట చేయటం. చివరకు కాఫీ కలపటం కూడా కమలే చేస్తుంది.

ముఖం కడుక్కొని. చీరె మార్చుకుని. కాఫీ కలుపుకొచ్చి అత్తగారికిచ్చింది కమల.

"ఇవెప్పుడు కొన్నారే అమ్మాయి'' అనడిగింది కోడల్ని సోఫాలవంక చూస్తూ పొరబాటున రంగనాయకమ్మ.

"మొన్నీమధ్యేలెండి. ఎంత కాలంనుండి ప్లాను వేసుకుంటే ఇవి కొనగలిగామని. 'మీరేం పెట్టి పుట్టలేదుగా. సంసారానికి కావల్సిన వస్తువులన్నీ మనమే అమర్చుకోవాలి. కాస్తంత చూసి ఖర్చుపెట్టండి' అని ఆయనతో నెత్తీ నోరూ బాదుకుని చెప్తానుకాని, ఆయన దారి ఆయనదే. చివరికెలాగో ఇవి కొనగలిగాము. ఇంకా రెండు నెలలు గడిస్తేగాని వీటి అప్పుతీరదు. 'అమ్మ వస్తే ఖర్చుపెరుగుతుంది. ఇప్పుడు కాదు. తరవాత చూద్దాం' అన్నారు ఆయన. 'మీ అమ్మగారు ఇప్పుడే రారులెండి. ఇంకా ఎనిమిది నెల్లదాకా మన దగ్గరకొచ్చే ప్రశ్నేలేదు. మిగతా ఐదు గురింట్లో ఐదురెండ్లు పదినెలలు గడిపితేకదా మన దగ్గర కొచ్చేది' అన్నాను పొరపాటున. చివరకు ఆయనమాటే నిజమైంది.

రంగనాయకమ్మ తన సంతానం ఆరుగురి దగ్గరా ఆరునెలలు వుండాలని కమల అభిప్రాయం. అక్కడికీ రంగనాయకమ్మ ఆ..ది 'ఆడపిల్లల దగ్గరెలా వుంటానే' అని. "అదేంమాట అత్తయ్యా! పెద్దవారు మీరూ అట్టా మాట్లాడొచ్చా. మొగపిల్లల్ని కన్నట్టే ఆడపిల్లల్నీ కన్నారు. పైగా వాళ్ళకు కట్నాలిచ్చి పెళ్లిచేశారు. అందరికీ మీరిచ్చిన ఆస్తి సమానమేకదా! వాళ్ళకు మాత్రం మిమ్మల్ని పోషించాల్సిన బాధ్యతలేదూ? రేపొద్దున మా అమ్మా నాన్నా కూడా వంతుప్రకారం మా ఇంటికొస్తామంటే మేం ఎలా అభ్యంతర పెట్టగలం. మాకు మాత్రం బాధ్యత లేదూ' అనేది కమల. నిజానికి కమలకు ఆ భేదభావం లేదు. ఆమెది విశిష్టాద్వైతం. తనవాళ్ళయినా, భర్తవంక వాళ్ళయినా ఒకటే ఆమెకు. ఎవరొచ్చినా ఖర్చే ఆమెకు. వచ్చిన వాళ్ళను వీలయినంత త్వరలో తిప్పిపంపే ప్రయత్నం చేస్తుందామె. అలా అని ఎవర్తోనూ పోట్లాడటంగానీ, వంకర మాటలు తప్ప- ముఖం ఎదుట పరుషంగా మాట్లాడటంగాని చేయదు. ఆ లెక్కన పెద్దకోడలే నయమనిపిస్తుంది రంగనాయకమ్మకు. తనవంతు మూడునెలలయిందాకా ఆమె ఏమీ మాట్లాడదు.

"ఏ మాట నిజమయిందే అమ్మాయి! నా కొడుకింటికి నేను రాకూడదా?" అంది రంగనాయకమ్మ. కోడలి మాటలు చురుక్కుమనిపించాయామెకు. ఈ కోడలు పోట్లాడదు కాబట్టి ఆ మాత్రమైనా సాహసించలిగింది రంగనాయకమ్మ.

"ఎందుకు రాకూడదూ, రావాల్సిందే. కన్నవాళ్ళని రావద్దనే వాళ్లు ఎవరైనాసరే చెప్పు తీసుకుకొట్టాల్సిందే. కనిపెంచిన పిల్లలకు ఆ మాత్రం బాధ్యత లేదా? అలా అని పెద్దవాళ్లు కూడా అలుసు తీసుకోకూడదు. ప్లాను ప్రకారం నడవాలి. పెద్దబావగారింటికి వెళ్లేముందు మా ఇంట్లో రెండు నెలలు వున్నారా లేదా? ఇంక పదినెలలకుగాని మా వంతు రాదు. నేను ఖచ్చితంగా మాట్లాడుతున్నానని మీరేం అను

కోవద్దు. మీరే ఆలోచించండి. మూడు నెల్లకే వచ్చేయటం ఎంత అన్యాయమో! మీరింకా పదినెలలకుగాని రారని మేం ప్లాను వేసుకుంటాం. ఏవో వస్తువులు అమర్చుకోవాలికదా. ఇద్దరమూ సంపాయిస్తున్నామన్న పేరే గానీ, కొంపలో ఒక్క వస్తువులేదు. జీవితం శూన్యాన్నుండి మొదలెట్టాల్సివచ్చింది''

"వెళ్తానులేమ్మా! చిన్నాడి దగ్గరకే వెళ్తాను. మీదంతా ప్లాను ప్రకారమే గడుపుకోండి. మా జీవితమే ఎలాంటి ప్లానులేకుండా గడిచిపోయింది. పిల్లల్ని కన్నాంకదా. వాళ్లే ముసలితనంలో సాకుతారని ఆశపడ్డాం. మహారాజు ఆయనెలాగోపోయాడు. నాకు చావు రాకవచ్చింది. ప్లాను ప్రకారం ముసలితనం రాగానే చావాలన్న జ్ఞానం లేకపోయింది మాకు'' అంది రంగనాయకమ్మ లేస్తూ.

"అదుగో నిష్ఠూరంగా మాట్లాడకండి, నలుగురు కట్టిన ఇంట్లో కూర్చుని. ఇప్పుడే లేచి వెళ్లమని చెప్పటంలేదు. రేపు ఆయనొచ్చి దించుతార్లెండి'' అని లేచి ఇంట్లోకి వెళ్లిపోయింది కమల. ఓ పెద్ద సమస్య పరిష్కారమైన తేలిక మనస్సుతో.

రంగనాయకమ్మకు మనసు వికలమైపోయినట్లయింది. అందరూ బయటకు నెట్టివేస్తున్నా తనకు చావెందుకు రావటం లేదా అని వాపోతూ అలాగే కూర్చునుండిపోయింది. చీకటి పడుతున్నా లేచి, లైటు వేసుకుందామన్న స్పృహ కలగలేదు ఆమెకు.

చీకటి పడ్డాక ఏడుగంటల ప్రాంతంలో వచ్చాడు ఆమె నాలుగో కొడుకు రంగనాధాచార్యులు. వస్తూనే లైటువేసి, సోఫాలో కూర్చున్న తల్లిని చూడంగానే అతనికి నిజంగా ఆనందంగానే వుంది. "ఎప్పుడొచ్చావే అమ్మా! వంట్లో కులాసాగా వుంటోందా?" అని అన్నాడు దగ్గరకొచ్చి కూర్చుని, షూ, సాక్స్ విప్పుతూ.

"నా ఆరోగ్యానికేం నాయనా! మీ నాయన వయసు కూడా పోసుకుని బతుకుతున్నాను'' అంది రంగనాయకమ్మ.

"చిన్నన్నయ్యావాళ్లు అంతా బావున్నారా?" అనడిగాడు రంగనాధం.

"ఏమో నాయనా! నేను పెద్దాడింటినుండి వస్తున్నాను. ఎక్కడి కయినా నేను రావల్సిందే తప్ప, మీరు వచ్చి చూసేపని లేదుగా. అమ్మముండ చచ్చినా బతికినా ఒకటే మీకు''

"ఏదీ తీరిక దొరికిచావటంలేదు. ఇన్‌స్టాల్‌మెంటులో స్కూటరు తీసుకుంటున్నాను. ఆ ఏర్పాట్లలోనూ, మిగతా పనుల్లోనూ తీరికే వుండటంలేదు. లే, లేచి స్నానమదీ చెయ్యి. సాపాటు చేద్దాం"

"నాకాకలిగా లేదు. ఈ పూటకు సాపాటు చెయ్యను. కాసేపుండి లేచి స్నానంచేసి, జపం చేసుకుంటాలే. నువ్వెప్పుడు తిన్నావో లేచి భోంచెయ్యి''

తల్లి అలా ఉపవాసాలుండటం అలవాటే కనుక రంగనాధం మరేం మాట్లాడలేదు. కమల కూడా ఆమెని బలవంతం చెయ్యలేదు. "భోజనం చెయ్యండి, ముందు చెప్పొచ్చుగా. నాకు మడికట్టుకుని వండివార్చేపని తప్పేది'' అని మాత్రం విసుక్కున్నది.

'నిజమే, వాళ్లది ప్లాను ప్రకారం నడిచే జీవితం. వాళ్లు ప్లాను ప్రకారం పిల్లల్నే కనలేదు. తనొస్తే నష్టం కాదూ వాళ్లకు' అనుకుంది రంగనాయకమ్మ, పక్కమీద నడుం వాలుస్తూ.

కమలది ఎంత ప్లాను జీవితమంటే రేడియో పెట్టుకోవటానికి కూడా ఆమె సమయాన్ని నిర్దేశించివుంచింది. ఎప్పుడయినా తోచక రంగనాయకమ్మ రేడియో ఆన్ చేస్తే చాలు, వచ్చి ఠక్కున ఆపుచేసేది కమల. ఆ తరవాత వాళ్ళు టి.వి. కొన్నప్పుడు కూడా కమల అనవసరంగా టి.వి. ఆన్ చేయనిచ్చేది కాదు. మరీ ఎండగా ఉక్కగా వున్నప్పుడు తప్ప ఫాను కూడా వెయ్యటానికి వీలులేదు. "కరెంటు బిల్లు ఎక్కువైపోతుంది'' అనేది కమల.



రాత్రి భార్యాభర్తలు ఏం మాట్లాడుకున్నారో గాని మర్నాడు పొద్దున ఏడింటికల్లా తల్లిని చిన్నన్న ఇంట్లో దించటానికి తోడు వచ్చాడు రంగనాధాచార్యులు.

అత్తగారింట్లో వుండే రెండో కొడుకు దగ్గర వుండటం రంగనాయకమ్మకు ఇష్టముండేది కాదు. అతనికి సంపాదన తక్కువ. సంసారం పెద్దది. నల్గురు పిల్లలు. అతని మామగారు రామాచార్యులు రిటైరయ్యాడు. వట్టిరూపం చూసి మోసపోయీ, స్నేహితుడి కొడుకనీ సంపాదనపరుడు కాని విఠలాచార్యులను



అల్లుడుగా చేసుకోవటం ఆయన జీవితంలో చేసిన ఒకేఒక్క పొరపాటు. దానికై ఆయన చింతించని క్షణంలేదు. అల్లుడివైపువాళ్లు ఎవరైనా ఇంటికి రావటం రామాచార్యులకూ సౌభాగ్యలక్ష్మికీ కూడా ఇష్టం వుండదు. అంతా వాళ్ళదే పెత్తనం. రంగనాయకమ్మకా ఇంట్లో పరాయి ఇంట్లో వున్నట్టుగా వుంటుంది.

రెండో కోడలు సంయుక్తకు ఇద్దరు బోధ కురాళ్లున్నారు. స్వతహాగా మంచిదేకానీ, ఆమె ఎక్కడ చెడిపోతుందోనని పెద్దావిడ కాళిందీ, చిన్న కోడలు కమలా సందర్భాల్లో కలసినపు డు ఆమెకు జ్ఞానబోధ చేస్తుంటారు. ఉమ్మడి కుటుంబం కోసం తామింతకు ముందే చాలా



పెట్టామన్న కాళింది భావననీ, అత్తగారు ఏ ఇంట్లోనూ రెండు నెలలకంటే ఎక్కువకాలం వుండాల్సిన పనిలేదన్న కమల ప్రణాళికనీ జీర్ణించుకుంది. కానీ రెండు నెలలు కాంగానే అత్తగార్ని ఎలా వుండవద్దని చెప్పాలో ఆమెకు తోచేదికాదు. ఆమెకు మిగతా ఇద్దరు గుర్విణులకున్న స్వాభావికమైన తెలివితేటలు, చాకచక్యంలేవు. అలా అని ఆమె ఏం నిస్సహాయకాదు. తల్లి అండ ఎప్పుడూ ఆమెకు శ్రీరామరక్షలా వుంది. వియ్యపురాలిని వీలైనంత త్వరగా పంపేపని ఆమె చేపడ్తూవుంటుంది. అలా అని రంగనాయకమ్మతో కయ్యానికి దిగదు. 'విషాదయోగం'లో అర్జునుడికి కృష్ణపరమాత్మ గీతా బోధ చేసినట్లు బోధించి కూతుర్ని యుద్ధరంగానికి పంపుతుంది. తను వెనుక వుండి సూత్రధారి కార్యభారం వహిస్తూ వుంటుంది.

మనస్సు కలిసిన కొడుకుతో రంగనాయకమ్మ తన బాధ చెప్పుకుంటుంది. విరలాచార్యులు సానుభూతి చూపిస్తాడు. "నిజమేనమ్మా! కోడళ్లకు నువ్వుండాలని ఎలా వుంటుంది. వాళ్లేమన్నా నువ్వు పట్టించుకోకు. మెడబట్టి బయటకు గెంటరుకదా! నువ్వేం పనిచేయకు. అంతా తిని నిన్ను పస్తుపడుకోబెట్టరుకదా!" అంటాడతను.

కాని ఆడదానికి ఎలా కుదురుతుంది. కాళ్లూచేతులూ ఆడుతున్నంత వరకూ పనిచెయ్యక తప్పదు. కాంపుల ఉద్యోగం చేసే విరలాచార్యులకు ప్రతిక్షణం తల్లిని కనిపెట్టుకు వుండటం సాధ్యంకాదు. అందువల్ల తన ఇంటికి రాంగానే తల్లి ఎలా వంట మనిషి, పనిమనిషిగా మారిపోతుందో అతనికి అర్థం కాదు. రంగనాయకమ్మ కన్పించగానే సంయుక్త తల్లి సౌభాగ్యలక్ష్మికి బ్లడ్‌ప్రెజర్ పెరిగిపోతుంది. గుండె దడదడలాడుతుంటుంది. అటుపుల్ల ఇటు పెట్టాలన్నా ఆమెవల్లకాదు, మంచమెక్కేస్తుంది. పిల్లలతల్లి అయిన సంయుక్తకసలు తీరికే వుండదు. పైగా ఆమెకి శుభ్రమంటే అతిపిచ్చి. కడిగిందే కడిగి, తుడిచిందే తుడిచి వంట చెయ్యటానికొచ్చేటప్పటికి ఆమెకసలు ఓపిక వుండదు. కోడలేమని విసుక్కున్నా పట్టించుకోకుండా ఆమె పెట్టినప్పుడే తిందామంటే ముసలావిడ ప్రాణం కడబట్టిపోయేది. ఏ రెండు గంటలకోగాని ఆమె వండి వార్చలేదు. ఈ బాధపడలేక వీలయినంత ఇంటిపనీ, వంటపనీ ఆమె చెయ్యాల్సి వచ్చేది. అయినా పనిని గూర్చి ఆమె అంతగా బాధపడేదికాదు. వియ్యపురాలి సన్నాయి నొక్కులూ, అప్పుడప్పుడు కోడలు సంయుక్త తోలు బొమ్మలా తైతక్కలాడటం ఆమెకు సహించరానివిగా వుండేవి.

రంగనాధం తల్లిని దించటానికొచ్చినప్పుడు ముందు గదిలోనే కూర్చుని వున్నారు తల్లీకూతుళ్లు. విరలాచార్యులు ఇంట్లోలేడు, కాంపుకెళ్లాడు.

"రండి అత్తయ్యగారూ! మీరు ఇవాళో రేపో వస్తారనే అనుకుంటున్నాము'' అని నవ్వుతూనే ఆహ్వానించింది సంయుక్త

"నువ్వు తీసుకు వస్తున్నావేమయ్యా మీ అమ్మను. మీ పెద్దన్నయ్య ఇంట్లోకదా ఆమె వుంటం" అనడిగింది సౌభాగ్యలక్ష్మి.

"అక్కడనుండి నిన్న మా ఇంటికొచ్చిందండీ అమ్మ! ఇక్కడ దింపుదామని తీసుకొచ్చాను'' అని జవాబిచ్చాడు రంగనాధం.

"మీరు మనుషులిద్దరేకదా! మీ ఇంట్లో అయితే ఆమె ప్రాణం హాయిగా వుంటుంది. ఇంత రద్దీలో వుండటం కష్టం. మాకూ గతిలేక వుంటున్నాం. అయినా తెలీక అడుగుతాను, తల్లినుంచుకోటానికీ వంతులేమిటయ్యా! ఇలా అన్నానని ఏమనుకోక. పెద్దావిడ ఆమెకు మాత్రం ఇలా లెక్క ప్రకారం తిరగాలంటే ఒంట్లో ఓపిక వుండవద్దూ!"

"మీరన్నదీ నిజమే ననుకోండి. కానీ మేమిద్దరం మా తోవన మేం బాంకుకు పోతే ఒక్కత్తే అమ్మకు మాత్రం ఏం తోస్తుంది. అక్కడ మీ అన్నయ్యల ఇళ్లల్లో పిల్లలున్నారు

ఆవిడకు పొద్దుపోతుంది అంటుంది మా ఆవిడ. అదన్నదీ సబబే'' అన్నాడు రంగనాధాచార్యులు.

"ఆవిడలా అంది, నువ్విలా తీసుకొచ్చావన్నమాట. బావుంది సంబడం. అయినా మధ్య నాకెందుకులేనాయనా! ఓ మంచిమాట చెప్పినా అదుగో అన్నయ్య అత్తగారు తానుండటంలేదా, మా అమ్మకు సాయికారాలు చెప్తోంది అనుకుంటారు. ఒక్కతే కూతురు కనుక గతిలేక వుంటున్నాం మేము. ఆమెకేం పుణ్యాత్మురాలు, పిల్లల తల్లి, ఎక్కడుంటే గడచిపోదు కనుక"

రంగనాధానికి ఆమె మాటలు వింటుంటే కోపం నసాళానికంటింది.

"అందుకే గదండీ ఇక్కడకు తీసుకొచ్చాను'' అని తానూ ఓ కుంటికూత కూసి ఆనందించాడు.

"చూశావుటే అమ్మాయి! నీ మరిది ఎంత బుద్ధిమంతుడో. మా బాగా బుద్ధి చెప్పాడు నాకు. 'నోరు మూసుకోవమ్మ ముసలమ్మా! మా అమ్మ ఎక్కడవుండాలో మాకు తెల్సు. నువ్వేం చెప్పక్కర్లేదు' అన్నట్టు నా నోరు నొక్కేశాడు. మీ విషయాల్లో కలుగచేసుకోవటం నాదే తప్పు తల్లీ! మా బుద్ధివచ్చింది'' అంటూ లెంపలు వాయించుకుంది సౌభాగ్యలక్ష్మి.

"పెద్దావిడనైనా చూడకుండా అవేం మాటలయ్యా రంగనాధం! మా వాళ్లేం నా దగ్గర ఊర్కే వుండటంలేదు. డబ్బిచ్చి వుంటున్నారు'' అంది సంయుక్త తల్లి చెంపలు వాయించుకుంటుంటే చూసి సహించలేక.

"ఇప్పుడు వాడన్న తప్పుడు మాట ఏమిటమ్మా! మీ అమ్మావాళ్లని వుండొద్దని చెప్పలేదే వాడు'' అంది రంగనాయకమ్మ అర్థంకాక.

"అనకేం, అంటారు. అందరూ అంటారు. మా ఉసురుపోసుకు ఛస్తున్నారు. నోరు నవ్వుతోంటే నొసలు వెక్కిరించటం మేం గమనించకపోలేదు. పెద్ద బావగారూ అంతే. పెద్ద వదినగారు ఆండాళ్లమ్మా అంతే. అంతా పెట్టి పోషిస్తున్నట్టు అందరూ సలహాలు చెప్పేవాళ్లే అవసరానికి ఆదుకోటానికైతే ఆమడదూరం పోతారు. మా నాన్నా, అమ్మా కన్నమమకారం తెంచుకోలేక నా ఇంట్లోవుంటే నిజానికిది వాళ్లిల్లే. అంతా కన్నుకుట్టి ఛస్తున్నారు. మావాళ్లు మాతో వుంటున్నందుకు చిలుము వదిలించుకుంటున్నారు. వచ్చి నెత్తినెక్కి కూర్చుని మీ కొడుకు సంపాదించిన లప్పేం తిని పోవటంలేదు'' అంది సంయుక్త రోజుకుంటూ, రొప్పుకుంటూ.

"ఊర్కోవే అమ్మా! ఊర్కో. అంటే మనవాళ్లే బయటపడిపోతాయికానీ, వాళ్ల చేతలేం బయటకురావు. అమ్మో, అమ్మో ఆయాసం వచ్చిందే నా తల్లే! దడగావుందే. అందుకే నేనేవిషయంలోనూ కల్పించుకోనే తల్లీ!" అంటూ నేలమీద జారగిలబడింది సౌభాగ్యలక్ష్మి.

ఈ రభస చూసిన రంగనాధానికి చెమటలు పట్టాయి. తేలుకుట్టిన దొంగలా మారుమాట్లాడకుండా వెళ్లిపోయాడు.

ఓసారి తమ్ముడు రామానుజాచార్యులు తన్ని చూట్టానికి వచ్చినప్పుడు, రంగనాయకమ్మ తన కోడళ్ల సంగతంతా చెప్పి, "ఇలా వుందిరా నాయనా జీవితం. చుట్టపుబతుకైపోయింది. మొదటిరోజు వరహాచుట్టం, రెండోరోజు మాడచుట్టం ఆ మర్నాటినుండి మురికి చుట్టం బతుకైపోయింది. ఇంటింటికో రామాయణం. నాకిల్లు లేదు. ఎక్కడవుండాలో తెలీదు'' అంది రంగనాయకమ్మ వాపోతూ.

"కోడళ్లనంటావెందుకక్కయ్యా! అసలు నీ కొడుకుల్లోనే లోపంవుంది. స్వార్థం అందరికీ వుంటుందికానీ మరీ ఇంత స్వార్థమా? నెలకింతని నీకు డబ్బు ఏర్పాటు చేస్తే ఎక్కడో వుండి నాలుగు గింజలు ఉడకేసుకు తినేదానివికదా! డబ్బివ్వటానికీ వాళ్లకు కష్టమే. డబ్బిస్తే కోడళ్లకేం తెలుస్తుంది. అసలు నువ్వుండటం నీ కొడుకులకీ ఇష్టంలేదు. పరాయ

మ్మలు కన్న పిల్లలు కోడళ్లననకు'' అన్నాడతను.

"నిజమేరా, నువ్వన్నది కూడా'' అంది రంగనాయకమ్మ.

రామానుజాచార్యులు వుండబట్టలేక మేనల్లుళ్లని మీ అమ్మని వుంచుకోటానికి వంతులేమిట్రా అని మందలించ ప్రయత్నించాడు. కానీ ప్రయోజనంలేకపోయింది. ఓసారి శేషశయనాచార్యులను ఈ విషయంలో కదిపినప్పుడు అతడు నిర్మొహమాటంగా చెప్పేశాడు, "మా అమ్మ సంగతి మాకు తెల్సులే మామయ్యా! నీ ఉచిత సలహాలేం మాకక్కరలేదు'' అని.

వేంకటాచార్యులు, రంగనాధాచార్యులు ఓసారి బజార్లో కనబడితే మళ్లీ ఆ ప్రస్తావన చేశాడు రామానుజాచార్యులు.

వేంకటాచార్యులకి కోపం వచ్చింది "మీ పంటకుర్తివాళ్లకేం పనిలేదా? నాన్న చేసే ప్రతి పనిలోను జోక్యం చేసుకుని ఆయన్ని చెడగొట్టింది తాతయ్యా, అమ్మమ్మా కదూ! ఇంకా ఎంతకాలం సహించం మామయ్యా మా వ్యవహారాల్లో మీ జోక్యం?" అనన్నాడతను.

"తాతయ్యనంటే పురుగులు పడిపోతారు.. ఆయనేం చెడగొట్టాడ్రా! మీ నాయన్ని? వాళ్లకిద్దరు పిల్లలు పుట్టిందాకా మా ఇంట్లోనే వున్నారు. ఆ తరువాత ఆయన చేతనయిన సాయం చేస్తూనే వచ్చాడు. అంతకంటే ఎవరు మాత్రం ఏం చేయగలరు?" అన్నాడు రామానుజాచార్యులు ఆశ్చర్యపోతూ.

"అసలు ఎవరు చెయ్యమని అడిగారు ఆయన్ని? అట్లా చేసే నిర్వ్యాపారత్వంనేర్పాడు నాన్నకు. అసలాయన ఉద్యోగం కుదురుగా చేయకపోవటానికి కారణం తాతయ్యే'' అన్నాడు రంగనాధాచార్యులు.

వీళ్ల మాటలు విని నిర్ఘాంతపోయాడు రామానుజాచార్యులు.

"గురివిందగింజ కింద నలుపెరుగదని, చెప్పొచ్చావుకానీ. తాతయ్య సంగతి నువ్వేం పట్టించుకున్నావు! అమ్మమ్మ పోయింతర్వాత తాతయ్య వంటరివాడైపోయాడుకదా! నువ్వు ఆయన్ను నీ దగ్గరకు తెచ్చుకునుంటే ఆయనకు దేశాలుపట్టిపోవాల్సిన అవసరంవుండేది కాదుగదా!" అన్నాడు వేంకటాచార్యులు.

రామానుజాచార్యులు నిర్విణ్ణుడైపోయి, ఏం మాట్లాడలేకపోయాడు. వాళ్లతో అక్క విషయం కదిపి పొరపాటు చేశాననుకున్నాడు. అలా అనుకున్నవాడు నింపాదిగా వుండబట్టలేకపోయాడు. ఓసారి విఠలాచార్యులతో,

"ఎందుకురా నాయనా మీ అమ్మని కొంప కొంప తిప్పిస్తారు. నేను తీసికెళ్లి నాతో వుంచుకుంటాలే'' అనన్నాడు.

"మేం నల్గురం కొడుకులముండి మా అమ్మ మీ ఇంట్లో వుండటమేంటి? ప్రతికొంపలోనూ ఏవో ఒకటి వుంటాయి. అమ్మ విషయం మాలో మేం తేల్చుకుంటాంలే. పెద్దవాడివి, నేన్నీకు చెప్పకూడదు. నువ్వు జోక్యం చేసుకోకుండా నీ గౌరవం నువ్వు కాపాడుకోవటం మంచిది'' అన్నాడు మెత్తమెత్తగా విఠలాచార్యులు.

దాంతో రామానుజాచార్యులు చెంపలేసుకుని బుద్ధి వచ్చిందనుకున్నాడు. మళ్లీ మేనల్లుళ్లకు నచ్చచెప్పే ప్రయత్నమేం చెయ్యలేదు.

అలా అని రంగనాయకమ్మ జీవితం ఆగిపోలేదు. గడచిపోతూనే వుంది. అదృష్టవశాత్తూ కూతుళ్ల ఇళ్లల్లో పురుళ్లూ, పుణ్యాలూ వచ్చి అవసరానికి ఆదుకోటానికి తల్లిని పిలిపించుకోవటంతో కొన్ని నెలల కాలం గడచిపోయేది. రంగనాయకమ్మ ఏ జన్మలో చేసుకున్న పుణ్యమోకానీ, కమల ప్లాను ప్రకారం గర్భం ధరించటం, నందకిశోరుడు పుట్టటమూ జరిగింది. కొడుకుని క్రెచ్‌లో వేయటం ఇష్టంలేదు కమలకు. ఆయాని పెట్టినా ఖర్చు ముబ్బడవుతుంది. పైగా అత్తగార్లా మరెవరూ కొడుకుని కనిపెట్టుకు వుండరని నిర్ధారించుకుంది ఆమె. దాంతో భార్యాభర్తలిద్దరూ ఆమెను తమ ఇంటి

కి ఆహ్వానించటంతో తనెక్కడవుండాలన్న సమస్య తీరిపోయింది రంగనాయకమ్మకు.



**అం**తకు ముందు ఎక్కే గడపా, దిగే గడపా అయిన తన బతుక్కు ఇంత స్థిరత్వం కల్గించిన నందకిశోరుడంటే రంగనాయకమ్మకు ప్రాణం. ఆ బాల కృష్ణుడే తన్నుద్ధరించటానికి ఆ ఇంట్లో అవతరించినట్టుగా ఆమె భావించేది. ఉద్యోగం చేసే కమలకెప్పుడూ తీరికుండదు. పిల్లవాడి పనంతా రంగనాయకమ్మే చూసుకునేది. పొద్దున నీళ్లుపోసి, పౌడరురాసి, నుదుటన తిరునామంపెట్టి, చాపమీద మెత్తటి పక్కవేసి పడుకోబెట్టేది. తన చిన్ని కాళ్లూచేతులూ కదిలిస్తూ, బోసినోటితో వాడు ఆమెవంక చూసినవ్వితే ఆమె హృదయం పరవశించిపోయేది.

'కరారవిందేన పదార విందం
ముఖారవిందే వినివేశయంతం
వటస్య పత్రస్య పుటేశయానం
బాలం ముకుందం మనసాస్మరామి' అని అనుకునేదామె.

'బాలకృష్ణుని చేతులు, పాదాలు, ముఖం తామరపువ్వుల్లా వున్నాయి. చేత్తో కాలిని పట్టుకుని, ఆ కాలిని నోట్లో పెట్టుకుంటున్న బాలుడు మఱ్ఱి ఆకు మీద పడుకునివున్న బాలముకుందుడు'లా ఆమెకు కన్పించి, ఆమె అవనతమైపోయేది.

నందుడికి పాకటం, తొట్రుపాటు నడక వచ్చింతర్వాత ఆమెకసలు తీరిక లేకుండా చేశాడు వాడు. ఏ వస్తువూ కింద వుండనిచ్చేవాడు కాదు. తొట్రుపడే పాదాలతో నడుస్తూంటే

'కింకిణి కిణికిణి రభసై రంగణ
భువిరింగణైః సదాటంతం
కుంకుణు కుణకుణ పదయుగళం
కం కళ కరభూషణం హరి'

కాలి గజ్జెల గలగలధ్వనితో ఇంటి ముంగిల్లో పారే హరిలా గోచరించేవాడామెకు. బాలనీల వపుషుడూ, నవకింకిణీ జాలాభిరాముడూ, జఘనుడూ, దిగంబరుడూ, శార్దూల దివ్య నఖ భూషణ భూషితుడూ అయిన నందాత్మజుడూ, నవనీత చోరుడూ, బాలకృష్ణుడే కన్పించేవాడామెకు.

నందకిశోరుడికి బాగా నడవటం వచ్చాక ఆమె వాడి నుదుటన, భుజాలమీదా తిరునామాలుపెట్టి, పట్టుపుట్టంకట్టి బాలకృష్ణునిలా అలంకరించేది. పక్కను కూర్చో బెట్టుకుని పూజచేసుకునేది. వాడు పూజాసామగ్రి ఒక్కటీ వున్నచోట వుండనిచ్చేవాడు కాదు. పూజా మందిరంలోని దేవతా విగ్రహాలను తీసేవాడు, గంట మోగించేవాడు. పంచపాత్రంలో హరివేణంతో నీళ్లు పారబోసేవాడు. వాడి నోరు క్షణం మూసుకుని వుండేదికాదు. ఎప్పుడూ ఏదో ఒకటి వాగుతూనే వుండేవాడు. ఆమె విసుక్కునేదికాదు. మనవడికి సమాధానాలు చెప్పటం కూడా పూజలో భాగంగా భావించేది. వాడిని ఎత్తుకుని కోవెలకు వెళ్లేది.

కోడలు కమలకు నచ్చని విషయం ఇదొకటి. పైకి ఏమనకపోయినప్పటికీ, తను ఇంట్లో వున్నప్పుడు కనుక అత్తగారు వాడికీ అలంకరణ చేస్తే ముఖం మటమట లాడించేది. ఆ పట్టుబట్టల్ని విప్పేసి చక్కగా లాగూచొక్కా వేసేది. నుదుటనవున్న తిరునామాలు చెరిపేసేది. "రేపు వాణ్ణి స్కూల్లో వేస్తే బొట్టుపెట్టుకోనివ్వరు. మనం ఇప్పటినుండే వాడికా శిక్షణ ఇవ్వాలి" అనేది సంజాయిషీ

ఇస్తున్నట్టు.

బావిగట్టున కూర్చుని దేవుళ్ల విగ్రహాలకు పులికాపు పెడ్తూంటే, నందుడు ఆ విగ్రహాలను తీసి బావిలోకి విసిరేసే ప్రయత్నంచేసేవాడు. "ఓరే! నందనందూ! అలా దేవుళ్లను పారెయ్యొచ్చా?" అనేది రంగనాయకమ్మ, చిరుకోపం వచ్చినట్లుగా.

"పారెయ్యన్లే బామ్మా! కోపం వచ్చిందా'' అంటూ వాడొచ్చి ఆమెను కౌగలించుకునేవాడు. మనవణ్ణి దగ్గరకు లాక్కుని ముద్దులు కురిపిస్తూ పరవశించి పోయేదామె.

నందూ మొదట్లో బామ్మ పక్కలో పడుకునేవాడు. కమలకది ఇష్టంలేదు. వాడికి రెండేళ్ల వయసు రాంగానే అత్తగారి పక్కనే ప్రత్యేకంగా వాడికోమంచం ఏర్పాటు చేసింది. అయితేవాడు ఏ అర్ధరాత్రో వచ్చి బామ్మని కౌగలించుకుని పడుకునేవాడు. బామ్మా, మనవడూ పొద్దున్నే లేస్తారు కాబట్టి, కమలకు ఇది తెలిసే అవకాశం వుండేదికాదు. ధనుర్మాసంలో చలివేస్తున్నా, "పడుకోరా నందగోపాలా!" అని వారించినా పడుకునేవాడుకాదు. ఆమెతోపాటే లేచి 'పల్లాండు పల్లాండు పల్లాండు రత్తాండు, వలకోడి నూరాయిరం...' అని ఆండాళ్ పాశురాలు ఆమె పాడుతూవుంటే తనూ గొంతు కలిపేవాడు.

సాయంత్రం ఆఫీసులనుండి ఇంటికొచ్చింతర్వాత కొడుకూ, కోడలూ మనవడిని చదువుపేరిట హింసపెట్టటం సహించలేకపోయేది రంగనాయకమ్మ. పిల్లవాణ్ణి మంచి కాన్వెంటు స్కూల్లోనే వేయాలని భార్యాభర్తలిద్దరూ చాలా స్కూళ్లకు ఇంటర్వ్యూలకు వెళ్లివచ్చారు. పిల్లవాడికి ఇంట్లో తర్ఫీదునిచ్చేవాళ్లు.

"వాట్స్ యువర్ నేం?" చెప్పు నాన్నా, చెప్పు... 'మైనేమ్ ఈజ్ నందకిశోర్' ఇలా ప్రశ్నలు, సమాధానాలు చెప్పించేవారు. 'బాబా బ్లాక్‌షీప్, హంప్టీడంప్టీ శాటాన్‌వాల్' లాంటి నర్సరీ రైమ్స్ చాలా కష్టపడి నేర్పించేవాళ్లు. వాడికీ నర్సరీ రైమ్స్‌కంటే బామ్మ చెప్పే పద్యాలు, శ్లోకాలే తేలిగ్గా వచ్చేవి. ఎప్పుడు తల్లీతండ్రీ నుండి పారిపోయి బామ్మ ఒడిలో చేరుదామా అని వుండేదివాడికి.

"ఎందుకురా రంగనాధం! వాణ్ణట్లా హింసిస్తున్నారు? వాడి వయసెంత? అప్పుడే అంత నూరి పోయాలనుకుంటే ఎట్లా?" అనేది రంగనాయకమ్మ చూడలేక.

"మీరునేర్పిన ఆ శ్లోకాలు, పద్యాలూ వాడి బుర్రలో లేకపోయినట్లయితే స్కూలు పాఠాలు చాలా తేలిగ్గా వాడి మనసుకెక్కేవి'' అనేది కమల... వాడికి చదువంతా చెప్పంగానే రాకపోవటానికి అత్తగారే కారణం అన్నట్లు.

"ఏవోనమ్మా! మేమూ మా పిల్లలకు చదువు చెప్పించాముకానీ, పిల్లలకు నాలుగు భక్తి పద్యాలు నేర్పితే చెడిపోతారనుకోలేదు'' అనేది రంగనాయకమ్మ.

"ఇప్పటి రోజులువేరు లేవే అమ్మా! ఎంతగా కాంపిటీషన్ పెరిగిపోయిందనుకున్నావు! ఆ కాంపిటీషనుకు తట్టుకు నిలబడాలంటే మరి గట్టిగా చదూకోపోతే ఎట్లా?" అనేవాడు రంగనాధాచార్యులు అప్పుడే కొడుకు ఏదో డిగ్రీ చదువు చదువుతున్నట్టు.

"తెలీని విషయాలు కల్పించుకోకుండా వుంటే మంచిది'' అని అత్తగారితో అని "చెప్పరా వెధవా! చెప్పు... వన్, టూ, త్రీ బకల్‌మైషూ'' అని వాడి చెవినులిమి చదువు చెప్పేది కమల.

తన తండ్రి తనను చదువు చెప్పినప్పుడు ఒక్క దెబ్బ వేయలేదు. ఒక్క తిట్టు తిట్టలేదు. తన పిల్లలూ దెబ్బలు తినకుండానే చదువుకున్నారు. శిక్షిస్తేగాని చదువురాదనే ఈ మనస్తత్వమేమిటో రంగనాయకమ్మ కర్థంకాని విషయం. అయినా తను కల్పించుకోరాదు. మనసులో బాధగావున్నా ఏమనలేక వంటింట్లోకి వెళ్లిపోయేది రంగనాయకమ్మ.

తల్లిదండ్రులు శిక్షణ ఫలితంగా వాడికి రెండు కాన్వెంటు స్కూళ్లలో సీటు లభించింది. ఒక స్కూలు చాలాదూరం, ఆటోలో పిల్లవాణ్ణి అక్కడకు పంపాలి. రెండో స్కూలు ఇంటి

దగ్గరే ఎవరైనా దింపిరావచ్చు. దూరపు స్కూల్లో శిక్షణ, దగ్గరి స్కూల్లో శిక్షణకంటే బావుంటుందని వాళ్లూ వీళ్లూ చెప్పగా రంగనాథాచార్యులు ఆ స్కూల్లోనే కొడుకుని చేర్పిద్దామనుకున్నాడుకాని, కమల దగ్గర స్కూల్లోనే చేర్పిద్దామనటంతో మరేమనలేకపోయాడు. కమలకు కూడా దగ్గరస్కూలు దూరపు స్కూలంత మంచిది కాదని గునుపువున్నా ఆటో ఖర్చులు తప్పుతాయని దగ్గర స్కూలుకే మొగ్గుచూపింది.

మనవడిని టైం ప్రకారం స్కూలుకు తీసుకెళ్లి తీసుకురావటం రంగనాయకమ్మ వంతైంది. ఆమె ఆ బాధ్యతని ఆనందంగా అంగీకరించిది.

ఆమె మనవడికి శ్లోకాలూ, పద్యాలూ నేర్పించేది.

"నందూ! ఈ శ్లోకం చెప్పు నాన్నా!

'రామస్కందం హనుమంతం వైనతేజం వృకోదరం
శయనే స్మరేన్నిత్యం దుఃస్వప్నం తస్యనశ్యతి'

వాడికి ఒక్కొక్క ముక్కా చెప్పి పల్కించేది.

"రాత్రి పడుకోబోయే ముందు రాముడూ, స్కందుడూ, హనుమంతుడు, గరుత్మంతుడు, భీముడు వాళ్లని స్మరిస్తే పేరు తల్చుకుంటే చెడు కలలు రావమ్మా'' అని చెప్పేది.

మరోసారి...

చెప్పమ్మా నందూ!

'కర్కోటకస్య నాగస్య దమయంతీ నలశ్చచ
ఋతుపర్ణశ్చ రాజ ఋషేః కీర్తనం కలినాశనం'

"అంటే కర్కోటకుడనే సర్పరాజునీ, దమయంతీదేవినీ, నలమహారాజునీ, ఋతుపర్ణుడనే రాజ ఋషినీ పొద్దున్నే తల్చుకుంటే మనల్ని కలి ఏం చేయలేదు'' అని చెప్పేది.

"కలి అంటే ఏమిటి బామ్మా''

"దమయంతీదేవి ఎవరు?"

"నలమహారాజెవరు?"

ఇలా శ్లోకాల్లో వచ్చే పేర్లను గురించి ప్రశ్నలు వేసేవాడు నందుడు. రంగనాయకమ్మ ఓపిగ్గా ఆ కథలు చెప్పేది. రాముడెవరో చెప్పేది. రాముడి బంటు హనుమంతుడిని గూర్చి చెప్పేది. ఆమె ఆ కథలు చెప్తూంటే కళ్లు ఆల్చిప్పలంత చేసుకుని వింటూవుండేవాడు నందుడు. తొట్రుపడే పలుకులతో వచ్చీరాని మాటలతో వాడు పద్యాలు వల్లిస్తూంటే రంగనాయకమ్మ మురిసిపోయేది. మురళీనాద మకరందబిందులహరీమోదంతో, మురళి ఊదటంవల్ల ఉబ్బిన మృదువైన చెక్కుటద్దాల బాలకృష్ణుని ముఖ కమలం ఆమె మనః పటలంలో మెదిలి ఆమె తన్నుతాను మర్చిపోయేది.

పిల్లవాడి రక్షణ కోసం మొదట్లో అత్తగారు నందుడిని స్కూలుకు తీసుకెళ్లి, తీసుకు రమ్మని ఆమె చెప్పిందికాని, వాడికి ఎనిమిదేళ్లు వచ్చాక కమల "ఇంక మీరువాణ్ణి స్కూలుకు దింపక్కర్లేదు. తీసుకు రావాల్సిన పనీలేదు. వాడే వెళ్తాడు, వాడే వస్తాడు. ఎప్పుడూ మనం నీడలా వాడిని అనుకరించివుంటే వాడి సొంత వ్యక్తిత్వం పెరిగేదెప్పుడూ?" అనేసింది. అయితే రంగనాయకమ్మ ఆమె మాటను కాదనలేదుగానీ, తన పని మాత్రం మానలేదు. పిల్లవాడిని స్కూల్లో దింపి, తీసుకురావటం ఆమె ఒక పనిగా భావించేదికాదు. స్కూల్లో ఆమెకు ఎంతోమంది బాలకృష్ణులు కన్పించేవాళ్లు. పిల్లల కొట్లాటలు, తిట్లు, ఆటలు అన్నీ ఆమెకు బాలకృష్ణుని లీలలుగానే గోచరించేవి. ముంగలమూరెడు దాపున, దవ్వులదిక్కులందూ ఇంతింతనరాని సొంపుగా ఆడుతున్నావు కృష్ణా! ఈ జగమంతా నాకు కిశోరమయంగానే కనపడుతున్నది' అననుకునేది ఆమె మనస్సు.

కమల రోజూ ఆఫీసునుండి ఇంటికి రాంగానే అన్ని ఆరాలూ తీసేది.

"నందూ స్కూలుకు టైంకి వెళ్లాడా?"

"మధ్యాహ్నం అన్నానికింటికొచ్చాడా?"

"స్కూల్లో ఏ పిల్లలతో అయినా దెబ్బలాడే డా?"

"స్కూలు నుంచి రాంగానే కాంప్లాన్ కలిపి ఇచ్చేరా?"

ఇలా సవాలక్ష ప్రశ్నలు వేసేది. స్కూలు ఇనస్పెక్టరు ప్రశ్నలకు చేతులు కట్టుకుని టీచరు సమాధానాలు చెప్పినట్టు అన్నింటికీ రంగనాయకమ్మ సమాధానాలు చెప్పాలి. ఎప్పుడయినా ఏదయినా పొరపాటు జరిగితే కమల అత్తగార్ని మెత్తమెత్తగా చివాట్లు పెట్టేది. "రోజులు మారిపోయాయత్తయ్యా! మీరోజుల్లో పిల్లల్ని పెంచినట్టు కాదు'' అనేది.

ఇప్పుడు కోడళ్ల మాటలు రంగనాయకమ్మను బాధించటం మానేశాయి. మనవడితో కూడిన కిశోర ప్రపంచంలో నందకులంలో మానసికంగా నివశిస్తుండేదామె.



**త**లుపు చప్పుడైతే ఉలిక్కిపడి ప్రస్తుతానికొచ్చింది రంగనాయకమ్మ. పని మనిషి లక్ష్మి అవస్థ విని తను బాల నరసును కాపాట్టానికి బాల కృష్ణుని శిరసునివ్వటంతో ఆమె పాత జ్ఞాపకాల్లో పడిపోయింది. తల్లీ, తండ్రీ, బామ్మా, భర్త, అత్తగారు, తమ ఊరు, బోధన్, హైదరాబాదుల్లో తన జీవితం అంతా ఒకసారి ఆమె మనో పటలంలో మెదిలింది.

'నందుడేమో ఆ వచ్చింది' అనుకుంటూ వెళ్లి తలుపు తీసింది.

కొడుకూ, కోడల్ని చూసి, 'అయ్యో అప్పుడే ఆరయి పోయిందా. నేనెంతసేపు నా ఆలోచనల్లో మునిగిపోయివున్నాను. కోవెల కెళ్లటం ఆలస్యమయిందే' అనుకుంటూ లోపలకు వెళ్లి, చీరె మార్చుకుని కోవెలకెళ్లాలని బయలుదేరింది.

ఇంతలో కమల భర్తకు కాఫీ కలిపి ఇచ్చి, "చెప్పండి మీ అమ్మకి'' అంది.

"చెబ్దాం, తొందరేం..." అన్నాడు రంగనాధం.

"ఆమె ఏం గందరగోళం సృష్టిస్తుందోనని నాకు భయంగా వుంది'' అంది కమల.

"బావుంది, ఆమెకు బాధగా వుంటుందని, మన కర్తవ్యాన్ని మనం నిర్వహించక పోతే ఎట్లా?"

"మరి చెప్పండి ఆమెకు''

"అమ్మా! నందూ ఏడే?" అని తల్లిని పిల్చాడు రంగనాధాచార్యులు.

కోవెల కెళ్లబోతూ కొడుకు పిలిస్తే వచ్చింది రంగనాయకమ్మ.

"కూర్చోవే అమ్మా! నీతో మాట్లాడాలి'' అన్నాడు రంగనాధం.

"ఏమిటో చెప్పు. నందూ ఇంకా పక్కింటి వాళ్ల పిల్లలతో ఆడుతూనే వున్నట్టున్నాడు'' అంది ఆమె సోఫాలో కూర్చుంటూ.

"ఇప్పుడు నందూ చదువుతున్న స్కూల్లో చదువేం బాగాలేదు. ఇంట్లో వుండి మరీ మంకుగా తయారవుతున్నాడు. అందుకని వాడిని రెసిడెన్షియల్ స్కూల్లో చేర్పించాలనుకుంటున్నాం. నాగార్జునసాగర్‌లో కొత్తగా ఓ రెసిడెన్షియల్ స్కూలు పెట్టారు. అందులో పిల్లలకిచ్చే శిక్షణ బావుంటుందని విన్నాం. ఓ స్నేహితుడు రికమెండేషన్ కూడా చేశాడు. సీటు వచ్చేసినట్టే. రేపువాడిని తీసుకెళ్లి, ఫీజుకట్టి, జాయిన్ చెయ్యటమే'' అన్నాడు రంగనాధం భయపడ్తూనే.

"అంటే పిల్లవాడిని అక్కడే వుంచేస్తారా?" అనడిగింది రంగనాయకమ్మ. ఆ ఊహే ఆమెకు వణుకుపుట్టించింది.

"అవును. వాడి భవిష్యత్తును దృష్టిలో పెట్టుకుని మనం కొన్ని మమకారాలను చంపుకోవాలి. రాత్రిపూట చదువు సంధ్యలు కూడా వాళ్లే చూసుకుంటారు. సెలవులకి మాత్రమే పిల్లవాణ్ణి ఇంటికి పంపిస్తారు''

"పిల్లవాడు ఇంట్లో లేకుండా నేనుండలేనురా! మీరు మాత్రం వాడిని వదలి ఎలా వుంటారు. ఇప్పుడు వాడు చదూతూనే వున్నాడుగా బడిలో''

"వాడికిక్కడ చదువు రావటంలేదు. మీ గారాబంతో చెడిపోతున్నాడు'' అంది కమల.

"ఇంకా చిన్న వెధవ! ఒంటరిగా ఎలా వుంటాడు. దిగులుపడిపోతాడేమో'' అందామె క్షీణస్వరంతో. అవి ఎవర్నీ ఉద్దేశించి అన్నమాటలు కావు. అక్కడ స్కూల్లో వాడి ఒంటరితనాన్ని ఊహిస్తూ దిగులుపడిపోతూ అన్నదామె.

"వాడే అడ్జస్ట్ అవుతాడు. నాలుగు రోజులు దిగులు పడతాడు. సెవెన్త్ క్లాసు పాసయ్యాడు. పదకొండేళ్లొచ్చాయి. ఇంకా చిన్న తనమనుకుంటే ఎట్టా'' అన్నాడు రంగనాధం నిశ్చింతగా, హృదయభారం తీరినట్టు.

రంగనాయకమ్మకు విషయం అర్థమైపోయింది. వాళ్లా విషయం తనకు చెప్పింది తన సలహా కోసంకాదు. తను ఏడ్చిగోల చేస్తుందేమోనని చెప్పారు.

"మీ ఇష్టం నాయనా! నేనేం చెప్పగలను. మీ పిల్లవాడు, మీ ఇష్టం" అని లేచి కోవెలకు బయలుదేరింది రంగనాయకమ్మ.

నిస్త్రాణగావుంది ఆమెకు. బయటకొస్తుంటే కోడలన్న మాటలు ఆమెకు వినపడ్డాయి.

"ఆ విషయమెత్తలేదేం? మీకంతా మొహమాటం" అంది కమల.

"చెబ్దాం, తొందరేం, రేపు చెప్పొచ్చుగా'' అంటున్నాడు కొడుకు.

వాళ్లు చెప్పకుండా దాటవేసిన సంగతేమిటో ఆమెకు లీలగా అర్థమైంది! నందుడితో వచ్చిన స్థానం నందుడు ఇంట్లోనుండి వెళ్లిపోవటంతో తనూ వెళ్లి పోవాలని ఆమెకర్థమైంది. తన్నింకో ఇంటికి పంపిస్తారు. ఎక్కడైతేనేం తన జీవితం గడచిపోవటానికి, నందుడెట్లా వుంటాడు. తను లేకపోతే వాడసలు వుండలేడే!

కోవెలలో కూడా రంగనాయకమ్మ పురాణ శ్రవణంమీద అంత శ్రద్ధ చూపలేకపోయింది. ఇంటికొచ్చినా మనసు మనసులోలేదు. నందుడిని వదిలి వుండాలన్న ఆలోచన ఆమె మనసును పిండేస్తోంది. ఇంత విపరీతమైన మనోవ్యధ ఆమె ఎప్పుడూ అనుభవించలేదు. 'అయ్యో! ఆ ముగ్ధమోహనుడు, నందకిశోరుడిని తను ఎలా వదలి వుండగలదు?'

'మధురం మధురం వపురస్యవిభో
ర్మమధురం మధురం వదనం మధురం
మధుగన్ధి మృదుస్మితమేతదహో
మధురం మధురం మధురం మధురం'

-'ఆహా, ముందట నడయాడే నందకిశోరుని మకరంద పరిమళం కలిగిన ఆ మృదుమంద హాసాలంకృత వదనం ఎంత మధురమైంది! ఎంత సుందరమూ, సుస్నిగ్ధమూ అయింది!' అని పరితపించిందామె మనసు.

మనవణ్ణి చూస్తే దుఃఖం ముంచుకొచ్చి పక్కకు తప్పుకుపోయింది. 'బామ్మ సాపాటు చేసి రాలేదేమా ఇంకా' అని నిరీక్షించి, నిరీక్షించి వాడు నిద్రపోయాడు. ఆమెకు తిండి పోలేదు. పక్కమీద వచ్చి పడుకుంటే నిద్రపట్టలేదు. పక్కమంచంమీద నిద్రపోతున్న మనవడినే చూస్తూ కూర్చుందామె. 'ఈ ఆపద నుండి నన్ను తప్పించు తండ్రీ' అని దేవుడికి మొక్కుకుంది. 'హే గోపాలక, హే కృపాజలనిధే, హే సింధుకన్యాపతే, హే కంసాంతక, హే గజేంద్ర కరుణావారీణ, హే మాధవ, హే రామానుజ, హే జగత్త్రయగురో, హే పుండరీకాక్ష, హే గోపీజనాధ, మాపాలయం, పరంనజానామినత్వాంవినా' అని భగవంతుణ్ణి పరిపరి

విధాల ప్రార్థిస్తూనే ఆ సుదీర్ఘమైన రాత్రి గడిపిందామె.

ఆమె వాంఛించినరీతిలో ఆమె ప్రార్థనల నా పరమాత్ముడు వినలేదు. మర్నాడు పొద్దున్న కొడుకుని వెంటబెట్టుకుని పెట్టే, బెడ్డింగు తోసహా కమలా, రంగనాథంలు నాగార్జున సాగర్ వెళ్ళిపోయారు.

వెళ్ళేముందు నందకిశోరుడు, "నువ్వూ రారాదా బామ్మా! అక్కడ పెద్ద చెరువుందట. పడవలో షికారుచెయ్యవచ్చుట. చూసి వద్దాంరా'' అని మారాంచేశాడు.

"వద్దులే నాయనా! నువ్వు వెళ్ళిరా. పెద్దపెద్ద చదువులు చదువుకుని తిరిగిరా. నీకన్నీ శుభాలే కలగాలి తండ్రీ!" అని ఆశీర్వదించింది రంగనాయకమ్మ, ఉబుకుకు వచ్చే కళ్ళనీళ్ళను అదుపులో పెట్టుకుంటూ.

నందకిశోరుడు వెళ్ళిపోయాడు. అప్పటిదాకా లేచి చూస్తున్న ముసలితనం ఒక్కసారిగా తన్నావహించినట్లనిపించింది రంగనాయకమ్మకు. ఆమె లేవలేకపోయింది. ఎలాగో అపరాహ్నానికి ఓపికి తెచ్చుకుని స్నానంచేసి, ఇంత ఉడకేసి దేవుడికి నైవేద్యం పెట్టగలిగింది గాని, ఆమెకు నోట ముద్దపోలేదు. బయట ఏ చప్పుడయినా నందుడు తిరిగి వస్తున్నాడేమోననిపించి లేచి గుమ్మందాకా వెళ్ళివచ్చేది. 'వాడు ఎందుకొస్తాడు తను బతికుండగా వస్తాడా? ఆ నందనందునుడిని తాను జీవించి వుండగా చూడగలదా? అయ్యో తండ్రీ! ఎప్పుడొస్తావురా!

'మధుర తరస్మితామృత విముగ్ధ ముఖాంబురుహం
మదశిఖిపించ లాంఛిత మనోజ్ఞ కచప్రచయం
విషయ విషామిష గ్రసన గృధ్నుని చేతసియే
విపులవిలోచనం కిమపి ధామ చకాస్తి చిరం'

-'మధుర మనోహర విముగ్ధ ముఖారవిందంతో, మదశిఖిపింఛలాంఛితమైన మోముతో అవాఙ్మానస గోచరమై, అనిర్వాచ్యమై ఒప్పే ఆ తేజః పుంజాన్ని నేనేం తెలుసుకోగలను, ఇంద్రియలోలుపత విషామిషము వంటిదని తెలుసుకొనజాలని నను బోటికి ఆ పరమాత్మను తెలుసుకొనుటెక్కడ?' అని గొణుక్కుందామె.

చీకటి పడేవేళకు తిరిగి వచ్చారు కమలా, రంగనాథంలు. రంగనాయకమ్మ వాళ్ళను ఏమీ అడగలేదు. నందుడు లేని ఇల్లు ఆమెకు స్మశానవాటికలా కనిపించింది.

రంగనాథమే చెప్పాడు, "వాణ్ణి స్కూల్లో చేర్పించామమ్మా! భయపడాల్సిందేం లేదు. ప్రిన్సిపాలు కూడా పిల్లలుకలవాడే. 'మీరు నిశ్చింతగా వుండండి. మీ పిల్లవాడిని మా పిల్లవాడుగా చూసుకుంటాం' అని హామీ ఇచ్చాడు. వాడూ అంత దిగులుపడినట్టు కన్పించలేదు'' అని.

రంగనాయకమ్మకు మాటపడిపోయింది. నిర్లిప్తంగా కొడుకువంక చూసింది.

"ఇంక నీ విషయమూ ఆలోచించామమ్మా! నువ్వు మాత్రం ఎంతకాలం మాదగ్గర వంటరిగా వుండగలవు. వంట్లో పనిచేసే ఓపిక కూడా సన్నగిల్లిందాయె. ఇప్పుడు నువ్వు మంచాన పడ్డావా చేసేదిక్కులేదు. అదీ, నేనూ బాంక్‌కి వెళ్ళాలికదా! ఇంట్లో కూర్చుంటే సంసారం గడవదుకదా! మావల్ల కాకేగా పిల్లవాణ్ణి రెసిడెన్షియల్ స్కూల్లో వేసింది. నీకూ ఏదో ఏర్పాటు చెయ్యాల్సిందే'' అన్నాడు రంగనాథం.

"ఏం ఏర్పాటు చేస్తావురా రంగనాథాచార్యులూ!" అంది ఆమె క్షీణస్వరంతో.

'ఏంలేదు... అదే... మరే'

"ఏవిటా సణుగుడు. చెప్పేదేదో సరిగ్గా చెప్పక" అంది కమల.

"నేనిలా అంటున్నానని మరోలా భావించకమ్మా! నువ్వూ ఆలోచించు. అందర్నీ కన్నట్టే నన్నూ కన్నావు. ఇన్నేళ్ళూ నా ఇంట్లోనే వున్నావా! అన్నయ్యలుగానీ, వదినలుగానీ

మొహమెత్తి ఎప్పుడైనా చూశారా ఈవంక. వాళ్ళకి బాధ్యత లేదా? వదినలందరూ మరీ పాపిష్టిమొహాలయ్యారు. ఎంతకాలమని మా ఆవిడమాత్రం సహించి ఊర్కోగలదు. రేపు నాన్న తద్దినానికెళ్తాను కదా! కడిగిగిపెడ్తాను. అందరం తలో చెయ్యి వేసుకుంటే పెద్ద కష్టమేం కాదు నిన్ను 'హోం ఫర్ ఏజ్డ్'లో చేర్పించటానికి.

"అంటే ఏంటి నాయనా అది?"

"వృద్ధుల ఆశ్రమం. నెలకు మూడొందలు కట్టాలిట. నీకింకా పనీపాటా చేసే ఓపిక వుందిగా. ఆశ్రమంలో వాళ్ళు చెప్పినపని చేస్తే అంత కూడా కట్టాల్సివుండదుట. నల్గురం నాలుగు యాభైలు వేసుకుంటే సరిపోతుంది''

"అక్కడ శుచీ, శుభ్రం వుంటుందిరా నాయనా?"

"శుచీ శుభ్రం, మడీ దడీ అంటే లాభంలేదు. అడ్జస్టు అయిపోవాలి. మానవులందరూ ఒకటేననే మానవతావాదం అలవర్చుకోవాలి'' అన్నాడు కొడుకు.

"సరే నాయనా! అట్టాగే చేర్పించు'' అని పక్కకు తిరిగి పడుకునుండిపోయింది రంగనాయకమ్మ.

ఆ రాత్రి రంగనాయకమ్మ అభోజనంగానే వుండి పోయింది. నిర్లిప్తంగా, నిరాసక్తంగా వున్న రంగనాయకమ్మను భోజనానికి లెమ్మని అడిగే ధైర్యం లేకపోయింది కమలకు. కొడుకు భవిష్యత్తును దృష్టిలో వుంచుకుని తాము తీసుకున్న నిర్ణయం సరైనదేనన్న నమ్మకం ఆమెకున్నా, ఎక్కడో అంతరాంతరాల్లో తాము తప్పుచేసినట్లుగా ఫీలవసాగింది ఆమె. బామ్మా మనవళ్ళ సంబంధం, బంధం ఆమెకి తెలియంది కాదు. వాళ్లని వేరుచేసి మంచిపని చేశామా అన్న విషయంలో ఆమెకింకా సందేహం వుండనేవుంది.

మర్నాటికల్లా రంగనాయకమ్మకు ఒళ్ళుతెలియనంత జ్వరం వచ్చింది. అపస్మారకంలో నోటికొచ్చిన పద్యాలు, శ్లోకాలు గొణుక్కోసాగింది. ఆమె పరిస్థితిని చూసిన రంగనాథం జీవితంలో మొదటిసారిగా గిల్టీగా ఫీలయ్యాడు. డాక్టరును తీసుకొచ్చి చూపించాడు. అతను, "ఏం ఫర్వాలేదు. రెండురోజుల్లో జ్వరం తగ్గిపోతుంది'' అని భరోసా ఇచ్చి ఇంజెక్షన్ చేసి వెళ్ళిపోయాడు. కాని రంగనాథానికి ధైర్యమనిపించలేదు. అన్నలకు కబురుచేశాడు. వాళ్ళు వచ్చి చూసివెళ్ళారు.

రెండురోజులయినా జ్వరం తగ్గలేదు. ఆమె అపస్మారకంలో పడిపోయింది. రంగనాథం మూడో అన్న వేంకటాచార్యులకూ, అక్క అండాళమ్మకూ, చెల్లెలికీ టెలిగ్రాములు ఇచ్చాడు. అన్నలూ, వదినలూ వచ్చారు. డాక్టరు వస్తున్నాడు, పోతున్నాడు. ఆమె పిల్లలందరూ వచ్చారు.

ఐదోరోజుకు జ్వరం తగ్గింది. ఆమె తెలివి లోపడింది. కొడుకులూ, కూతుళ్ళూ ఆమె పరిస్థితిని చూసి సంతసించారు. ఆమె తన పిల్లల్నందరినీ చూసి "ఏమిటంతా ఇలా వచ్చారు? నన్ను వృద్ధాశ్రమానికి పంపించటానికా?" అంది చిరునవ్వు నవ్వుతూ. మళ్ళీ చుట్టూ చూసి, "ఏడీ నందుడు రాలేదా? పోన్లే, చదువుకోనీ వాణ్ణి'' అంది ఆమె.

ఇంక ఎవరితోనూ మాట్లాడలేదు ఆమె. గొంతు వణికిపోతుంటే నోటికి వచ్చిన శ్లోకం పఠించుకుంది ఆమె.

'వృత్యస్త పాదమవతంసిత బర్హిబర్హం
సాచీకృతానన నివేశిత వేణురంధ్రం
తేజః పరం పరమకారుణికం పురస్తాత్
ప్రాణప్రయాణ సమయే మమ సన్నిధత్తాం' అని.

"ఏమిటి అమ్మ చదివే శ్లోకానికర్థం?" అనడిగాడు వేంకటాచార్యులు.

"అమ్మ మహానుభావురాలురా నాయనా! అటుకాలు ఇటూ, ఇటుకాలు అటూ పెట్టి నుంచుని, నెమలి ఈకతో, ఒకవేపు వాల్చిన తలతో వేణువూదుతున్న అపార కరుణానిధి ఆ కృష్ణపరమాత్మ మరణకాలంలో నాముందట పొడతెంచుగాక!' అని

ఆ శ్లోకానికర్థం" అని వ్యాఖ్యానించాడు శేషశయనాచార్యులు భక్తిపూర్వకంగా తల్లికి నమస్కరిస్తూ.

రంగనాయకమ్మ మొహంలో వింత కాంతి మెరిసింది. మరెప్పుడూ జీవితకాలంలో పొందనంత ఆనందం ఆమె చిరునవ్వులో భాసించింది. అంతే, ఆపైన కళ్ళు మూసేసిందామె. అంతిమశ్వాస తీసుకుంది. శాశ్వతంగా వృద్ధాశ్రమానికి తరలి వెళ్ళిపోయింది.

'పశ్యేమ శ్శరదః శతం, జీవేమ శరదః శతం, శ్రుణుయామ శరదపిశతం' అని ఆశగొల్పి తీసుకొచ్చినవాడు అర్ధాంతరంగానే పోయాడు.. బతికున్నప్పుడూ బతుకులో తీపి ఆమెకి తెలిసేట్టు మనలేదు ఆయన. ఆమె చవిచూసింది నూరుశరత్తుల జీవితం కాదు. నూరు శిశిరాల ఒద్దికల బతుకు.

శిశిరంలో పర్వతశిఖరాలపై, వృక్షాగ్రాలపై కురిసిన మంచు చూడనెంత మనోహరంగా కమనీయంగా వుంటుందో, హిమసన్నిష్టమైన బతుకు అంత నికృష్టంగానూ దుఃఖభాజనంగానూ వుంటుంది. బతుకులో తీపిని లుప్తంచేసే జీవనశైత్యంతో బతుకునీడ్వాల్సిన ఆమె తన దృష్టిని శరత్ జ్యోత్స్నలా, మనోజ్ఞంగా దృశ్యమానమయ్యే తెల్లటి హిమనగంపైనే కేంద్రీకరించింది. ఆ కమనీయ సుందర దృశ్యావలోకనంలో విహ్వలమై తనను తానే మర్చిపోయిందామె. ఎన్నో శిశిరాలు గడిచాయి. చుట్టూ మంచు పేరుకుంటూనే పోయింది. ఆమె స్వాప్నికదృష్టిలో ఆ మనోహరదృశ్యం రూపుకట్టుకునేవుంది. పోనుపోను మరింత మనోజ్ఞంగా, కమనీయంగా అవతరించిందది. అంత శిశిరంలోనూ ఆమె అనుభూతి పొందిన శరత్తది.

కూతుళ్ళు గొల్లుమన్నారు. తల్లి శవంపై బడి పొర్లిపొర్లి ఏడుస్తున్నారు. కోడళ్ళు కన్నీళ్ళు కారుస్తున్నారు. కొడుకులు విచారగ్రస్తులయ్యారు.

పెద్దకొడుకు శేషశయనాచార్యులు వచ్చిన బంధువులతో అంటున్నాడు, "మా అమ్మ కేవండీ! పరమ భాగవతోత్తమురాలామె. మహా భక్తురాలు, మహాజ్ఞాని, మహా పండితురాలు. అంత తెలిసిన మనిషి కాబట్టే ఎవర్నీ కష్టపెట్టకుండాపోయింది. తను జీవించి వున్నంతకాలం ఎవరిచేతా తను చాకిరీ చేయించుకోలేదు. పోయేటప్పుడూ ఎవరిచేతా చేయించుకోకుండా పోయింది. ఎంత పుణ్యం చేసుకుంటే ఇలాంటి మరణం సంభవిస్తుందీ. 'వినాదైన్యేన జీవనం, అనాయేసేన మరణం' రెండూ మా మాతృమూర్తికి సిద్ధించాయి. విష్ణుసాయుజ్యం చేరుకుంది ఆమె'' అని.

"అవును... 'సంసారేకిం కంసారే శ్చరణ కమల పరిభజనం'లాగా మా అక్క జీవితం గడిపింది'' అన్నాడు విషాదంగా పోయిన అక్కవంక చూస్తూ రామానుజాచార్యులు.

"టెలిగ్రాం... టెలిగ్రాం..." అని బయట సైకిల్ బెల్ ట్రిం ట్రింమనిపించాడు టెలిగ్రాం తెచ్చిన పోస్ట్‌మాన్.

ఆదుర్దాగా టెలిగ్రాం అందుకోటానికి వెళ్ళాడు రంగనాధాచార్యులు. సంతకంచేసి, టెలిగ్రాం చేతికి తీసుకుని చించి చదివాడు.

'నందకిశోర్ సీరియస్‌లీ ఇల్. స్టార్ట్ ఇమ్మీడియట్లీ... -ప్రిన్సిపాల్, రెసిడెన్షియల్ కాలేజ్, నాగార్జునసాగర్' అని వుంది అందులో.

★

నా భార్య కాకాని సావిత్రి స్మృతికి
ఇది అంకితం

-కాకాని చక్రపాణి

# చతుర కథలు

## అప్పన్నలు

నౌకరు కుర్రవాడొకడు ఇద్దరు పాపల్ని తీసుకొచ్చి మా స్కూలుదగ్గర దింపాడు. వాళ్ళిద్దర్నీ నిన్ననే స్కూల్లో చేర్చారుట.

లోపలికి వచ్చాక పాపల్ని పేర్లడిగాను. ఇద్దరూ ఒకే రకంగా జవాబు చెప్పారు, 'అప్పన్న' అని. వాళ్ళని ఎంత రెట్టించి అడిగినా ఇద్దరూ కూడా 'నాపేరు అప్పన్నే' అనే చెప్పారు. పాపలిద్దరూ కవల పిల్లలేమో? ఒకే పోలిక! పేర్లు కూడా నిజంగా ఒకటేనా? అనే సందేహం కలిగింది నాకు.

"మిమ్మల్ని స్కూలుకి తీసుకొచ్చాడే...! అతనెవరు?' అన్నాను పాపల లేత బుగ్గలు ముద్దుగా నిమురుతూ.

"మా నౌకర్! అప్పన్న'' అన్నారు పాపలిద్దరూ ఏకకంఠంతో.

నాకీసారి నవ్వొచ్చింది. 'ఎవర్ని గుర్రించి అడిగినా ఒకే పేరు చెప్తున్నారు. ఎంతసేపూ వాళ్ళ ధోరణిలో ఒకేమాట చెప్తూండడం వాళ్ళ స్వభావమేమో!" అనుకున్నాను.

మధ్యాన్నం ఆ పాపలికి బుల్లిబుల్లి టిఫిన్ బాక్సులతో వెచ్చటి ఇడ్లీలు, ఫ్లాస్కుతో పాలు వచ్చాయి. పాపలపేర్లు సరిగ్గా తెలుసుకుందామని ముందుగా ఆ నౌకరును 'నీపేరేమిటి?' అన్నాను.

"అప్పన్న'' అన్నాడు.

ఒక పాపని చూపిస్తూ 'ఈ పాప పేరేమిటి?' అన్నాను.

"అప్పన్న''

"నీ పేరు అప్పన్నేలే! నేనిప్పుడు అడిగింది ఈ పాప పేరు!" అన్నాను.

"ఒట్టండి. దేవుడి సాచ్చిగా అప్పన్నేనండి''

"అవునా! సరేలే! రెండోపాప పేరు?"

"అప్పన్నండి''

"ఏమిటా వేళాకోళం? సరిగ్గా చెప్పు'' అని



గద్దించాను.

"ఆయ్‌బాబదేంటండీ, సత్తెప్పమానికంగా అప్పన్నేనండి''

"నీకాపేరు తప్ప ఇంకే పేరూ చెప్పటంరాదా?" అన్నాను కళ్ళెర్రజేస్తూ.

"ఎందుకండంత కోపం? మాయమ్మ పేరు ఎల్లమ్మండి. మాయత్త పేరు సింగమ్మండి. మా అయ్యపేరు పోలయ్యండి. నాకు పేర్లు రాకపోవటమేంటండి'' అన్నాడు ధీమాగా.

"మరి? నీపేరుకీ ఈ పాపల పేరుకీ తేడా ఏమీ లేదా?" అన్నాన్నేను.

అతడొకసారి బుర్ర బరుక్కుని "తేడా లేక పోటమేంటండి? నా పేరు అప్పన్న. పాపగోరి పేర్లు! అదేందోనండీ... మీకు నాన్సెప్పలే నండి'' అంటూ తడబడ్డాడు.

నేను ఊరుకున్నాను.

సాయంకాలం ఆ పాపల్ని తీసుకుని వెళ్ళటానికి ఆ పిల్లల తండ్రేవచ్చారు.

నేను ఆయనకి నమస్కారం చేసి నన్ను పరిచయం చేసుకుంటూ "ఈ పాప పేరేమిటి సార్?" అన్నాను.

"అర్పణ"

"ఆ పాప పేరు?"

"అపర్ణ" అన్నారాయన.

ఆ పేర్లు వినగానే నాకు సంగతి అర్థమయి ఆశ్చర్యం, నవ్వు వచ్చాయి.

"ఆహాఁ" అనుకొని "ఈ బుక్స్ కొని పంపండి'' అంటూ పాపలకి కొనవలసిన పుస్తకాల 'లిస్ట్' ఇచ్చాను.

ఆయన పాపల్ని తీసుకుని వెళ్ళిపోయారు. ఆ పాపలూ, వాళ్ళ అప్పన్నా చెప్పిన ఆ పేర్లూ జ్ఞాపకం వచ్చి మళ్ళీ నాకు నవ్వువచ్చింది.

ఉచ్చారణలో చదువులేని అప్పన్నా, చిన్న పిల్లలూ ఒకటే గదా, మరి!

**-బద్దిగం పాండురంగారెడ్డి**

---

## పురుగుమందు

**ము**కుందాపురం పేరుకే పురంగాని చిన్న పల్లెటూరు. హైదరాబాద్ దగ్గర్లోనే వుండడంతో పొలాల్లో కూరగాయలు పెంచి సిటీలో అమ్ముకుంటూ సుఖంగా జీవిస్తున్నారు. శ్రమకు తగ్గ ఫలితం దక్కనీయకుండా మార్కెట్లలో దళారీలు దోచుకుంటున్నా భుక్తికి లోటులేకుండా జరిగిపోతున్నది.

ఆ ఏడు వర్షాలు ఎక్కువై పంటలకు చీడ సోకింది. రకరకాల కీటకాల బారినపడి మొక్కలు నాశనమైపోతున్నాయి. కొన్ని మొక్కలు పెద్దవైనా పిందెలు రాలిపోవడమో, కాయలకు పురుగు పట్టడమో జరిగి ఆదాయం లేక రైతులు తల్లడిల్లి పోసాగారు. ఎన్నిరకాల పురుగుమందులు పిచికారీ చేసినా ఫలితం దక్కలేదు.

అయితే ఆశ్చర్యంగా వెంకటాద్రి కూరగాయల తోటలు బ్రహ్మాండంగా దిగుబడినిచ్చాయి. మామూలుగానే సిటీకి సప్లైయ్‌చేస్తూ హాయిగా వున్నాడు.

ఊళ్లో రైతులంతా ఆ రహస్యం ఏమిటో తెలుసుకోవాలని వెంకటాద్రిని పంచాయితీ ఆఫీసుకి పిలిపించారు. మామూలుగా అయితే చెప్పడేమోనని సందేహించి ఫుల్‌బాటిల్ విస్కీ తెప్పించి పార్టీ పేరుతో తాగించారు.

అయినా వెంకటాద్రి తొణకలేదు.

ఆ రహస్యం చెప్పలేదు.

"అన్నా! నేనొక పురుగుమందు కనిపెట్టాను. అది వాడుతున్నాను. అందుకే నా తోటలు క్షేమంగా వున్నాయి'' అన్నాడు.

"అదేదో మాకు ఇవ్వరాదా? నీకు డబ్బు ఇస్తాం" అన్నాడు గ్రామసర్పంచ్.

"అది మాత్రం కుదరదు. ఎకరానికి ఇంతని ఇవ్వండి. నేనే మీ తోటలకు మందు పిచికారీ చేస్తాను'' అన్నాడు.

ఇదేదో బాగానే వుందనుకున్నారు.

"సరే! ఇస్తాం. చెప్పు ఎంత ఇవ్వ



మంటావు?"

"నేను చెప్పడం ఎందుకు? మీరు పురుగు మందులు వాడుతున్నారుగా! ఆ ఖర్చులో సగం ఇవ్వండి చాలు. నేను కనిపెట్టిన పురుగుమందు చౌక. మందు పిచికారీ చేయించడానికి కూలీ వేరే ఇవ్వాలి'' అన్నాడు వెంకటాద్రి.

అందరూ అందుకు ఒప్పుకున్నారు.

వెంకటాద్రి మందును డ్రమ్ముల్లో ట్రాక్టర్ మీద తెచ్చి కూలీలతో పిచికారీ చేయిస్తున్నాడు.

ఊళ్లో అందరి పొలాలు పురుగుల బాధ నుంచి విముక్తి పొంది కళకళలాడసాగాయి.

రైతులంతా సంతోషించారు.

కాని కొందరిలో కుతూహలం చెలరేగి వాళ్ళకి నిద్రలేకుండా చేసింది.

అసలు వెంకటాద్రి పురుగుమందు కనిపెట్టడం ఏమిటి?

కనిపెట్టాడేపో, ఎక్కడ తయారుచేస్తున్నాడు?

దానికొక ఫ్యాక్టరీ హంగామా వుండాలిగదా? ఎప్పుడూ ఊళ్ళోనే ఖాళీగా వుంటున్నాడు. ఎక్కడ? ఎప్పుడు తయారుచేస్తున్నాడు?

ఏమిటో ఈ చిదంబర రహస్యం తెలుసుకోవాలని కొందరు వెంకటాద్రిమీద నిఘా వేశారు.

అతను ఎక్కడో ఆ మందుకొని డ్రమ్ముల్లో కలిపి చాలా లాభపడుతున్నాడు. అదేదో తాము తెలుసుకుంటే వెళ్లి కొనుక్కోవచ్చు. మధ్యలో వెంకటాద్రికి డబ్బు ఇచ్చుకోవడం ఎందుకు? తామే వెళ్లి కొనుక్కుంటే చౌకగా పడుతుందిగదా అని ఆలోచించారు.

ఒకరోజు అర్ధరాత్రి వెంకటాద్రి ట్రాక్టరుమీద డ్రమ్ములు వేసుకుని సిటీకి వెళ్తుంటే వెంబడించారు.

వెంకటాద్రి ట్రాక్టరు హుస్సేన్‌సాగర్ పక్కన ఆగింది.

వెంకటాద్రి, అతని కొడుకులు బిందెలతో హుస్సేన్‌సాగర్లోని నీళ్లు నింపి డ్రమ్ముల్లో పోస్తున్నారు.

'ఔరా! వెంకటాద్రి మందు పేరుతో కొడుతున్నది హుస్సేన్‌సాగర్ నీళ్ళా!' అని ఆశ్చర్యపోయి మూర్ఛపోయారు.

-వాణిశ్రీ

# చతుర ప్రపంచం

## పేపరు కథ

పొద్దున్నే లేస్తూనే పేపర్ తిరగెయ్యందే పళ్ళు కూడా తోముకోరు ఎంతోమంది. ముందు హెడ్ లైన్స్ వరకైనా గబగబా చూసేసి ఆ పైన ఏ కాఫీనో టీనో తాగుతూ తీరిగ్గా పేపరు మొత్తం చదువుతారు.

వందా, నూట ఏభై సంవత్సరాలు వెనక్కి వెడితే అసలు దేశంలోగానీ, ప్రపంచంలోగానీ




చుట్టుపక్కల ఏం జరుగుతోందో తెలుసుకోవాలనే కుతూహలం వుండేది కాదు ప్రజల్లో. 1830 ఆ ప్రాంతాల్లో యూరప్ ప్రజలు నెమ్మదిగా వార్తలను తెలుసుకోవాలనే కుతూహలాన్ని చూపించడం ప్రారంభించారు. దాంతో అప్పటికప్పుడు కొన్ని పత్రికలు వెలిసి సమాచారాన్ని పోగుచేసి ప్రజలకందించడం ప్రారంభించాయి. కానీ పనిచేసే వ్యక్తులు, సౌకర్యాలు తక్కువ కావడంతో అనుకున్నంత వేగంగా, కావలసిన సమయానికి వార్తా పత్రికలను ప్రజలకు అందించలేకపోయేవారు.

అప్పట్లో అమెరికానుంచి ఇండియాకు, ఇండియానుంచి అమెరికాకు వార్తా పత్రికలు చేరడానికి 10 నుంచి 20 రోజులు పట్టేది. 1835 నాటికి ఛార్లెస్ హెవాస్ అనే ఆయన మొదటిసారిగా వరల్డ్ న్యూస్ ఏజెన్సీని పారిస్‌లో 'హవాస్ఏజన్సీ' అనే పేరుతో స్థాపించాడు. పావురాల సహాయంతో దూర ప్రాంతాల్లో వున్న న్యూస్ పేపర్ ఆఫీసులకి వార్తలని, ఉత్తరాలని పంపించేది ఈ న్యూస్ ఏజెన్సీ. పారిస్ ఆఫీసునుండి ఉదయాన్నే బయలుదేరిన పావురాలు బెల్జియం న్యూస్ పేపర్ ఆఫీసుకి మధ్యాహ్నం చేరేవి. అలాగే లండన్‌నుంచి ఉదయాన్నే విడిచిపెట్టబడిన పావురాలు బ్రిటిష్ ఛానల్‌ని దాటి పారిస్ చేరుకునే సరికి మధ్యాహ్నమయ్యేది.

తరువాత కొంతకాలానికి శామ్యూల్ మోర్స్ కనిపెట్టిన ఎలెక్ట్రో మాగ్నెటిక్ టెలిగ్రాఫ్ సిస్టమ్ ద్వారా వార్తలనందించడంలో ఆధునిక పద్ధతులను ప్రారంభించింది ఈ న్యూస్ ఏజెన్సీ. 1870 నాటికి ఈ పద్ధతిద్వారా 41,000 కి.మీ.ల దూరానికి కూడా సునాయాసంగా వార్తలను పంపడం ప్రారంభించింది ఈ ఏజెన్సీ. మరికొంతకాలానికే బెలూన్ ట్రాన్స్‌పోర్టేషన్ పద్ధతిద్వారా యుద్ధగాథలను పత్రికలో ప్రచురణార్థం పంపించేది.

1885 నాటికి అమెరికన్ రైట్ బ్రదర్స్ కృషి ఫలితమైన టైపింగ్ పద్ధతిద్వారా మరింత అభివృద్ధిని సాధించింది ఈ న్యూస్ ఏజన్సీ. 1931 నాటికి టెలిగ్రాఫ్ పద్ధతి స్థానంలో టెలిప్రింటర్ పద్ధతి అమలులోకి వచ్చింది.

1950 నాటికి రేడియో టెలిప్రింటర్ పద్ధతిని ప్రారంభించిన ఈ ఏజెన్సీ 71వ సంవత్స

రంలో ప్రపంచంలో మొట్టమొదటిసారిగా తమ ఏజెన్సీతో సాటలైట్ లింక్‌ను కుదుర్చుకుంది. ప్రస్తుతం 120 దేశాలకు ఫ్రెంచి, ఇంగ్లీషు, స్పానిష్, జర్మన్, అరబిక్, పోర్చుగల్ మొదలైన వివిధ భాషల్లో ఏడు లక్షల పదాలవరకూ సమాచారాన్ని అందజేయగలుగుతోంది.

ఆసియా, ఆఫ్రికా, ఉత్తర అమెరికా మొదలయిన దేశాల్లోని మారుమూల ప్రాంతాల్లో 145 వార్తా సేకరణ కార్యాలయాలను స్థాపించింది. మొత్తం సమాచారమంతా ముందుగా పారిస్‌లోని మెయిన్ ఆఫీసుకి ప్రోసెసింగ్ కోసం పంపబడుతుంది.

వార్తలను విశ్లేషించి, సంక్షిప్తీకరించి, వాటికో రూపాన్నివ్వడానికి షుమారు రెండు వందలమంది ఉపసంపాదకులు ఆ ఏజెన్సీలో పని చేస్తున్నారు.

## వింతజబ్బు

ఇంగ్లాండులో జరిగిన ఓ వింత సంఘటన వైద్య ప్రపంచాన్నేకాక అందర్నీ ఆశ్చర్యపరచింది.

ఆరేళ్ల మారిస్‌గ్రిసన్ అనే బాలుడికి ఉన్నట్టుండి తట్టుకోలేనంత కడుపునెప్పి వచ్చింది. మరి కాసేపు ఆలస్యం చేస్తే పిల్లవాడి ప్రాణమే పోతుందేమో అన్నట్టుగా కిందపడి దొర్లుతున్నాడు మారిస్.

అన్ని పరీక్షలు చేశాక అతని కడుపులో కంతివుందని, వెంటనే ఆపరేషన్ చెయ్యాలని తేల్చారు డాక్టర్లు. అయితే వాళ్లనుకున్నట్టు అది ఒక మామూలు ట్యూమర్ ఆపరేషన్‌లా కాక, సిజేరియన్‌లా తయారయింది. పొట్ట ఓపెన్ చెయ్యగానే లోపల ఎదుగుతూన్న పిండం కంటబడింది. అది ప్రాణం లేక గడ్డకట్టిపోయివుంది. ఇది ఇంతగా గడ్డకట్టడం మూలంగానే నెప్పి అంత తీవ్రంగా వుందని తేల్చారు డాక్టర్లు.

అయితే 'ఆరేళ్ల పసిబాలుడి పొట్టలో బేబీ ఎంబ్రియో ఎలా వచ్చింది?' అన్నది మాత్రం డాక్టర్లను జుట్టు పీక్కునేలా చేసింది. అటుపైన రకరకాల పరీక్షలు చేసిన తరువాత తేలిందేమంటే అది మారిస్ యొక్క కవలసోదరుడిదేనని వెల్లడయింది.

మొదట్లో అది ప్రాణంతో వుండి కొంతకాలం ఎదిగినా తరువాత అనుకూల పరిస్థితులు లేక చనిపోవడం, మిగిలిన టిష్యూస్ దాన్ని చుట్టూ చేరడంతో అది గట్టిపడటం జరిగిందన్నారు వైద్యులు. ఇంతకీ ఈ బాలుడు బాధ పడేది టెరాటోట్యూమర్‌తో. ఈ ట్యూమర్ ఎంబ్రియో కారణంగానే ఏర్పడుతుందన్నారు వైద్యులు. ఎంబ్రియోతో మిగతా టిష్యూలన్నీ కలిసి దాన్ని గట్టి పరచి ట్యూమర్‌గా తయారు చేస్తాయి.




తను పుట్టినపుడే తనతోపాటు పుట్టవలసిన సోదరుడు తన పొట్టలోనే ప్రవేశించి ఇలాంటి గందరగోళం చేసినట్టు మారిస్‌కు తెలియదు.

ఆపరేషన్ అవడంతో నొప్పి తగ్గి ఆడుకుంటోన్న మారిస్‌ని చూసిన తల్లితండ్రుల ఆనందం చెప్పనలవికాదు.

# హీరో పై సమీక్షలు

ఆగస్ట్ 'చతుర'లో ప్రచురితమైన బలరాం నవల 'హీరో'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం...

## ఆచరణీయం కావాలి

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

ఈనవల ప్రారంభం విశాఖ 'బీచిగాలి'లా ఆహ్లాదంగా మొదలయ్యి, చదువరులకు యూనివర్శిటీ లైఫ్‌ని, ఒక మనోహర దృశ్యంగా స్మరణకు తెస్తుంది. అంతలోనే హీరోగారి ప్రతిజ్ఞ గుర్తొచ్చి అతని జీవితం ఏ మలుపు తిరుగుతుందోనన్న ఆసక్తి పెరుగుతుంది. యూనివర్శిటీ పట్టభద్రులై బయటకు వెళ్ళే విద్యార్థులనుంచి, ఒక మంచి పనిచేయునట్లు ప్రతిజ్ఞకు ప్రోత్సహించే ప్రొఫెసర్ పాత్ర ఎంతైనా అభినందనీయం. ఇది కేవలం ఊహలకే పరిమితం కాకుండా ఆచరణీయమైతే సమాజానికి గొప్ప ఉపయోగకరంగా ఉంటుందని పిస్తుంది. బాపిరాజు పాత్ర ఈ నవలకు నిండుతనాన్ని తెచ్చిపెట్టింది. ఈపాత్ర చాలా సందర్భాలలో తన మామూలు ధోరణిలో వివిధములైన పోలికలతో లౌక్యంగా హాస్యంగా మాట్లాడటం చదువుతూంటే తెరలు తెరలుగా నవ్వు పుట్టుకొచ్చి, రచయితకున్న విషయ పరిజ్ఞానానికి చమత్కార దృష్టికి వహ్వా! అనిపించేట్లుంది. సూర్యనారాయణ, వెంకటరత్నంల డైలాగులు 'సినిమా ఫక్కీ'లో నడిచాయి. వినయ్ పాత్రను ఆదర్శవంతంగా అభ్యుదయకరంగా తీర్చిదిద్దాలనే ఉద్దేశ్యమయితే రచయితకుందిగానీ దానికి పూర్తి న్యాయం చేకూర్చలేకపోయారనిపిస్తుంది.

అదీకాక వసంత- తరచూ "నా మొదటి భర్తయితే" అంటూ ప్రస్తావించడం వలన వినయ్ అనుభవించే క్షోభ అతని ఆదర్శభావాలను డామినేట్ చేసేవిధంగా వుంది. తల్లి దండ్రుల అండ, సోషల్ స్టేటస్ ఉన్న వసంతను కాకుండా, ఏ ఆధారంలేని, నిజమైన 'సమాజ బాధితురాలైన' వితంతువును వివాహం చేసుకొనివుంటే వినయ్ పాత్ర హీరోగా రాణించడమే కాకుండా, అతని ప్రతిజ్ఞకు ఆదర్శానికి ఒక అర్థం అంటూ వుండేది. మొత్తానికి కాలక్షేపానికి లోటురాకుండా, బోర్ ఫీలవ్వకుండా చదివించిందనే మాట వాస్తవం.

-బి.శంకరరాజు,
గజపతినగరం.

## ఆదర్శానికి అర్థం

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

ఈ నెల చతుర 'హీరో' నవల సస్పెన్స్, సీరియస్‌నెస్‌కు భిన్నంగా చదవడానికి హాస్యంగా బాగుంది.

అమ్మాయిల పెళ్లిళ్ళు గగనమైన ఈ రోజుల్లో నవలలో ఒకచోట 'కట్నాలకు, అందాలకు, సంఘంలో గౌరవానికి అతీతంగా నేను ఒక చదువు, సంస్కారం ఉన్న నా వయసు వితంతువుని భార్యగా స్వీకరిస్తాను' అనే వినయ్ ప్రకటన ప్రతి ఆడపిల్లకు నచ్చిందనడంలో సందేహంలేదు.

వినయ్‌లాంటి వాళ్ళు నిజజీవితంలో చాలా అరుదు. అయినా కూడా సమాజంలో

అలాంటి ఒక్కరన్నా ఉండాలనీ, నేటి యువతకు వారు ఆదర్శం కావాలనీ, వినయ్ పాత్ర ద్వారా రచయిత చక్కగా చెప్పారు.

కళాశాల 'వార్షికోత్సవంలో ప్రతి విద్యార్థీ సమాజానికి తమవంతు బాధ్యతగా ఒక మంచి నిర్ణయం తీసుకోవాలనీ, ఆ నిర్ణయాన్ని నిజం చేసినవారికి డాక్టరేటులాంటి గౌరవం లభించటం' లాంటి సంప్రదాయం ప్రతి కళాశాలలో ఉంటే చాలామంది విద్యార్థులు సమాజాన్ని మార్చేందుకు ముందుకువస్తారు.

నవలలో ఒక చిన్న లోపం అందానికి అతీతుడిని అంటూనే వినయ్ తను ప్రేమించిన అందమైన వితంతువు వసంతనే పెళ్ళిచేసుకోవడం అంత గొప్పగా ఏమీ లేదు. అలాకాకుండా వేరే ఏ ఆధారంలేని వితంతువుని చేసుకునిఉంటే ఆదర్శానికి చక్కటి అర్థం వచ్చేది. నవల ఆద్యంతం విసుగులేకుండా చదివించింది. బాపిరాజు, సూర్యనారాయణ, వెంకటరత్నం పాత్రలద్వారా నవ్వింపజేసింది. రచయితకు ధన్యవాదాలు.

-జె.సుకన్య,
కొత్తపల్లి.

## వినోదభరితం

*(మూడవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

**ఆ**గస్ట్ నెల నవల 'హీరో' కాలక్షేపంగా చదవడానికి పనికివచ్చే నవలే అయినా, ఆరోగ్యకరమైన హాస్యంతో వచ్చిన ఓ మంచి నవల అనీ చెప్పవచ్చు. నవల చదవడం మొదలుపెట్టిన తరువాత ఎక్కడా విసుగు అనిపించకుండా చివరివరకూ సాఫీగా సాగిపోతుంది. దానికి కారణం రచయిత శైలి.

ఇందులోని పాత్రలన్నీ నిత్యజీవితంలో మనకు తారసపడేవేగాని ఆకాశంలోంచి ఊడిపడ్డవి కావు. అందుకే నవల సహజంగా ఉండి పాఠకులను ముందుకు తీసుకుపోతుంది. బాపిరాజు పాత్ర వినోదప్రధానంగా సాగి పాఠకుల్ని తప్పక ఆకట్టుకుంటుంది.

అయితే 'హీరో' వినయ్ ఆదర్శవాదియై ఉండి, కావాలని వితంతువును వివాహమాడి కూడా ఆమె మొదటి భర్త పేరు ఎత్తగానే కస్సుమనడం అసహజంగా ఉంది.

కళ్యాణమ్మ, సూర్యనారాయణలు పైకి 'ఒకరిమీద ఒకరు కస్సుబుస్సులాడినా మనసులోని ఆత్మీయత, అభిమానం భార్యాభర్తల బంధంలోని మధురిమలను పాఠకుల హృదయాలకు చవిచూపిస్తాయి. వినయ్‌ని ప్రేమించిన అనసూయ, బాపిరాజుతో వివాహానికి అంగీకరించడం, మధ్యతరగతి కుటుంబీకుల్లోని రాజీధోరణికి ఓ చక్కని ఉదాహరణ.

రచయిత అక్కడక్కడా సంభాషణల్లో చూపిన చమత్కారం పాఠకుల పెదవులమీద చిరునవ్వును మెరిపిస్తుంది. రచయిత సన్నివేశాల అల్లికలో చూపిన మెళకువ సబ్జెక్ట్‌తో ఇంకా లోతుగా వెళ్ళటంలో కూడా చూపివుంటే రాణించివుండేది నవల.

ఇటువంటి నవలల ప్రచురణ కొత్త రచయితలకు ప్రోత్సాహకరంగా పాఠకులకు వినోదభరితంగా అనిపిస్తూనే ఓ సమస్యను ఎత్తిచూపటం 'చతుర' పాఠకులకు సంతృప్తి కలిగిస్తుంది.

-ఎన్.శివనాగేశ్వరరావు
మునగపాక

## జీరో అయిన హీరో

*(నాలుగవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

**వి**తంతువుని పెళ్ళాడి ఆమెకు నూతన జీవితాన్ని ప్రసాదించాలనుకున్న హీరో వినయ్ ఆశయం గొప్పదే అయినా ఏ అనాథనో, జీవితంలో దెబ్బతిన్న వారినో చేసుకుని ఉంటే ఆ ఆశయానికి పరిపూర్ణత చేకూరేది. ఒక వితంతువును పెళ్ళిచేసుకోవడంలో ఎదుర్కొ

నాల్సొచ్చే ఆర్థిక సాంఘిక సమస్యలను కూలంకషంగా విపులీకరించడమే కాకుండా తగు పరిష్కారాన్ని సూచించడానికి వీల య్యేది.

కానీ అందం, చదువు, ఆస్తి అన్నీ ఉన్న వసంతను ముడిపెట్టడంతో కథాలక్ష్యం దెబ్బ తిందేమో అనిపిస్తుంది. ఆమె వితంతువే అయినా సమస్యల్ని చిత్రీకరించడానికి అవకాశమేది! అందుకే రచయిత మానసికంగా హీరో కష్టాల్ని అనుభవించినట్లు మలుచుకొచ్చారు. భార్య మాటిమాటికి మొదటి భర్తను గుర్తుచేస్తూ ఇబ్బందిపెడుతున్నా అదంతా ఓర్పుగా, మంచితనంతో భరించడమే వినయ్ హీరోయిజంగా మనం భావించాలి.

బావలమీద ఆశలుపెంచుకోవడం మరదళ్ళకు సహజమే అయినా ఆ ప్రేమ విఫలమైనప్పుడు నిరాశతో కృంగిపోకుండా తనను ప్రేమించే వారిని చేసుకొని బ్రతుకు పండించుకొమ్మని వినయ్ మరదలు అనసూయ పాత్ర ద్వారానూ, చిన్నప్పటిలాగా యుక్తవయసు వచ్చాకా బిడ్డలపై తమ అభిప్రాయాలను రుద్దకుండా పెద్ద మనసుతో ఉండాలని వినయ్ తల్లిదండ్రులద్వారాను చెప్పుకొచ్చారు. వినయ్ ఫ్రెండ్ బాపిరాజు పాత్ర అనసూయను, వినయ్ తల్లిదండ్రులను ఓదార్చడమే కాకుండా జోక్‌లతో సరదాగా జీవితాన్ని గడపమని చెప్తుంది. రచయిత నవల్లో సందేశాన్ని ఇమడ్చాలని ప్రయత్నించారే కానీ ఆద్యంతం వినోదమే ప్రస్ఫుటిస్తుంది. సస్పెన్స్ ఏమీలేకున్నా అసభ్యత, అశ్లీలత మచ్చుకైనా కనబడకుండా సకుటుంబంగా చదివి మనసార నవ్వుకోవచ్చు. పేరుకి, కథనానికి కొంచెం పొంతన కుదరకపోయినా మొత్తంమీద నవల చాలా బాగుంది.

-కె. హైమవతి,
రామగుండం.

## సామాజిక స్పృహ ఉన్న రచన

*(అయిదవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

ఇతివృత్తం పాతదే అయినా, పాత్రల నెన్నుకొన్నతీరు, కథను నడిపించిన వైనం, శైలి వెరసి 'హీరో' నవల ఒక మంచి రచన.

"నిరసనలకు నీరసించి పోయేవాడు సంస్కర్త కాజాలడు' అన్న పెద్దల సూక్తిని అక్షర సత్యంచేస్తూ, ఎన్ని అడ్డంకులొచ్చినా వెరవని దృఢచిత్తంతో, ధీరోదాత్తత కల్గిన వ్యక్తిత్వాన్ని హీరోకి ఆపాదించారు.

అయితే కాలేజి ఫంక్షన్‌లోను, వివాహానికి ముందు ఎన్నో ఆదర్శాలు చెప్పిన హీరో వినయ్ పెళ్ళి తరువాత వసంత తన మొదటి భర్త జ్ఞాపకాలను గుర్తుచేసుకొంటుంటే సహించలేకపోవడం హీరో పాత్రకి కొంచెం "నెగిటివ్ పాయింట్"లా అనిపించింది. మొదటి భర్త ఆమెకి ఎంతో అనురాగాన్ని పంచి ఇచ్చి ఉండవచ్చు గదా అనుకుని ఆమెను ఆ జ్ఞాపకాలనుండి దూరంచేసి తనవైపు ఆకర్షితురాలిగా చేసుకోవడంలోనే హీరో గొప్పతనం ఉంటుంది.

సంధియుగపు ప్రతినిధిగా సూర్యనారాయణ ఛాందస భావాలు కలిగిన, ఒక సామాన్య గృహిణిగా, కళ్యాణమ్మ పాత్రల్ని చిన్నతనంలోనే భర్తను పోగొట్టుకున్న కూతురికి తల్లి దండ్రులుగా వెంకటరత్నం, తాయారమ్మ పాత్రల్ని, చక్కగా మలిచారు.

మొత్తంమీద సామాజిక రుగ్మతపై ఒక అవగాహనతో ఈ 'హీరో' నవల రాసారు బలరాంగారు. చాలా సంతోషం.

-నేమాన వెంకటరమణ,
తిరుపతి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

